# ప్రవేశిక

సామాన్యమైన పుస్తకము పడవ ప్రయాణము వలె అట్టే కదలిక పుట్టించదు. చదివేటప్పుడు కాలము మృదువుగా వెళ్ళిపోతుంది. ఏ విధమైన శ్రమా కలగదు. చివరకు పుస్తకము మూసివేసి నిద్రపోతాము. మర్నాడు దాని సంగతి తలపెట్టము. ఆ పుస్తకము విస్మృతి కుహరములో పడిపోతుంది.

తరుచుగా పుస్తకాలు ఇలా యెందుకుంటవి అని ఆలోచిస్తే రెండు విషయాలు స్ఫురిస్తున్నవి. మొదటిది రీతి, రెండవది వస్తువు. ఈ రెండింటి వల్లనే ఏ పుస్తకానికైనా సామాన్యత్వము కాని విశిష్టత్వము కాని సంప్రాప్తిస్తుంది.

విపరీత నేపథ్యము ధరించి వీధివెంట వెళ్ళే వ్యక్తి చప్పున నేత్ర గోచరమవుతాడు. అతని వేషము రమణీయముగా ఉన్నా ఉండకపోయినా అపూర్వముగా ఉండేసరికి అందరూ వింతతో అతనికేసి చూస్తారు. అనేకులకు అతని రూపము వల్ల అశాంతి కలుగుతుంది, కాని వీధివెంట వెళ్ళేవారిలో ఇంచుమించుగా నూటికి తొంభై తొమ్మిదిమంది దుస్తులలో ఏమంత తారతమ్యము కనబడదు. అందువల్ల ఎక్కువమంది భేదము గమనించరు. అదే మోస్తరుగా సాధారణమైన రీతిని పాఠకవర్గము గమనించదు; దాని విషయమై ఏమీ అనుకోదు.

మామూలు నవలలో ఉండే వస్తువు సామాన్యుల దృష్టికి సరిపడుతూ వాళ్ళ ఊహలను ఆశయములను నీతులను సిద్ధాంతములనూ ప్రతిపాదిస్తుంది. అందుచేత ఏ విధమైన కల్లోలమూ కలిగించదు. చెప్పిన మాటలల్లా వినే పిల్లకాయలవలె ఉండే నవలలు పాఠక వర్గానికి అశాంతి కలిగించవు. ఇటువంటి వానిని ఎవరూ ఏమీ అనరు; త్వరలో మరిచిపోతారు.

ప్రస్తుత గ్రంథము సామాన్యులకు చాలా ఆందోళన కలిగిస్తుంది. ఎప్పుడైతే పుస్తకము మనస్సులో ఆందోళన కలిగిస్తుందో అప్పుడే దానిలో జీవము ఉన్నదని చెప్పవచ్చు. త్రాణగల పుస్తకాలు చాలా కదలిక పుట్టిస్తవి. అదివరలో మనకు నీహార స్వరూపముగా ఉన్న వృత్తులను, సంశయాపన్నమైన భావాలను దృఢపరుస్తవి. అలా కాకపోతే పాత ఊహలను పారదోలి నూతన భావాలను రవులుకొల్పుతవి. "శశిరేఖ" ఈ జాతిలో నవల అని చెప్పడానికి ఎంతమాత్రమూ సంశయము లేదు.

చాలామందికి ముందుగా కష్టము తోచేది దీని శైలివల్ల. ఈ కథకుడి శైలి రమణీయమనీ ప్రశస్తమనీ మేము చెప్పడము లేదు. అచ్చు తప్పులే కాక కొన్ని లోపములు కూడా ఉన్నవి. అయినప్పటికీ శైలి సజీవముగా నున్నదని మా తాత్పర్యము. గ్రంథకర్తకు త్రాణ ఉన్నప్పుడే శైలిలో ప్రాణముంటుంది. పాఠకవర్గము ఈ విషయములో ఓర్పు వహించవలెను.

ఇటువంటి పుస్తకాలు చదివేటప్పుడు సహనము చాలా అవసరము. తమ ఊహలకు విరుద్ధముగా కనబడే భాగాలలో చదువరులు వృథోద్వేగము పొందకూడదు. గ్రంథము పూర్తి అయ్యేవరకూ శాంతిపూని, కవి హృదయమేమిటి? దాన్ని ఏ విధముగా నిర్వచించినాడు? కావ్యము రసవంతముగా ఉన్నదా లేదా? మొత్తముమీద గ్రంథ తాత్పర్యము ఏమిటి? అనే ప్రశ్నలు వేసుకొని తగు సమాధానము చెప్పుకోవలెను.

ఈ నవల నీతిబాహ్యమని కొందరంటారు. కాదని మరికొందరంటారు. సాహిత్యానికి నీతితో పనిలేదు. రమణీయార్థము ప్రతిపాదించడమే కావ్యోద్దేశము. నీతులు ఏకరువు పెట్టడమే ప్రధానమైతే వ్యాసాలు వ్రాసుకోవచ్చును. ఉపన్యాసాలు చెప్పుకోవచ్చును. రెండూ కాకపోతే ధర్మగ్రంథము రచించుకోవచ్చును అని చాలా మంది రసికుల ఆశయము. "కాంతాసమ్మితతయా ఉపదేశయుజే కావ్యమ్". కాబట్టి కథావ్యపదేశముతో కావ్యము నీతినే బోధించవలె. అయితే అవినీతిని కూడా వర్ణించవచ్చు. అందువల్ల దానిమీద లోకులకు

వైముఖ్యము కలిగించి నీతి మార్గము వైపు అభిముఖ్యము కలిగించవలె గ్రంథములో ఎటువంటి విషయాలు వర్ణించినా చివరకు సమస్తమూ నీతి యందే పర్యవసన్నము కావలె అని మరికొందరు సహృదయుల తాత్పర్యము. వస్తువు నీతికి ఈషణ్మాత్రము కూడా విరుద్ధముగా ఉండరాదు. అలా ఉంటే రసహాని అవుతుంది. కాబట్టి ధర్మ సంగతమైన విషయాలు మాత్రమే కావ్యాలలో నిబద్ధము చేయవలె అని మరికొందరి శాసనము. గ్రంథకర్తలు ఇందులో ఎవరి మాటలు వినవలె ?

"నిరంకుశాఃకవయః" అని సూక్తి. ఉద్రిక్త హృదయులైన కవులను ఎవ్వరూ నిర్బంధించలేరు. ఆవేశముతో వారు అనేక విషయాలు వర్ణిస్తారు. కొన్ని సంఘనీతికి అనుకూలముగా ఉంటవి. మరికొన్ని ప్రతికూలముగా ఉంటవి. ఎలా ఉన్నప్పటికీ మన కవి గ్రాహ్యములే. ఎందుచేత? సామాన్యులు గ్రహించలేని సంగతులను కవులు ప్రతిభా విశేషముచేత గ్రహిస్తారు. వస్తుతత్వము వారికీ బాగా అవగతమవుతుంది. ప్రతిపదార్థములోనూ ఉండే గంభీరత్వము నైశిత్యమూ వారికి సాక్షాత్కరిస్తవి. అందుచేత వారిది సూక్ష్మదృష్టి గౌరవించక తప్పదు.

అయితే నిరంకుశులము గదా అని కవులు తోవా తెన్నూ లేకుండా ప్రవర్తిస్తారా? ప్రవర్తించరు. ప్రతివారికీ ఏదో నియమము ఉండక తప్పదు. ఆ నియమము మనము పెట్టుకొన్న నియమము కాకపోవచ్చును. అంత మాత్రాన వారిని నిందించడము యుక్తము కాదు.

కళ్ళకు జోడుకట్టిన గుర్రానికి ఎదుటి మార్గము తప్ప మరేమీ కనబడదు. సంఘానికి కూడా అంతే. తన నీతికీ రేఖామాత్రము వ్యతయ్యము కనబడినా సంఘము గిజగిజలాడుతుంది. దేశకాల పాత్రములను బట్టి నీతులు మారుతూ ఉండేవి. నేడు మనము గొప్పవనుకొన్నవి రేపు మారిపోవచ్చును. నేడు దూష్యములనుకొన్నవి రేపు మాన్యము కావచ్చును. ఏదీ శాశ్వతమనడానికి వీలులేదు. పరస్పర సంబంధాన్ని బట్టి ఏదైనా నీతిగాని అవినీతికాని అవుతూ ఉంటుంది. సూక్ష్మదృష్టి గల కవులు చంచల విషయాలలో గర్భితమై అనుస్యూతముగా ఉండే శాశ్వత విషయాన్ని గ్రహించి లోకమునకు చూపిస్తూ ఉంటారు. అందువల్ల ఉత్తమ కవితలో ఉత్తమ ధర్మముంటుంది. .

సాంఘిక ధర్మములకంటే మానవ ధర్మములు ఉత్తమమైనవి. సంఘము తన స్థితికోసమై తాత్కాలికముగా ఏదో నియమవాగురను అల్లుకొంటుంది. సంఘము హెచ్చా, వ్యక్తులు హెచ్చా అనే ప్రశ్న బాధిస్తూనే వుంటుంది. సామాన్య బుద్ధులకు సంఘమే హెచ్చనీ, అవసరమైతే వ్యక్తులను సంఘము కోసము బలి ఇవ్వవలిసి వుంటుందనీ చెప్పుతారు. ఉన్నత దృష్టితో చూచిన యెడల స్థితప్రజ్ఞులను కనడమే మానవ సంఘమునకు లక్ష్యము. అట్టి సందర్భములో సాంఘిక నియమాలను నిజౌన్నత్యము కోసము అతిక్రమించే వ్యక్తులను ధర్మేతరులని కాని విప్లవకారులని కాని అనడము సమంజసము కాదు. సాహసికుడైన ఈ గ్రంథకర్త నిజ ప్రజ్ఞానుసారముగా ప్రేమతత్వాన్ని నిరూపించడానికి ప్రయత్నించినాడు. ప్రపంచములో శాశ్వతమైనది ప్రేమ ఒకటే అని భావుకుల అభిప్రాయము. ప్రేమకోసము సమస్తమూ త్యజిస్తాము. ఎన్ని కష్టాలైన పడతాము. స్వార్థము వదలివేస్తాము. ప్రేమ అనేది లేకపోతే లోకానికి నాగరికత అలవడేదేకాదు. ప్రేమవల్లనే మానవులు దేవతలకు సన్నిహితులవు తారు.

అట్టి ప్రేమాన్వేషణకై స్త్రీ పురుషులు లోకయాత్ర చేస్తున్నారు. ప్రేమ దుర్లభమైనది. ప్రతివ్యక్తీ దానికోసమై ప్రయత్నము చేయడములో అనేక కష్టములు సంభవిస్తవి. తరచుగా తప్పుదారిని పోవటము తటస్థిస్తుంది. మరీచికలను చూచి మంచినీళ్ళని భ్రాంతి పడడము కూడా పొసగుతుంది. అదృష్టవంతులైన వారికి ఈ జన్మలోనే అమృతత్వము లభిస్తుంది. కొందరికి మరణానంతరముననే కాని లభించదు.

ప్రేమ శాశ్వతమా చంచలమా అని కొందరు ప్రశ్నిస్తారు. గాఢానురాగము శాశ్వతము కాదని యెవరనగలరు? అయితే జీవితములో ప్రేమ ఒకేసారి కలుగుతుందా అనేక పర్యాయములు ఉదయిస్తుందా? ఈ విషయ

ములో మతభేదాలున్నవి. ప్రేమామృత ఝరి హృదయములో నిరంతరమ
ప్రవహించేవారు ఎక్కువసార్లు ప్రేమించగలరు. ఏక కాలములో ఇద్ద
వ్యక్తులను మాత్రము సమానముగా ప్రేమించడము అసంభ వము. ఒక
మీది అనురాగము సడలిపోయి తర్వాత ఇంకొకరి మీదికి ప్రసరించ వచ్చున

ఈ కథానాయిక సామాన్య స్త్రీకాదు. ఈమె ప్రేమైక జీవిని. అందుచేత
తనకు యోగ్యుడైన ప్రియునికోసమే ఎట్టి త్యాగమైనా చేసింది. స్వాతంత్ర్యముల
సామాన్య స్త్రీలవంటి పతివ్రత ఈమెకాదు. స్వధర్మ ప్రకారము ఈమె నిస్సంశ
ముగా పతివ్రత.

ధర్మసూక్ష్మములు గుర్రెరిగిన మన పూర్వకవుల పురాణాలలో ఇ
నాయికలను సృష్టి చేసినారు. ఆరోగ్యవంతులైనవారి దృష్టికి ఇట్టి స్త్రీ
దుష్టలుగా కనబడలేదు.

పై సంగతులు నన్నింటినీ సావధానముగా మనస్సులో నుంచుకొ
మాత్సర్యము విడిచి ఈ నవలను శాంతముగా చదువుట యుక్తము.

శ్రీ శివ శంకరశాస్త్రి

"సఖి" ఆఫీసు, గుంటూరు
ఫిబ్రవరి 22-1926

# శశిరేఖ

ఒకనాటి సాయంకాలము ఆరుగంటలప్పుడు పదునారేళ్ళ బాలిక యొకతె, కడవ చేతులో పట్టుకొని కాలవవైపు పోవుచుండెను. ఆ బాట దట్టముగ పెరిగిన మర్రిచెట్లచే పందిరివలె కప్పబడ్డది. భూదేవత దాల్చిన నూత్న వస్త్రములవలె రెండు వేపులను పెద్ద పచ్చిక బయళ్ళు, ముడిలో లొంగక ముఖముపై, మెడపై, చెవులపై గుంపులుగా వేలాడు ఆ బాలిక జుట్టులో చిక్కుకుని ప్రకాశించుచున్నవి సూర్యకిరణములు. నల్లని ఆమె కన్నులలోపడి మార్పుచెంది, పెదవులనుండి చిరునవ్వు రూపమున ప్రతిఫలించినదా అనునట్లు లేయెండ ఆమె మోమును ఆకుల సందులలో నుండి స్పృశించుచుండెను. యవ్వన జనితమగు సంతోషము ఆమె యవ యవముల నుండి నిగనిగ లాడుచుండెను. కారణ రహితముగ పొడము ఆనందము ఆమె యిడు ప్రతి అడుగునుండియు, వ్యక్తమగుచున్నది. ముందు ఇతరులకిచ్చి తాననుభవింపగల ప్రేమ ఆమెయందు సృష్టిచే సేకరింపబడుచుండెను కాబోలు ! కాకున్న ఆ విసురు నడకలూ చంచలములగు చూపులూ, నిష్కారణముగ కలుగు చిరునవ్వులూ - వాని అర్థమేమి?

ఆమె శరీరము పలచనగను, కొంచెము పొడగుగనున్నది కాని, ప్రతి అవయవమును గుండ్రముగా నున్నది. ఆటంక రహితముగ, స్వేచ్ఛగా పెరిగిన ఆమె దేహము అప్పుడే సంపూర్ణము నొందు యవ్వనమును సూచించుచున్నది. అచ్చటి సృష్టిసౌందర్యమును గ్రోలుచున్నట్లు సంపూర్ణముగ తెఱచికొని యున్నవి ఆమె నల్లని విశాల నయనములు. యెర్రని ఆమె పెదవులును, వొంపు తిరిగిన అందమైన ఆమె ముక్కును నిర్మల వాయువును రుచి చూచుచున్నవి. అట్లను కొనుటకు ఆధారము వెతుకు తీగవలె, ఆమె హృదయ జనితమగు ప్రేమ నలుదిక్కు

లను కళ్ళలో నుంచి వెతకుచున్నదా ! లేకున్న ఒక్కచో నిలువని ఆ చూపు లెందుకు
ఆనంద ప్రవాహము రక్తమున కలిసి పొంగుచున్నదా? లేకున్న ఆపరా
చలనమెందుకు, దేహమున?

లాకులవద్దకు ఆమె పోవునప్పటికి అచ్చట, తలుపుపై కూర్చునియుండి బాలుడొకడు, చివాలునలేచి, పట్టలేని సంతోషముతో ఆమెను సమీపించెను ఇద్దరును కలిసి అచ్చటనున్న తురాయి చెట్లు కిందికిపోయి, సిగ్గును, విచారము భయమునులేని పసిపిల్లలవలె పచ్చికపై కూర్చుండి పరస్పర స్పర్శన సుఖము మైమరచిరి, ఒకరి హస్తము నొకరు గ్రహించుట తోడనే వారికే తెలియని ఆనందము ఆ యిద్దరి హృదయములను కలిపివేసినది. రెండు లేత హృదయముల సమ్మేళనము కన్న ఆనంద జనకమైనది లోకమున నేది! ఎర్రటి పుష్పములను వారిపై చెట్ల విదిల్చెను. గాలి వారిరువురి నొకటిగ కౌగలించెను. ఒక్కొక్క నక్షత్రమే వారిపై ప్రకాశింపనారంభించెను. ఆకసమున మబ్బుల అంచులను సూర్యుడు మెరుగ పెట్టుచుండెను. కాలము నెరుంగక యొడ లెరుంగక సమస్తమును మరచి వారిరువురునట్లే యుండిరి. తుదకు బాలిక పొద్దుపోయి నదని లేవగా అతడ కడవను జలమున ముంచి ఆమె భుజముపై పెట్టెను. ఇద్దరును యూరువైపు నడువ నారంభించిరి.

బాలు – నీకు బరువుకాదూ?

బాలి – నాకు బరువైతే ప్రతిరోజూ ఎవరు సహాయము చేశారో ?

బాలు – ఏదీ, బుజము చూడనీ, కందిందేమో !

బాలిక పలుకలేదు.

బాలు – కోపం వచ్చిందా ? పోగొట్టనా ?

బాలి – వద్దులే.

కొంతసేపు మాటలు లేవు.

బాలు – ఈ రాత్రి వాళ్ళతో తప్పక మాట్లాడతావు కదూ ?

బాలి – తప్పకుండా.

బాలు – నా ప్రాణం నీ చేతుల్లో వుందని మరిచిపోకూ ! మళ్ళీ చెప్పు, ఏం మాట్లాడుతావు ?



బాలి – నేనంతా చేస్తానుగా. నామీదంత మాత్రం నమ్మకం లేదూ ?

బాలు – నా భయం అట్లా అనిపిస్తుంది.

అని తటాలున ఆమె త్రోవకడ్డముగా నిల్చుని చేయిపట్టుకొని

బాలు – నా మీద నీకు ప్రేమ ఉందీ ? నిజంచెప్పు.

బాలి – లేదూ ?

బాలు – చాలాసార్లు నువ్వు నా ప్రేమతో ఆడుకుంటున్నావేమో అని భయం వేస్తుంది.

బాలి – పోనీలే, ఒకళ్ళ లోపల ఉద్దేశ్యాలు ఇంకొకళ్ళలో ఉన్నాయనిపిస్తుంది.

బాలు – అట్లాగా ? ఇంకా సందేహమే ?

బాలి – సందేహింపబడిందెవరు కృష్ణా ?

అని నవ్వుచు ఆమె చీకటిలో మాయమైపోయెను.

బాలు – శశీ !

దూరముగ నవ్వు మాత్రము వినపడెను.

బాలు – ఒక్కసారి.

"రేపు" అని కేక వైచి శశిరేఖ తన యింటిని చేరెను.

ఆమె తల్లి వంటచేసి వాకిట కూర్చుని యుండెను.

తల్లి – అమ్మాయీ ! ఇంత పొద్దుపోయిందాకా యేం చేస్తున్నావే ?

శశి – పొద్దస్తమానం యింట్లో వుంటాను చాలదూ ? సరే కాని, నాన్న ఎంత సేపటికి వస్తారు ?

తల్లి – కొంచెం పొద్దుపోయి కాని రానన్నారు యివాళ. ఎందుకు?

శశి – మీతో ఒక సంగతి చెప్పాలనుకున్నాను. పోనీ చెపుతాను, కోప్పడవు కదా ?

తల్లి – సరే చెప్పు.

శశి – నాకెన్నో యేట పెళ్ళయింది ?

తల్లి – ఎందుకిప్పుడు ? పదోయేట.

శశి - నాకు పెళ్ళొద్దని యేడ్చాను జ్ఞాపకం వుందీ ? నాకు రామారా
తప్ప ఎవరూ వద్దని.

తల్లి - అవున్లే.

శశి - నేను వద్దంటూ వుంటే నా కిష్టంలేని వాడికిచ్చి పెళ్ళి చెయ్యడ
మీకు న్యాయమేననుకున్నారూ?

తల్లి - చిన్నదానికి నీకేం తెలుసును? రామారావు ఈడెక్కడ నీ యీడెక్కడ
అతన్ని వాళ్ళ వాళ్ళు సీమ పంపుతూవుంటే నీ కోసం ఆగి నిన్ను పెళ్ళి చేసుకుంటా
గావును?

శశి - అతను వచ్చిందాకా వుంటాననలేదూ?

తల్లి - చాల్లే, తెలిసీ తెలీని మాటలు. ఇప్పటికింకా అతను వచ్చే జాడలే
కదా ! ఇప్పటిదాకా పెళ్ళిలేకండా ఉండేదానవు గావును!

శశి - అది పోనీ, నాకు బుద్ధి వచ్చేదాకా అన్నా వుంచారూ? అయిందే
అయింది. మిమ్మల్నని యేం కార్యం? ఇంతకూ నే చెప్పేది చెప్పినానుగా ! ఇప్పు
మీరు చేసిన సంబంధం నాకు ఇష్టంలేదు. పెళ్ళిలో అతన్ని చూసి ఇష్టంలేక ఏడ్వా
కానూ? అప్పణ్ణించీ అప్పుడప్పుడు నేను చూచిన దాన్నుంచీ, వినిన సంగతులని
అతనితో కాపరమంటే భయంగా అసహ్యంగా తోస్తోంది. అంత గర్విష్టీ, స్వార్థపరు
ఎవరూ లేరు. ఏమైతేనేమి ! అతనిమీద నాకు ప్రేమలేదు. అతను నాకు
కాలేదు. నేనిదివరకే మీతో ఆ సంగతి చెప్పినాను. రేపు కార్యమంటున్నారు. ఇప్పు
చెప్పుతున్నా నా కది యిష్టంలేదు.

తల్లి-నీకేమన్నా మతిపోయిందా ? ఎవరన్నా యీ సంగతులు బోధిస్తున్నా
పిచ్చిమాటలాడక నోరు మూసుకో. అతనికేం లోపమని నీకిష్టంలేదు ? కురూ
కుంటా, గుడ్డా, దరిద్రుడా ఏమని అక్కర్లేదంటున్నావు? ఎవరన్నా వింటే సవ్వరు
ఎటువంటివాడైనా భర్తని దైవముగా చూచుకోమన్నారు. ఇంతేనా నీ తెలివి ?

శశి - ఈ వాదాలు చాలా సార్లయినాయి. ఎప్పుడో ఎవడో మా యిద్దరి
కూచోపెట్టి, అర్థంలేని వాగుడు వాగినాడని, ఎల్లకాలం ఇష్టమున్నా, లేకపోయిన
పడి యేడవమన్నావూ? నేను కోరుకున్నానా, చేశానా! మీరెవరు నన్నిట్లా కట్టివెయ
డానికి? తలుచుకున్నపుడల్లా హృదయం దహించుకుపోతుంది. ఇప్పుడే చెపుతున్నా



నేను చిన్నదాన్ని కాదు, తెలీకపోవడానికి ? రేపు వాళ్ళని కార్యానికి రానిచ్చారంటే
మీకూ వాళ్ళకీ కూడా మాట దక్కదు.

తల్లి - బాగానే వుంది. చివరికి, కనిపెంచినందుకు ఉద్ధరిస్తున్నావు తల్లీ.
అమ్మా, యివేం బుద్ధులు, కులానికీ, కన్నవాళ్ళకీ కీర్తి తెచ్చేది. పోనీ పోనీ అని
వూరుకున్న కొద్దీ మించిపోతోంది వ్యవహారం. ఇవాళ మీ నాన్నగారు రానీ
కనుక్కుంటాను, ఎవరి పంతం నెగ్గుతుందో? తప్పకుండా వెంటనే వాళ్ళని రమ్మని
రేపు వారంనాటి ముహూర్తా నికే కార్యం చేస్తాను. ఏదో వాళ్ళ చేతుల్లో పడితే,
అటు తరువాత వాళ్ళ యిష్టం నీ యిష్టం. ఏమిటో ఆ బెదిరింపు చూస్తానుగా !

శశి – నాకు భయం గావును ! కార్యానికి యిక్కడ కొచ్చినప్పుడు ఆయనతోనే
చెపుతాను నాకిష్టంలేదని, బుద్ధి కలవాడా, మానుకు వెడతాడు. పట్టుపట్టినాడా
అంత బుద్ధిహీనుడు లేడని మీకూ స్పష్టమౌతుంది. అయినా అంత చదువుకున్నవాడికి
అంత బుద్ధి లేకపోతుందీ ?

తల్లి - మొగుడింటికి కాపరానికి పోకుండా ఏం చేస్తావే, నిర్భాగ్యురాలా ?

శశి - మీ దగ్గిరే వుంటాను. మీకంటే నాకింకెవరు కావాలి? (కొంచెం
యోచించి) నాకు మనసు కుదిరినవాడు కనబడితే పెళ్ళి చేసుకుంటాను, ఎప్పుడో
ఒకప్పుడు.

తల్లి - ఛీ, ఛీ నోరుముయ్యి. విపరీతం బుద్ధులు పుడుతున్నాయేమే యిట్లా!
సీమెళ్ళిన రామారావు వెతుక్కుంటో వస్తాడా యేమిటే నీ కోసం ?

శశి - అదికాదు. అతన్ని ఎప్పుడో మరిచిపోయాను. సరే, ముందుగా
చెప్పినాను మీతో. తరువాత నన్నంటే లాభంలేదు.

అని ఆమె లోపలికి పోయెను. ఏమో గొణుగుకొనుచూ ఆమె తల్లి అక్కడే
కూర్చుని యుండెను.

## 2

సూర్యాస్తమయ సమయము కాలువవద్ద నిశ్శబ్దముగ నుండెను. చుట్టుపక్కల
నెవ్వరును లేరు. తురాయి వృక్షము క్రింద మన స్నేహితులిద్దరును ఆనంద
సల్లాపముల నుండిరి. ఎండలేదుగాని వింతయగు తెల్లని రంగు ఆకసము నుండి
భూమిపై ప్రవహించుచుండెను. శశిరేఖ ఎత్తయిన రాయిపై కూర్చుని యున్నది.

కృష్ణుడు మోచేతిపై  నానుకొని ఆమె పాదములవద్ద పచ్చికపై బరుండి, ఆమె నేత్రముల నుండి వచ్చు ప్రేమా దృష్టులను ఆస్వాదించుచున్నాడు. ప్రేమతో నిం యుండు హృదయమునకు ఏ కొలది వరమైనను మహానందము నొనరింపగలదు ఇంతకన్న వేరు స్వర్గమును నిరుపురును కాంక్షించుటలేదు. శరీరమును, హృద మును, సర్వశక్తులను సిద్ధమై ప్రేమ చుంబనముకొరకు వేచియుండు సమయ వంటి ఉత్సాహసమయము జీవనమున ఏ మనుజుడును పొందడు. ఆ కాలమే స్వర్గము. స్వర్గమున్నను అంతకన్న ఆనందము నిచ్చుట దురూహ్యము. ఒండొరు చేతులు కలిసి, ఒకరి ముఖారవిందము నొకరు అతి తృష్ణతో అవలోకించుకొనుచు పలుకులే అమృతముగ తాగుచున్నారా యనునట్లు రహస్యభాషణముల వా అమూల్యమగు నిమిషముల గడిపిరి. మేఘముల నుండి మెల్లమెల్లగా కాం తగ్గిపోవుచున్నది. సూర్యుని వేడి కౌగిలిని వదలిన భూమి అలసి మూర్ఛ నొందుచు ట్లున్నది. సరుకు చెట్టుపై రెండు చిలుకలు మాట్లాడుచున్నవి. నేలపై గోరువం యొకటి కడపటిసారి నోరు నించుకొనుచుండెను. చెట్టు వెనుకనుండి యుడు యొకటి తొంగిచూచెను. గాలివలన కాలువలో నీళ్ళు చప్పుడు చేయుచుండెను రెండు బాతులు తేలియాడుచు స్వేచ్ఛా ప్రేమ విహారమును గావించుచుండెను ఆహా పక్షులలో ప్రేమ యెంత సరళము, యెంత సులభము! మానవునకేనా ఇన్ని యాటంక ములు ? ఆ సమయమున ఆ ప్రియాప్రియుల సంతోషాధిక్యత నెవ్వరు తెలిసికొనగలరు, అనుభవించినవారుగాక ! ఒక్కగంట అట్టి సంతోషము కొరకు రాజ్యములను, ధనరాసులను, కీర్తిని, మోక్షమును, యావజ్జీవన సౌఖ్యము నర్పింపవచ్చును. అర్పింప సందేహించువారిది దౌర్భాగ్యము. నిమిష నిమిషము ఒండొరుల సౌందర్యము వింత యుద్రేకమును గొల్పుచుండ, ఒండొరుల పల్కుల ముఖముల నూతన కళలచే నింపుచుండ, ఒండొరుల దేహస్పర్శ ప్రతి నరమును ప్రతి రక్తబిందువును తమ్మిరియందు లాగుచుండ, బాధయు సౌఖ్యమును తెలియని ఆ స్థితి నెవరు వర్ణింపగలరు! పడమట శుక్రుడు కాంతిని కార్చుచున్నాడు. కాంతివలె చీకటి భూమిని కౌగిలించుకొనుచున్నది. నక్షత్రములు రాలి ఆకులలో చిక్కుకున్నట్లు మిణుగురు పురుగులు చెట్లలో మెరయు చుండెను.

కృష్ణ - ఎంత అందంగా వున్నావు !

శశి - నీ కంటేనా ?



కృష్ణ - ఆ చిత్రకారుణ్ణయితే నీ బొమ్మ రాసేవాణ్ణి, కాని, ఆ వంటి వంపులన్నీ ఎట్లా కనపర్చేవాడిని! పోనీ కవినయితే, ఎన్ని పాటలు చేసేవాడిని నీ మీద. కాని ఎన్ని మాటలైనా ఎన్ని రాగాలైనా ఆ ముఖము అందమన్నా తెలియజేయగలవా? కాని ఏమీ కానుగా ?

శశి - ఆ పనులేమీ చెయ్యనక్కరలేదు, నా దగ్గిరిట్లా కూర్చుంటే అంతేచాలు.

కృష్ణ - ప్రేమ అనే దానికి తృప్తిలేదు. ఎంత తాగినా ఇంకా కావాలనిపించేది అది ఒక్కటిలాగే వున్నది. నువ్వు రాత్రింబగళ్ళు నా దగ్గిరున్నా నాకు తృప్తి ఉండదే, ఇట్లా రోజుకి నాలుగు నిముషాలు దయచేస్తే ఎట్లా ఉంటుంది నాకు ?

శశి - ఈ సాయంకాలము రాత్రి కాకుండా సాయంకాలంగానే ఉండరాదూ? మనమెంత కోరుకున్నా అట్లా వుండదు కదా ?

కృష్ణ - సూర్యుడిమీద నెపం వెయ్యకపోతే రాత్రయితేనేం నాతో వుండి పోకూడదూ?

శశి - అమ్మో !

కృష్ణ - ఉంటే యేం ?

శశి - ఆశే!

కృష్ణ - నీకిక్కడుండడం భయమా?

శశి - భయమేంటి?

గాలి కృష్ణుని ముఖముపై శిరోజములను కదిలించింది. ఆమె వానిని సరితీసెను. కృష్ణుడామె తొడవద్ద పరుండి. ఆమె ముఖము వైపు చూచుచుండెను.

శశి - రాత్రి అవుతోంది. నిన్ననే అమ్మ అనుమానపడ్డది. నేను వెళ్ళొద్దూ ?

కృష్ణుడు లేచి కూర్చుని

"సరే కాని వాళ్ళతో మాట్లాడినావూ?"

శశి - ఆ. కాని ఏమంటారో మనకి ముందరే తెలుసుగా?

కృష్ణ - ఏమన్నారో చెప్పవూ?

శశి - చెప్పేదేముంది?

కృష్ణ - అట్లా కాదు. వాళ్ళ మాటలు చెప్పు.

శశి - అత్తవారింటికి వెళ్ళక తప్పదన్నారు.

కృష్ణుడు నవ్వెను.

కృష్ణ - నువ్వేమన్నావు?

శశి - వెళ్ళనన్నాను. సరేనా?

కృష్ణ - అన్నావుగాని; ఏం చేస్తావు?

శశి - అదే తోచటంలేదు! నా మాటల తరువాత అంత ధైర్యం చెయ్యరను కుంటా.

కృష్ణ - శశీ, నాకు భయంగా వుంది. వాళ్ళు నిజంగా వస్తే నీ వొక్కత్తేం చేస్తావు? నేనేం చేస్తాను? నా దాన్ని, నా ప్రాణాన్ని, నా చిన్న శశినీ ఎవడో వచ్చి తీసు కుంటూ వుంటే చూస్తో వూరుకోనా? ఏం చెయ్యతల్చుకున్నావు చెప్పు.

శశి - నాకేం తెలీదు. నేను వద్దంటే వాళ్ళేం చేస్తారు? అసలు రాని కానిద్దూ, చూద్దాం.

కృష్ణ - చూసేదేమిటి?

శశి - మరేమంటావు?

కృష్ణ - నాతో యిక్కడే వుండిపో, మీ వాళ్ళ దగ్గరికి వెళ్ళనే వొద్దు.

శశి - ఛీ! ఆ మాటలు మాట్లాడొద్దన్లేదూ? మా వాళ్ళ నొదుల్తానా? మా అమ్మ ఏడవదూ?

కృష్ణ - మీ అమ్మేడుస్తుందని నన్నొదిలేస్తావూ? నేనేడవనూ?

శశి - నిన్నెందుకొదుల్తా? ఎప్పుడూ వదలను. ఇట్లారా! ఈ ముక్కునీ కళ్ళనీ వదుల్తానూ?

కృష్ణ - వదలకేం చేస్తావు? ఆ దిబ్బ మొఘంగాడు వచ్చి పిలక జుట్టేసుకుని పీటలమీద కూర్చుంటాడు వాడు. తలొంచుకొని పెద్ద బొట్టు పెట్టుకొని, పక్కన ముత్తయిదులాగు కూచుంటావు. నేను వచ్చి "ఏమండీ శశిరేఖగారూ!" అంటే "ఏవరండీ మీరం"టావు.

శశిరేఖ కృష్ణుని చెంపమీద చరచెను.

శశి - ఎప్పుడూ అట్లా అనవు కదా?





కృష్ణ - నిజమౌనా కాదా?

శశి - కాదు.

కృష్ణ - ఇప్పుడు బడాయి మాటలకేంగాని, చివరికి యేమీ అనకండా మీ వాళ్ళేం చేస్తున్నా వూరుకుంటావు.

శశి - నిజం, నా ప్రాణముండగా వొప్పుకోను. నిన్ను వొదిలేస్తానా?

కృష్ణ - నిజంగా! నువ్వెప్పుడన్నా కనపడవుగావును! యెప్పటికీ అని తలుచు కుంటే, ఎంత దుఃఖం వొస్తుందనుకున్నావు! నాకింకేమీ లేనట్లుంటుంది. అసలు నువ్వెందుకు కనపడ్డావా అనిపిస్తుంది.

శశి - వదలను కృష్ణా, నిన్ను వదిలి నేను బతకగలనూ?

ఇట్లా చూడు బతగ్గలనూ?

కృష్ణ - పోనీ, నా దగ్గర వుండిపో! ఆ ముద్దు కన్నులతో నన్నెప్పుడూ చూస్తో వుండు.

శశి - తప్పు కదూ?

"ఇప్పుడు చేసేది తప్పుకదూ" అని కృష్ణుని నోటిదాక వచ్చెను కాని, ఆమె కండ్లలో అమాయకత్వమును చూచి కృష్ణ దూరకుండెను.

పారిజాత పుష్పముల వాసన మనసులకు కలవరపరిచినది. బాగుగ చీకటి పడెను. శశిరేఖ తలపై ఎర్రని పూరేకులను చెట్టు విదల్చెను. తెలియరాని కోర్కెలు వారి మనసుల విజృంభించెను. దూరముగ పడవవారి పాట విషాదముగ వినపడు చుండె. శశిరేఖ వెళ్ళుటకు లేచెను. నాలుగు పారిజాత పువ్వులను కృష్ణుడామె ముడిలో పెట్టుచుండగా అతని చెయ్యి ఆమె మెడకు తగిలెను. ఆమె జుట్టు వీడి మోకాళ్ళ వరకు పడెను.

శశి - వొదులు జుట్టు ముడి వేసుకోవాలి.

కృష్ణ - ఆ చంద్రుడు చూడు ఈ పెద్ద మబ్బు ఎక్కణ్ణించి వచ్చిందా అనుకుంటాడు. మరీ అంత పెద్ద జుట్టేంటి? బరువు కాదూ?

శశి - నే వెడతాను.

కృష్ణ - ఒక్కమాట. యిట్లా చూడు. పోనీ, పోనీ ఆ కళ్ళు నక్షత్రాలంటావా, లేదా? ఎప్పుడూ అట్లా మెరుస్తాయేం?

శశి - నీ పెదిమిలట్లా ఎఱ్ఱగా వుంటాయేం?

కృష్ణ - చెప్పనా యెందుకో?

శశి - వొద్దు పో!

అని త్రోసివేసెను.

శశిరేఖ ఏమియును తెలియని ముగ్ధ. నెలకు పూర్వము ఒక కొత్త పడవను లాకులో చూడవచ్చినప్పు డీతని పరిచయమయ్యెను. అదియే యిట్టి ప్రేమగ మారినది. పూర్వయవ్వనమున వికసించిన పువ్వు తుమ్మెద నెట్లాకర్షించుచున్నదో, సూర్య కిరణముల వేడికి మంచు యేల కరుగుచున్నదో, వసంతముల కోయిల యేల కూయుచున్నదో, అందుకనే ఆమె ప్రేమించెను. ప్రేమించుట యవ్వనమున నైజము. ఆమెవలె స్వేచ్ఛతో సంపూర్ణమగు మనసుతో, ప్రేమించిన ప్రేమయే ప్రేమ

## 3

కృష్ణ-గోవిందపురపు లాకు అధికారి కుమారుడు. అతడు విశాఖపట్నమున డాక్టరు పరీక్ష చదువుచుండెను. మూడేండ్లు పూర్తి ఆయినవి. ఇప్పుడెండాకాలపు శలవులకు ఇంటికి వచ్చెను. లాకువద్ద నుండు యింటియందే యతనికి నివాసము. ఒకనాటి సాయంకాలము ఒక పడవవైపు మహాద్భుతము వలె చూచుచుండ శశిరేఖ కలువ కన్నులును, ఎఱ్ఱని పెదవులు నాతని నాకర్షించెను. ముందు వెను లాలోచింపక ఆనంద పారవశ్యమున నా ప్రేమాంబుధిలో నిన్నాళ్ళు నోలలాడు చుండెను.

నాలుగు దినములు గడచినవి. ఒకనాటి అర్ధరేయి ఆ చిన్న కుటీరమున నందరు నిద్రించుచుండిరి. అంతయు నిశ్శబ్దము. ఎవరో మెల్లగ తలుపు తట్టినట్లు చప్పుడయ్యెను. తలుపు దగ్గర నిద్రించుచుండిన కృష్ణుడు తలుపు తెరచి చూచెను. పున్నమినాటి వెన్నెల. కాని ఎవరూ నాతనికి కాన్పింపలేదు. చిన్న కంఠమున "కృష్ణా" యను పిలుపు వినబడెను. అతను మెల్లగ తలుపువేసి కొంచెము దూరముననున్న నారింజ చెట్టుకింద నిలుచుని యున్న శశిరేఖను చూచెను. ఆమె శరీరము వణకుచుండెను. అతని హృదయమున ఆమె శిరమునానించి సోలి పోయెను. "శశీ, శశీ, నా శశీ" అని పలుమారు పిలిచి "ఏమి జరిగినది? ఎందు



కిప్పుడు వచ్చావు?" అని యడిగెను. శశిరేఖ యతనిని లాకువద్దకు రమ్మనెను. ఇద్దరును వెళ్ళి వెన్నెల యందు నీటియొడ్డున గూర్చుండిరి.

శశీ - నిన్ను కనుక్కోవడం ఎట్లాగో తెలీలేదు. తలుపు కొడితే ఎవరు తెరిచి ఏమి అడుగుతారో అని భయము వేసింది. నువ్వు కనబడక పోతే మళ్ళీ యింటికి పోయేదాన్ననుకుంటా. నువ్వింత సులభంగా కనపడ్డం ఈశ్వరుడికి నేను చేసినపని యిష్టమని తెలుస్తోంది.

కృష్ణ - ఏం పని చేశావు?

శశి - నీ దగ్గరకు రావడం, కృష్ణా, ఈ నిముషమునుంచి నేను నీ దాన్ని. నన్ను నీ వేం చేసినా సరే, ఎక్కడికి రమ్మన్నాసరే.

కృష్ణ - నిజంగా? కాని నాకేం అర్థమవడం లేదు. ఏం జరిగింది? ఎందుకట్లా వణకుతున్నావు? ఎందుకు భయం? ఈ నగలు, కొత్త బట్టలు, యీ శృంగారమంతా యేమిటి?

శశి - విను. కార్యము రేపటి ముహుర్తానికి కుదిర్చారు. మా నాన్న నిన్న వచ్చి, "ఏమీ అల్లరి లేకుండా కార్యం చేసుకుంటావా లేదా" అని కఠినంగా అడిగినాడు. నేను చేసుకోనన్నాను. దుర్భాషలాడి నన్నొక చీకటి సామానుగదిలో వేసి మూసినాడు. అన్నం పెట్టలేదు. ఎవరో నాకు తెలీకుండా గూట్లోనుంచి మిఠాయి వేశారు. తింటో వుంటే మా నాన్న వచ్చి లాక్కుపోయినాడు. రోజల్లా ఉపోషం ఈవాళ పొద్దున్న మళ్ళీ అడిగినారు. నేను నా పట్టు వదలక పొయ్యేటప్పటికి, మా నాన్న బెత్తం తీసుకు కొట్టినాడు. అంత ప్రేమ వున్న మా నాన్న కూడా యిట్లా కొట్టినాడు చూడు ఎట్లా తేలిందో వళ్ళంతా. నే నేమి తప్పు చేశానని కొట్టడం? నాదా వాళ్ళదా తప్పు! పైగా కొట్టడం? ఇంక వాళ్ళకి నా మీద ప్రేమ యేమిటి? విసుగుపుట్టి అత్తవారు వచ్చారని ఇట్లా ముస్తాబు చేశారు. ఏమైనాసరే, రేపు బలవంతంగా వాళ్ళు చేతులు కట్టేసి కార్యం చేస్తామన్నారు. ఆయన వంటరిగా వుండే సమయం చూసి ఏమైనా ఆశ వుంటుందేమోనని మాట్లాడినాను కూడాను.

కృష్ణ - ఎవరు?

శశి - ఎవరు? భర్త.

కృష్ణ - ఊహూ. ఏమన్నాడు?

శశి – "నాకు నీ మీద యిష్టంలేదు. కార్యం ఇష్టంలేదు, నన్ను ఇట బలవంతం చెయ్యడం న్యాయమేనా?" అన్నాను. "నీకు ఇంత నోరు వచ్చిందీ నీ వేషాలు, నీ తిరగడాలు వినే, కార్యం మించిపోకుండా వెంటనే తీసుకెడదామ వచ్చాను. రేపట్నించి యిట్లా మొగవాళ్ళ యెదటపడి మాట్లాడ్డం యేమిటో చెపుతా నన్నాడు.

భర్త చూడపోతే యిలాగు, ఇంక ఆశ యేముంది? నిలవ నీడలేదని యిట వచ్చేశాను. రేపు నేను వచ్చేసింది చూసి మా వాళ్ళు నా కోసం వస్తారు. అప్పుడ వెడతాను. తరవాత కార్యం చేస్తామని పట్టుపట్టర్లే. అందాకా ఉండనియ్యవూ నీతో

కృష్ణ – తెల్లావారి మీ వాళ్ళువచ్చి నువ్వు నా దగ్గర వుండడంచూసి యేమ కుంటారు– నేనే చేశాననుకోరా? నా మీద యెందుకు యిదంతా?

శశి – ఇప్పుడిట్లా అంటున్నావూ? అసలు వచ్చెయ్యమని అడగలేదూ నువ్వ

కృష్ణ – అప్పుడు వేరే సంగతి. ఇప్పుడు మళ్ళీ వెడతానంటున్నావూ తెల్లారి.

శశి – కృష్ణా మరిచిపోయి వచ్చాను. నేను చేసింది తప్పని తోస్తోంది ఇంటికి వెడుతున్నా.

అని చివాలున లేచి వెళ్ళిపోయెను. కృష్ణు డాలోచనలో నుండి రెండు నిమి ములు లేవనేలేదు. లేచి వెదకునప్పటికి శశిరేఖ కనపడలేదు. చుట్టు ప్రక్క ఆమెకొఅకు తిరిగి, యూరివైపునకు నడచెను. ఎక్కడను కానరాలేదు. ఎక్కడక వెళ్ళినది? ఇంటికి తిరిగి వెళ్ళినదేమో! తాను సహాయము చేయలేదను నిరాశ నింటికిబోయెను కాబోలు! అయిన ఇంక తనకు కనబడునా? ఇంకెన్నడు కనబడద ఆహా! తన్ను కోరి వచ్చిన శశిరేఖను తాను ఇట్లు పోగొట్టుకొనెనా? దౌర్భాగ్యమా తనే కదా ఆమెను రమ్మని బతిమాలినది? అర్థరేయి తన్ను నమ్మివచ్చిన దాని తూలనాడెను గదా! తన వారివలన బాధపడలేక ఎంత యిష్టము లేకున్నను తన వద్దకు వచ్చిన నామెనిట్లు తన స్వార్థ పరత్వముచే నిరాశకొల్పి పంపెను గదా ఇట్టి నీచునెన్నడైన శశిరేఖ కన్నెత్తి చూచునా! ఆమె దెట్టి త్యాగము, తన దెట్టి స్వార్థము? ఆమె దెంత విశ్వాసము, తన దెంత సందేహము ! తన కృతఘ్నత గాంచి ఆమె యెంత యసహ్యపడినదో ? తన ప్రేమ ఇట్లు తిరస్కరింపబడెనయ్యెనని ఎంత పరితపించినదో? తిరిగి ఆ రాక్షసులవద్దకు– ఆ భర్త దగ్గరకు పోవలసివచ్చు



టచే నామె హృదయమెంత వేదన చెందినదో? ఈ సమయమున నీ నిమిషమున నెచట నేడ్చుచున్నదో గదా! అని అతడాలోచించెను. ఈ పశ్చాత్తాపముతో నాతనికి పొరలి పొరలి దుఃఖము రాసాగెను. కండ్లనీరు రాగ తుడుచుకొనుచు వడివడిగ నామె యింటి వద్దకు నడిచెను. తోరణములును పసుపు కుంకుమలును అతని నెక్కిరించెను. నిశ్శబ్దముగా నుండెను. ఇల్లు వచ్చినదో లేదో! ముందరి ద్వారమును మెల్లగ నెట్టెను. తలుపు తెరచికొనెను. ఆహా ! రాలేదుగదా, అతని హృదయమున సంతోషమంకురించెను. రాలేదు. ఆమెను కలిసికొనవచ్చునని తిరిగి త్వరత్వరగ వచ్చినదారినే నడవసాగెను. కాని ఎచటకు పోవలెను? ఎచటనున్నది? అయ్యో ఏమి చేయుటకును తోచక బలవంతముగ మరణించెనేమో! ఈ నిమిషముననే మరణించుచుండెనేమో! ఈ తలపు వచ్చుటతోడనే అతడు పరువెత్తెను చెట్లక్రిందను కాలువవద్దునను పరువెత్తి పరువెత్తి వెతకెను. చివరకు అలసి క్రిందపడి బిగ్గరగా "శశీ, శశీ, శశీ" అని యరచెను. వడివడిగ వచ్చు తీక్షణములగు తలపులచే తలబ్రద్దలగుచున్నట్లుండెను. భయముచే లజ్జచే గుండెలు కొట్టుకొనుచుండెను. ఏమియును తోచదు. నిశ్చేష్టితుడై ఆ వెన్నెలయందు ఎంత కాలమతడుండెనో తెలియదు. దూరమున రెండు గంటలు కొట్టిన చప్పుడయ్యెను. అంతదాతడు లేచి శశిరేఖను తలచుకొనుచు దాము సంతోషముగ దినములు గడపిన ఆ వృక్షముల క్రిందకు బోయెను. ఆమె మృతి జెందెనని నిశ్చయ మేర్పడెను. తానే కారకుడామె మరణమునకు. ఇంక దేని కొరకు తాను మాత్రము బ్రతుకవలెను? ప్రేమలేని యవ్వనము నూని వలికిన దీపము. ఇట్లు తలపోయుచు అపారమగు హృదయవేదనను కృంగి యీ వృక్షమును సమీపించెను.

నిర్మలాకాశమున తెల్లని వెన్నెల కాయుచుండెను. వెన్నెల తరంగములచే లోకము నింపబడినటుల కానవచ్చెను. లాకు తలుపుల సందులలో నుండి పడు నీరు జలజలమను శబ్దము చేయుచుండెను. తెల్లవారినదని లేచి కోయిల కూసెను. ఎచటనో గుడ్లగూబ యొకటి కీచుమనెను. అప్పుడే వికసించిన జాజిపూవుల వాసన చల్లని వాయువులపై వీచుచుంచెను. కృష్ణుడు తటాలున రాలిన ఆకులపై బోర్లపడి "శశీ, శశీ, ఎక్కడున్నావు? అయ్యో శశీ, రావూ, రావూ, దయలేదూ, గండెలు పగులుతున్నాయి శశీ, రావూ, రావూ" అని మెల్లగ నావేశముతో ననుచుండెను. ఒక హస్తమాతని వీపుపై ప్రాకి కౌగలించుకొనెను. కన్నీళ్ళతో తడిసిన ముఖమొకటాతని ముఖమునానుకొని మెల్లగ, "కృష్ణా, ఎందుకు?" అని యడిగెను.

తనను తాను నమ్మజాలక అతడు ముఖమెత్తి చూచెను. దీర్ఘమగు మృదుశిరోజ
లాతని కండ్లకడ్డుపడెను. ఎవరని యాతడడిగెను. "నేను కృష్ణా, ఎందుకు ఏడుస్తా
ఏడవకు ఇంక నిన్ను వదలనుగా, నా కృష్ణా, నిన్ను వదలి పోయినాననుకున్నావా
అని అతనిని కౌగలించుకొని శశిరేఖ అతని కన్నీళ్ళను తుడిచెను.

✦ ✦ ✦

చంద్రుడు హంసతూలికాతుల్యములగు మేఘముల నాకర్షించి
చిరునవ్వుచే సత్కరించుచుండెను. మందమారుతము పూకన్నియల సంయోగ
తెల్పు పరిమళ మును వీచుచుండెను. చంద్రకిరణములచే ముద్దిడబడిన య
పత్రములు వెదచల్లి నటుల మెరయుచుండెను. ప్రతి యాకును ఆకసము
నోర్లుతెరచి మంచుబిందువుల స్పర్శనాసౌఖ్యము కొరకు వేచియుండె
లోకమంతయును ప్రేమలీలలలో సోలలాడు చుండెను.

మూడుగంటలు కొట్టిన చప్పుడైనది. కృష్ణుడు తటాలున పత్రశయ్య
నుండి లేచి, శశిరేఖను లేపెను.

కృష్ణ – మూడుగంటలయినది. తెల్లవారుతోంది.

శశి – సరేలే. నిద్రవస్తోంది.

కృష్ణ – కాని ఏమాలోచించావు? ఏం చెయ్యాలి?

శశి – చేసేదేముంది? ఇంకేం కావాలి? మన్ని విడదియ్యడం ఎ
చేతవు తుంది?

కృష్ణ – అట్లాకాదు. ఏమయినాసరే తెల్లవారి నిన్నిక్కడ చూశారంటే మీవా
బలవంతంగా మన్ని విడదియ్యక మానరు.

శశి – నన్నా? వాళ్ళకు చేతవుతుందా? భయంలేదు కృష్ణా, నిద్రవస్తో
ఇట్టా పడుకో.

కృష్ణ – శశీ, ఈ నిమిషం సంతోషంలో ముందుసంగతి నీకు తెలవ
లేదు. ఒక్క నిమిషం నా మాట విను.

అని మెల్లగా ఆమెను తన చేతులతో లేవదీసి తననానించుకొని కూర్చు
బెట్టుకొనెను.



కృష్ణ – బలవంతంగా నిన్ను లాక్కెడితే ఎవరేం చెయ్యగలరు? వాళ్ళ కోపంలో మనమేమన్నా వాళ్ళు వినే స్థితిలో వుండరు. శశీ నా ప్రాణాలు పోయినా నాకు విచారం లేదు. నిన్ను వదలి బతకలేను. నేను చెప్పేది వినవూ?

శశి – చెప్పు.

కృష్ణ – మనము కొంతకాలము వీళ్ళకి కనబడకుండా వుంటే మంచిది. తరువాత వచ్చి యిక్కడే వుండవచ్చును. కాలము మించిపోతోంది. వప్పుకోవూ నాతో రావడానికి?

శశి– వప్పుకోక చేసేదేముంది. మరి యెక్కడకెడదాం?

కృష్ణ – అదంతా ఆలోచించాను. ఇక్కడే వుండు వస్తాను.

అని యింటికిపోయి కావలసిన వస్తువులు సొమ్మును తీసుకొని వచ్చెను. లాకులకవతల కట్టియుండు డింగీయందు నాలుగు దిండ్లను వైచి సంసిద్ధము చేసెను. శశిరేఖకు ధైర్యము చెప్పుచు తీసికొనిపోయి ఆ డింగీయందు కూర్చుండబెట్టి తానును ఎక్కి డింగీని లోపలికి నెట్టెను. ప్రవాహమునకు డింగీ పోవుచుండెను.

కృష్ణ – వాటి నానుకొని నిద్రపో.

శశి – ఇప్పుడు నిద్ర రావటంలేదు.

కృష్ణ – ఇందాక వచ్చిందే?

శశి – ఎంత బాగుంది కృష్ణా! ఎప్పుడూ మన యిద్దరం యిట్లా వెడుతూవుంటే బాగుండదూ? ఎంత చల్లగాలి చూడు. మెల్లిగా తెల్లపడుతోంది ఆకాశం.

కృష్ణ – మీ వాళ్ళేమనుకుంటారు, తెల్లవారి నువ్వు కనబడకపోతే దేంట్లోనో పడిపోయినావనుకుంటారు. నువ్వు పోయిందే చాలని రేపటి ముహూర్తానికే వాడు యింకొకర్ని కట్టుకొంటాడు.

శశి – మీ వాళ్ళో?

కృష్ణ – మా వాళ్ళతో చెప్పే వచ్చాను.

శశి – నేను చచ్చిపోయానని మా వాళ్ళనుకుంటే నాకు బాగుండదు. నేను నీతో వచ్చేశానని వాళ్ళకు తెలియాలి.

కృష్ణ – తెలిస్తే అందరూ వరుసగా ఉరేసుకొని వేళ్ళాడతారు.

శశి - పాపం మా అమ్మ ఎంత ఏడుస్తుందో?

కృష్ణ - కట్టేసిన నక్కమల్లే నీ భర్త ఎంత గుంజుకుంటాడో. వాడి గర్వ కొంత తగ్గుతుంది.

శశి - ఇంకా అతన్ని నా భర్త అంటావేమిటి? అమ్మా! అన్ని దుర్గల వదిలాయి కృష్ణా! మనకు ఇంక సంతోషముగాక యింకేమిటి? ఇంతకన్న ఆనందంగా ఎవరన్నా వుంటారేమో! రాముడూ సీతా కాలవదాటే బొమ్మ ఉండే అప్పుడు సీత యింత సౌఖ్యముగా వుందేమో!

కృష్ణ - ఆ లక్ష్మణుడూ పడవవాడూ అక్కడే ఉండగా సీతకు సౌఖ్యమేమిటి!

శశి - ఆ చివర కూర్చుంటావేం? ఇట్లా రారాదూ? నిద్రవస్తోంది. నువ్వు దగ్గర వున్నావనే నమ్మకం వుంటేనేకాని సరిగా నిద్రరాదు.

కృష్ణ - ఇక్కడ యీ చుక్కాని గోల ఒకటొచ్చింది. నిద్రపో మళ్ళీ ఎం వస్తుంది. ఆ నేత్ర కమలాన్ని విప్పేటందుకు.

శశి - ఈ రాత్రి కలువలయినాయి.

కృష్ణ - అవును. చూడు చంద్రుడు వెలవెలపోతున్నాడు. ఈనా రాత్రి వెన్నెల్ని మరవగలనూ? నా జీవితంలో మహా దుఃఖాన్నీ సంతోషాన్నీ రాత్రే అనుభవించాను. నిద్రేనా?

శశిరేఖ కళ్ళు మూసెను. ఉషఃకాంతి ఆమె ముఖము నావరించి చెక్కి కొక కొత్త యందమును రంగును తెచ్చెను. మతయమారుతము ముంగురు మధ్య జిక్కుపడి యాడుచుండెను. నేత్రములయందును పెదవులయందును చ చిరునవ్వుతో ఆమె సంపూర్ణమగు సంతుష్టి జెందిన పసిబిడ్డవలె నిద్రించుచుండె కృష్ణుడామె ముఖమును గాలికి గదలుచున్న చీర మరుగుపరువజాలని సకుమార యే లోపమునులేక వంపుదిరిగిన దేహమును జూచుచు సకలమును మరచెను

# 4

"శశీ శశీ పట్టుకో పట్టుకో."

కృష్ణుడు బాదమచెట్టు నెక్కి ఆకులను పండ్లను విదల్చుచుండెను. శశిరే చెట్టు క్రింద నుంచి ముఖమెత్తి చూచుచుండెను. ఒక పెద్ద పండు ముక్కుపై పడెనే



కృష్ణ - ఆ ముక్కెట్లా పెట్టినావు! అద్దముంటే ఎంత బాగుండేది? అని నవ్వుతో కిందబడుటకు సిద్ధమయ్యెను.

శశి - ఎందుకంత నవ్వు! ఇంక చాలు దిగు.

కృష్ణుడు చెట్టు నుండి దూకెను.

శశి - వళ్ళంతా గండుచీమలేనోయి. అంతేకావాలి. బాగా కుట్టాలి. నా ముక్కు చితకకొట్టినపు డెట్లావుందో?

కృష్ణ - నీకేం సంతోషమో? నిన్ను కుడితే ఎట్లా వుంటుంది? కావలసి కొట్టినానా యేం? ఇదంతా నీకోసమేగా? కోసినందుకుపకారమా?

శశి - నా కోసమేం? భోజనానికి పిలిచిన నీ స్నేహితుడి కోసం, నీ కోసం.

కృష్ణ - సుందర్రావు వచ్చేస్తాడు. త్వరగా ఆకులు కుడదాముర్రా. అని అచ్చట నున్న కుటీరములోనికి పోయిరి.

శశి - పొగకు కళ్ళు మండినాయి. కొంచెం ఆ పులుసు చూద్దూ. నేను విస్తళ్ళు కుడుతూ వుంటాను.

కృష్ణ - ఆ తిరగమూత వెయ్యడం ఎన్ని రోజులయినా చేతకాదు కదా నాకు!

శశి - లేకపోతే మొగవాళ్ళకి వంట వస్తుందీ?

కృష్ణ - మా భీముణ్ణీ, నలుణ్ణి మరిచిపోయినావా?

శశి - అప్పుడు వంటల్లో తిరగమూతలు లేవు.

సుందరరావు వచ్చెను.

సుంద - ఏం చేస్తున్నాడు మా వాడు?

శశి - (నవ్వుచు) పులుసు వండుతున్నాడు.

సుంద - కృష్ణా, వంట చేసేది నువ్వని చెప్పకపోయినావురా ముందుగానే? ఇంటిదగ్గర అన్నం పెట్టమని చెప్పి వచ్చేవాణ్ణి.

కృష్ణ - లేదురా, ఇప్పుడే వెళ్ళినాను, పులుసు పొంగకండా చూడడానికి. ఏంరా! పొద్దున్నే వస్తానని ఇంత ఆలస్యం చేశావు?

సుంద – ఎంత చెప్పినా తెలీదురా వీళ్ళకి. పశువులకన్న అన్యాయం. మెు
నించి విషజ్వరంగా వున్న ఆవిడ యివాళ ముట్టయిందిట. ఇంట్లోంచి తీసి
గాల్లో బయట పాకలో వేసినారు. రేపు స్నానం చేయించక మానరుట. ఇంక
వయిద్య మెందుకు, మందులెందుకు?

కృష్ణ – ఏం చేశావు?

సుంద – చేసేదేముంది? వద్దని చెప్పినాను. కాని వింటారా; యేమన్నా

శశి – అందుకనేనా ఆలస్యం? మీ కెంతిస్తారు యీ జబ్బు కుదిర్తే?

సుంద – కుదిర్తేకదా? ఏమైనా రెండు వందల కొప్పుకున్నాను.

శశి – కృష్ణా, నువ్వింకా యేడాది చదివితే, నువ్వు కూడా యిట్లా సంపా
వాడవు కదూ?

సుంద – వాడికీ వెధవ డబ్బెందుకు? వాడి కొక్కసారిగానే నవనిధుల్లో
మైన మణి దొరికింది.

శశి – మంచి మణే! కడపు నిండనా, కాలు నిండనా, ఎందుకు పనికొ

సుంద – అట్లాంటి మణితో ఉపవాసాలున్నా కష్టమా? మీ ఇద్దరూ ఒకర్ని
చూసి భోజనం మానుకోండి. నాకు మాత్రం ఆకలిగా వుంది. నాకెవరున్నా
భోజనం మరిపించేందుకు?

శశి – మీరింకా పెళ్ళిచేసుకోలేదేం?

సుంద – కృష్ణుడి అదృష్టం అందరికీ పడుతుందీ? పొద్దస్తమానం ప
నిద్రపోయే మాకు రాత్రిళ్ళు చంద్రకిరణాలు దొరుకుతాయా?

శశి – అంత పని వుంటుందా? కృష్ణా నువ్వుకూడా పనిలో వుంటే పగలు
నాకేం తోచేదీ?

సుంద – భార్యలకు తోచదని కృష్ణునిమల్లే పొద్దస్తమానం అందరు మొగా
పులుసు కాచుకుంటూ కూచుంటారనుకుంటారా యేం?

శశి – పోనీ కృష్ణా, నువ్వు మళ్ళా ఆ ఒక్క యేడాదీ చదువరాదూ?

కృష్ణ – మరి నువ్వు ?

శశి – నేనా? నేనా? ఎక్కడో ఒకచోట వుంటాను.



సుంద – అమె ఇక్కడే వుంటాఁరా. నువ్వెళ్ళి చదువుకురా.

శశి – అవును. పోనీ ఇక్కడే వుంటాను. నాకు భయమా? ఒక్క యేడే
కదూ?

కృష్ణ – అమ్మో! నిన్ను వదలి వెళ్ళడమే!

సుంద – ఒక్క యేడే కదూ! తర్వాత స్వతంత్రంగా బతకవచ్చును.

కృష్ణ – నాకింతకంటే స్వతంత్ర మక్కరలేదు.

సుంద – ఏమీ పనిలేకుండా ఇట్లా వుండడం బాగుండలేదు.

కృష్ణ – బ్రహ్మచారికి నీకేం తెలుసు బాగుండో లేదో? ఏమంటావు శశీ?

శశి – అవును. ఆయనకేం తెలుసు?

శశిరేఖా కృష్ణు లిరువురును దొడ్డిలో రాత్రి మంచముపై కూర్చుని యుండిరి. గోవిందపురమునుండి వచ్చి ఈ వాడపిల్లిలో డింగీలోనుండి దిగి రెండు నెలలైనది. ఆ యూరిలో కృష్ణుడి స్నేహితుడు సుందర్రావుండెను. అతడు సంవత్సరమునకు పూర్వము పరీక్షయందు కృతార్థుడై ఆ యూరియందు డాక్టరుగా యుండెను. కృష్ణుడాతనికి తన కథ తెలుపగా అతడు వీరినెంతో ఆదరించి ఒక కుటీరమును, పెద్ద దొడ్డియు నుండుట కిప్పించెను. ఈ రెండు నెలలును రెండు గంటలవలె గొప్ప గాయకునిచే పాడబడిన మధుర గీతమువలె, సుందర విద్యుల్లతవలె గడచిపోయెను.

శశి – పోనీ, నువ్వు చదువు ముగించకూడదూ?

కృష్ణ – శశీ, నిన్ను వంటరిగా విడచి ఉండగలనా? నాకు మనస్థిమితము ఉంటుందా?

శశి – కాని, అప్పుడు మనం స్వతంత్రముగా బతుకవచ్చునుగా?

కృష్ణ – అవునుగాని, నిన్నుంచుటకు చోటులేదు, సొమ్ములేదు వృథాలోచన లెందుకు?

శశి – సుందర్రావుగారు చూడు ఎంత స్వేచ్ఛగా వున్నాడో?

కృష్ణ – ఆ స్వేచ్ఛకంటే ఈ బంధనమే ప్రియతరము కాదూ? అని ఆమె హస్తములతో అతని మెడ కౌగలించుకొనెను. ఆమెయు అతని శిరమును వంచుకొని తన హృదయమున నద్దుకొనెను.

శశి – ఇంతకంటె ఏం కావాలి?

కృష్ణ – కాని సుందర్రావుపై ఆధారపడటం బాగుండలేదు.

శశి – పోనీ, అనుకున్నట్లు నా నగ ఒకటి అమ్మెయ్యరాదూ?

కృష్ణ – కాని, వాడమ్మనియ్యటంలేదు. స్నేహం మొగమాటం.

శశి – పాపం, చాలా మంచి ఆయన లాగున్నారు.

కృష్ణ – పోనీ, మళ్ళీ గోవిందపురం వెడదామా?

శశి – వెడితే?

కృష్ణ – ఏమో! తెలియదు. కాని మా వాండ్ల కీ సంగతి వ్రాసి, ఏమం చూస్తాను.

శశి – ఎందుకులెద్దూ? ఇక్కడ బాగుండలేదూ?

కృష్ణ – ఎన్నాళ్ళితని మీద ఆధారపడి ఉండడం?

శశి – అవునదీ నిజమే.

కృష్ణ – ఏమిటో నాకు బాగుండడంలేదు. శశీ, నాకేం తోచదు. ఈ జీవిత నువ్వు తప్ప నాకు దరీ దాపు కనబడడం లేదు.

శశి – ఎప్పుడూ ఈ చిన్న తలలో తలపులతో బాధపడతావు. ఇట్లా అన్నీ మరిచిపో. ఏమయితేనేం, మన ప్రేమ వుందిగా ఇంకేం కావాలి?

అని కృష్ణని తలను తన హృదయంన నదుముకొని ముఖంను ము పెట్టుకొనెను. మంత్రింపబడిన వానివలె అతడు శశిరేఖ ప్రేమాను బంధన చిక్కి యొడలు మరచెను.

చంద్రుడు పెద్ద మబ్బు వెనుక దాగి అంచునకు మెరుగు పెట్టెను. కో వెదజల్లు దక్షిణగాలి దేహ శ్రమను దీర్చుచు వీచెను. నల్లని నీడలు కదలున చెట్లు యిటునటు నూగెను. బాదంచెట్టు పువ్వులు క్రిందరాలెను. నారిం పువ్వులవాసన వచ్చుచుండెను.

కృష్ణ – శశీ, యిట్లాటి పౌర్ణమినాడే రెండు నెల్లకిందట ఏం చేస్తున్నా

శశి – జ్ఞాపకముందిలే. ఇంకా సిగ్గులేక మాట్లాడుతున్నావు. "ఎందుకొ వన్నాడయ్యా! పిరికివాడు!"



కృష్ణ – చెప్పకుండా ఇంట్లోంచి లేచివస్తే ఏమంటారేం?

శశి – పాపం, మా వాళ్ళేమనుకుంటున్నారో యేమిటో? మనం మళ్ళీ ఆ వూరెడదాం, కృష్ణా!

కృష్ణ – మీ వాళ్ళు యింటికి లాక్కెడితే?

శశి – లాక్కువెళ్ళి యేం చేసుకుంటారు? ఇంక నాకేం భయం, నువ్వున్నావుగా? సుందర్రావుగారున్నారుగా?

కృష్ణ – ఆ రాత్రి నగలతో నువ్వు ఎంత అందంగా ఉన్నావో! పాపం, కష్టపడి నీకు చేసిన శృంగారమంతా నా కోసమయింది కదా! వాళ్ళకి వందనాలు చేస్తో ఉత్తరం రాయవల్సింది.

శశి – సంతోషించారు! కాని ఆ జుట్టు దువ్వుకోడం, గివ్వుకోడం యేంలేదా యేమిటి? సర్దుతాను యిట్టారా!

కృష్ణ – నా అందం నీ అందం రెండూ నువ్వే చేసుకో.

శశి – నువ్వు నా కందంగా ఉండొద్దూ?

కృష్ణ – ఎందుకు నన్ను చూస్తే నీకు ప్రేమ?

శశి – నన్ను చూస్తే నీకెందుకు?

కృష్ణ – ముందు నువ్వు చెప్పు.

శశి – నువ్వు చెప్పు.

కృష్ణ – ఎందుకంటే, ఎందుకంటే..... నువ్వు అట్లా వుంటావు కనక. చూడు మరెట్లా చూస్తున్నావో!

శశి – యింతేనా? నేనిట్లా వుండకపోతే ప్రేమ వుండదా?

కృష్ణ – అట్లా వుండకపోతే నువ్వు కాదన్న మాటేగా, నువ్వు కాకపోతే యెట్లా వుంటుంది ప్రేమ?

శశి – నేను మారిపోతే, ముసలిదాన్నయితే?

కృష్ణ – అయినా ఇట్లానే వుంటావు. నేనూ ముసలివాణ్ణవుతా. అప్పుడు నాకు బాగానే వుంటావు. సరే, నా మీద నీకెందుకో చెప్పు చూద్దాం.

శశి – నేను చెప్పను.

కృష్ణ - చెపుతానన్లేదూ?

శశి - "చెపుతానూ?" అన్నాను.

కృష్ణ - ఇంత దొంగమాటలెక్కడ నేర్చుకొన్నావు? చెప్పకపోతే.......

శశి - చెపుతా చెపుతా. వదులుమతీ, చెపుతానంటే - ఎందుకంటే-
నా మీద ప్రేమగనుక.

కృష్ణ - ఇంతే! నాకు నీమీద ప్రేమ లేకపోతే, నీదీ పోతుందన్నమాట.
ప్రేమచూడు, నీ ప్రేమ పోయిన పోదు.

శశి - కాదు, కాదు, మఱచిపోయినా, ఎందుకంటే, ముద్దొస్తావు కనక

కృష్ణ - ముద్దు రాకపోతే?

శశి - వస్తావులెద్దూ?

కృష్ణ - నేను లేకపోతే ఏం చేసేదానివి? ఓహో ఆ దిబ్బన కుక్కతో
హాయిగా వెన్నెల్లో వాడి వంటినిండా గంధం పూసి సరసాలాడుతో వుండేదా
వాడిప్పుడు మన్నిచూస్తే బాగుండును.

శశి - ఛీ. ఫో! నేను లేకపోతే నువ్వో!

కృష్ణ - నువ్వు లేకపోతే, నీ కోసం ఎదురుచూస్తో ఆ కాలువ వొడ్డ
కూచుండేవాణ్ణి.

శశి - నన్నెరగవుగా?

కృష్ణ - ఎరక్కపోతేనేం? ప్రేమ దేవతకోసం ఎదురుచూస్తో కూచునేవా
ఈ వెన్నెట్లో, అప్పుడు నువ్వొచ్చేదానివి.

శశి - పోదూ! ఏం బడాయి! ఏ పుస్తకాలో, ఏ మందులో చదువుకుం
కూచునేవాడివి. నీ మొహానికి నేను కనపడ్డదాకా ప్రేమ కూడా తెలిసినట్లే
పిచ్చి కబుర్ల కేమి లెద్దూ!

కృష్ణ - అంత పెద్ద కళ్ళున్నాయికదా అని బడాయి. నాకేం భయమా!

శశి - నీ కంత నోరుందిగా!

కృష్ణ - ఇదివఱకు చిన్నదే. ఈ మధ్య అరిగిపోయింది.

శశి - ఎందుకో?





కృష్ణ - ఇందుకూ.

కృష్ణుడు పరుగెత్తి చెట్ల నీడలో కనబడలేదు. చివరకు శశిరేఖని చెట్టు వెనక నుండి జడిపించెను. శశిరేఖ అదిరి వెనకకు పడెను. కృష్ణుడామెను పడకుండ కౌగిలించు కొనెను.

కృష్ణ - చూడు చంద్రుణ్ణి, అతన్నెవరు ముద్దు పెట్టుకున్నారో మొహమంతా తాంబూలం మచ్చలు.

## 5

మూడు సంవత్సరములు గడిచినవి. కృష్ణా, శశిరేఖ లిరువురును గోవింద పురముననే కాపురము. కృష్ణుని తల్లిదండ్రు లాతనిని వదలనేరక వారిద్దరిని తమ యింటనే యుంచుకొనిరి. కాని శశిరేఖ బంధువులామె మృతిజెందినట్లే భావించుకొని యూరకున్నారు. ఈ కాలమంతయు వారిరువురును మహాప్రేమ ప్రవాహమున గడిపిరి. అత్తమామలు వృద్ధులగుటచే యింటిపని యంతయు శశిరేఖపై బడెను. ప్రొద్దున లేచినది మొదలు రాత్రివరకు ఆమకు కాయకష్టముతోడనే సరిపోయెను. కాని ఆ కాలమంతయు ప్రేమగీతమామె చెవుల ప్రతిధ్వనించుటచే ఆమె కాపని ఏ మాత్రము కష్టముగా తోచలేదు. కాలముండి నపుడెల్ల కృష్ణుడామెకు చదువు నేర్ప ప్రయత్నించెను. కాని మొదలు పెట్టినపుడెల్ల నవ్వులలోను, ముద్దులలోను పరిణమించెను. భార్యను ప్రేమించిన భర్త యెప్పుడును భార్యకు చదువు చెప్పియుండలేదు. సుందర్రావిప్పుడు గోవిందపురములో డాక్టరు. బహుశా తన స్నేహితుడచట నుండుటచే కోరి యచట పనివేయించుకొని యుండవచ్చును. అతడు తరచు వీరి యింటికి వచ్చి సాయంకాలము గడుపుచుండెను.

ఒకనాటి సాయంకాలము శశిరేఖా కృష్ణులు లాకువద్ద తిరుగుచుండిరి.

శశి - మరీ యింత సంతోషముగా వున్నామని తలచుకున్నప్పుడు తప్పకుండా కష్టాలు వస్తాయనిపిస్తుంది.

కృష్ణ - వస్తే భయమా? ఈ చంద్రుడు కనపడుతున్నన్నాళ్ళూ యే మబ్బులు వచ్చినా సంతోషమే. ఈ మబ్బులకి చంద్రుడెట్లాంటి రంగులిస్తాడు! అయినా అందరికీ రాని కష్టములు మనకేమొస్తాయి?

శశి - అందరికీలేని సుఖం మనకు రాలేదూ?

కృష్ణ - ఇట్లాంటి సుఖము లేకుండా వాళ్ళు ఎట్లా దినదినము బ్రతుక
తెలీదు. అందనిదానికి చేతులుచాస్తే ఏదో వస్తుందని ఆశతో బాధపడవ
కాని యింక ఏమీ లేదని ప్రతిరోజూ ఒక్క మోస్తరుగా బతకడం కష్టం.

శశి - సారములేని నా బతుక్కి ఇన్ని రంగులేసి మహానందంలో నింపి
నువ్వు కదూ? ఎక్కడో ఏ మెరక్కుండా బ్రతికేదాని హృదయ భావాలన్నీ క
సౌందర్యాన్నంతా బయటికి లాగింది నువ్వు కాదూ! నీ ఋణం ఎట్లా తీరుతు

కృష్ణ -ఎట్లా తీరుతుందా? తీర్చావుకాదూ? ఆ నల్ల చూపులతో ఆ
ముద్దులతోటే తీరిపోయింది? వెల్తురు తెలుపంటారు. నీ కళ్ళలోంచి వచ్చే వె
నల్లగా వుంటుంది. నీ కన్నీళ్ళు తెల్లగా వుండడం చూసి ఆశ్చర్యమేస్తుంది న

శశి - నీ దొంగమాటలు కూడా ఇంత బాగుంటాయనుకోలేదు.

కృష్ణ - ఇంత అందముగా ఎట్లా పుట్టినావు మీ వాళ్ళకి?

శశి - నీ కోసమే.

శశిరేఖ తల్లి బాల్యములోనే అత్తవారి యింటికి వెళ్ళబోయే ముందు
యింట్లో వుండి ఎవరికీ తెలియక ఆమె ప్రేమను పొందిన పంజాబు కు
సంగతి తెలిసియుండుట సాధ్యమయినచో శశిరేఖకు ఎందుకంత అంద
చెప్పరాని ఆవేశములేమిటో పల్లెటూరి సాధారణపు బాలికకు, తల్లిదండ్ర
లేని ఆ గుణము లెట్లు వచ్చెనో తెలిసే యుండును.

శశి- నా స్నేహితులెందరో వుండేవాళ్ళు. వాళ్ళందరిప్పుడెట్లా వున్నారో

కృష్ణ - ఏ పిల్లనో పెంచుకుంటూ, ఏ మొగుళ్ళకో వంట వండి పె
ఏ ఆశా జీవితంలోనో లేక, ప్రేమ అనేది ఎరక్క బతుకుతూ వుంటారు.

శశి - ఎందుకొచ్చిందా యీ బతుకని ఆ మహా నరకంలోంచి
పట్టుకు లాగేశావు కదూ?

కృష్ణ - నువ్వు మాత్రం పనిచెయ్యడం లేదూ! ఏదీ, ఈ నేలమీద నడి
కుండా వుండవలసిన పొళ్ళు ఇట్లా ఖాద పెడుతున్నాను. నాకంటే కఠినాత్ముడె
టాడు?

శశి- అయితే ఇక్కడ పనిచెయ్యడం వేరు. నీవు మాట్లాడుతోవుంటే
చాలు, ఎంత పనన్నా చేస్తాను. నీ కళ్ళు నా వెంటనే వుంటాయిగా వాళ్ళకేము



పాపం, యే నగలో, యే పేరు ప్రతిష్టలో, పిల్లలకి సంబంధాలో వాళ్ళని బాధిస్తో వుంటాయి.

కృష్ణ - అట్లానేం? నిన్ను బాధించవూ?

శశి - ఊహూ, నాకీ కంఠం చాలు.

అని కౌగలించుకొని కంఠమును ముద్దు పెట్టుకొనెను. కృష్ణుడామె పెదవులను మెల్లగా తాకెను. శశిరేఖ అతని ప్రేమదేవత. ఆమె ఎక్కడ నలుగునో అని భయము.

కృష్ణ - అప్పుడప్పుడు యిదంతా కల అనుకుంటాను. గుండెలు తటతట కొట్టుకుంటాయి. ఏమేమో అయిపోయినావు అనుకుంటా. కళ్ళంబడి నీళ్ళు కార్తాయి.

శశి - పిచ్చివాడా! నే నేమైపోతాను? కాని కృష్ణా! జ్ఞాపకముందీ? నే నిక్కడి నుండి పడవవేపు చూస్తోవుంటే "పడవ యెక్కుతావమ్మా?" అని ఎంతో మర్యాదగా పలకరించావు నువ్వు?

కృష్ణ - ముద్దు పెదిమలతో ఒక్క మాటన్నా మాట్లాడకుండా కళ్ళెత్తి చూసి మొహం అట్లా తిప్పుకున్నావు కదూ? అప్పుడే ముద్దు పెట్టుకుంటే ఏం చేసేదానవో?

శశి- ఏం! మళ్ళీ పెట్టుకునేదాన్ని.

కృష్ణ - నిజమే! ఇప్పుడు కొత్తవాడెవరన్నా వచ్చి ముద్దు పెట్టుకున్నా అంతే చేస్తావు గావును!

శశి - నువ్వా??

అని అతనిని కొట్టబోయెను. కృష్ణుడు నవ్వుచు పారిపోయెను. శశిరేఖ చెట్ల సందుల వెంటనంటి చివర కాతనిని పట్టుకొని చెంపపై కొట్టెను.

కృష్ణ - అప్పుడే అంత ఆయాసం? ఇదివరకు ఎంత దూరమన్నా పరిగెత్తి దానవే?

శశిరేఖ మాట్లాడక సిగ్గుతో అతని వక్షమున తలను దాచుకొనెను.

కృష్ణ - మరిచిపోయినాను. తెలిసిందిలే. చూడు తలనిండా ఆకులెట్లా చిక్కు కున్నాయో! ఏదీ మొహం ఒకసారి చూపించు. మారిందేమో చూస్తాను. ఏదీ....అదుగో సుందర్రావు.

సుంద- నే నవసరం లేని సమయంలో వస్తున్నట్టున్నాను.

కృష్ణ - లేదు. ఏదో మరిచిపోయి పరిగెత్తింది. మరి.....శశిరేఖ కృ
నోరు రెండు చేతులతో మూసెను.

శశి - చెప్పవు కదా?

సుంద - నోరుమూస్తే జవాబు ఎట్లా చెపుతాడు?

శశి - తల వూగించు చెప్పనని. సరే. ఇంక మాట తప్పకూడదు.

కృష్ణ - ఇవ్వాళ చెప్పకపోతే మాత్రం డాక్టరుకి తెలీకుండా వుంటు

సుంద - సరే, తెలిసిందిలే.

శశి - ఇదేనా చెప్పననడం?

కృష్ణ - నేను చెప్పినానా? ఏమన్నానిప్పుడు?

శశి - నేను వెళ్ళిపోతున్నాను.

సుంద - వద్దు, వెళ్ళినారంటే కృష్ణుడు ఆ సంగతి ప్రశ్నలే వేసి చంపు
నన్ను.

కృష్ణ - సరేకాని, యీవాళ పౌర్ణమి. డింగీమీద షికారు వెడదాం.

శశి - వెడదాం, మళ్ళీ వద్దనకూడదు.

సుంద - నేను వద్దననిస్తానా?

కృష్ణ - సుందరరావు కూడా ఎక్కడే భోంచేస్తాడు.

శశి - అసలు కాలవదగ్గిరే భోంచేద్దాం. నేనన్నీ పట్టుకువస్తా.

సుంద - బలువైనవన్నీ నన్ను మొయ్యనిస్తేనే కాని నేను దానికి వొప్పు

శశి - బలువైనవేమీ లేనే లేవు. ఎంత బలువైనా మొయ్యగలను.

సుంద - అట్లా మొయ్యడానికి వీల్లేదు. కావలిస్తే కృష్ణుణ్ణి అడగండి.

శశి - ఎందుకు వీల్లేదు?

కృష్ణ - డాక్టరు చెపుతో వుంటే విని తీరాలి.

శశి - అదే, మళ్ళీ మాట్లాడుతున్నారూ? అయితే నేను వెళ్ళిపోతాను.

సుందరరావును, శశిరేఖయు అన్నమును తీసుకొని వచ్చిరి. కృష్ణునకు
యనిన మిగుల బద్ధకము. ఇంకెవరన్న పనిచేసి పెట్టిన యెడల అతని ప్రాణ



హాయి అనిపించును. అందుచే ఎక్కువసార్లు సుందరరావును. శశిరేఖయు కలిసి పని చేయట తటస్థించుచుండెను. అందరును భోజనమునకు కూర్చుండిరి.

కృష్ణ - ఓహో, ఏం మహా బగా చేశావు యీ కూర?

సుంద - నువ్వు చేద్దూ అంతకంటే బాగా, చూస్తాను.

శశి - మీకు తెలీదండోయి. కృష్ణుడు వంట చాలా బాగా చేస్తాడు.

సుంద - వాడికి నాకూ యిన్నాళ్ళూ చేసేపనేముందీ వంట నేర్చుకోకపోతే! మిమ్మల్ని అనకపోతే వాడే చెయ్యరాదూ, చేతయినవాడు?

శశి - మొగాళ్ళు వంటచేస్తారా యేం?

సుంద - ఎందుకు చెయ్యకూడదు? వంట ఆడవాళ్ళ మొహానే రాసుందా?

కృష్ణ - మొగాళ్ళు సంపాయిస్తారు. ఆడవాళ్ళు ఇంట్లో పని చూసుకుంటారు. అట్లా భాగించుకోవాలి పని.

సుంద - అట్లా కదా అని, ఆడది ఎంత కష్టపడుతోన్నా మొగాడుతనకి పని వున్నా లేకపోయినా యింట్లో కూచుని చూస్తో వూరుకోడమా? యింట్లో పని ముట్టుకోడ మంటేనే కొందరికి నామోషీ, జబ్బుగా వున్న భార్యకు మందు ఇయ్యడం పరువు తక్కువనుకుంటారు కొందరు. ఆడది అంత నీచమెందుకయిందో తెలీదు.

శశి - పోనిండి కాని, మాటల సందున పులుసంతా తాగేస్తున్నారు.

కృష్ణ - ఒంటరిగాళ్ళకేం తెలుసు? వాళ్ళ పొట్టలు నిండితే సరి.

సుంద - మీరు మాత్రం? ఒకరి పొట్ట నిండిందో లేదో ఒకరు చూసుకుంటారు. మూడోవాడేమైనా సరే.

శశి - ఆకుల సందులోంచి చందమామ పరమాన్నం రుచి చూస్తోంది.

సుంద - లేకపోతే యీ చెట్లకింద ఇంకో చందమామ ఎక్కడిదిరా అని చూస్తోందేమో!

శశి - పొండి!

భోజనమయిన తరువాత ముగ్గురునూ పడవలో నెక్కినారు. సుందరరావును, కృష్ణుడును ప్రవాహమునకు ఎదురు తెడ్లు వేయుచుండిరి. శశిరేఖ దిండ్లు వైచుకొని కూర్చుండెను. వెన్నెల ముఖమునంతను తడుపుచుండగా, ప్రకాశించు కండ్లతో చల్లని గాలి కౌగిలింతకు పులకరించు శరీరముతో, చీరె యిటునటు లోబడక

ఎగురుచుండగా, వెండ్రుకలు ముఖముననాడ, ఆ పడవ నానుకొని, సౌంద దేవతాయనునట్లు కానవచ్చు చుండెను. పడవ వేగమున చెట్లు వెనుకకు పరువె చున్నట్లున్నవి. దూరపు పొలముల నుండి కీచుమను శబ్దములును, తెడ్లవల నీటి శబ్దము మాటిమాటికి నిశ్శబ్దమును భేదించుచుండెను. కట్టపై నుండి చెట్లక్రిం నీడలు వెన్నెల గంభీరత్వమును నినుమడిం చుచుండగా, కదలుచున్న నీటిలో చంద్రకిరణములు వేయి విధముల మెరయుచుండెను.

సుంద - మీరు క్లియోపాత్రా. నైలుమీద నెట్టుచుండు బానిసలము మేము

కృష్ణ - మనవాళ్ళల్లో ఎవర్నన్నా చప్పరా అల్లాంటి వాళ్ళని.

సుంద - మనవాళ్ళల్లో పురుషుణ్ణి స్వాధీనం చేసుకొన్న స్త్రీ కూ వుందంటావా యేమిటి?

కృష్ణ - ఛా, నువన్నీ యిట్లానే అంటావు. మహాపతివ్రతలుండగా అ అంటావేం?

సుంద - నేననేదీ అదే. అందరూ పతివ్రతలే కాని పత్నీ వ్రతం చేయించుకొ వాళ్ళు వొక్కళ్ళూ లేరని.

కృష్ణ - లేకపోవడవేంలే, ఎంతెంత చక్రవర్తుల్నీ వేలుమీ తిప్పినవాళ్ళున్నారు.

సుంద - ఎప్పుడో ఒకప్పుడు స్త్రీ నాశించి పురుషుడు లోబడ్డా నిమిషా గాని, తరువాత తన్నులో, శాపమో దాని రాత.

కృష్ణ - అందరూ అంతేనా?

సుంద - నాకేంటి! ఎంతసేపటికీ అందంచేత మెరిపించారు కొందరు కొందరు నీతిపాఠం ముక్కలు వల్లవేసి భర్తలముందు ఏకరు పట్టారు నీతుల చిలకలమల్లే. ఇంతేకాని తమ బుద్ధి బలం వల్ల, ఆత్మ బలం వల్ల , భర్తల సహ గుణాన్ని మార్చి, సన్మార్గానికి తిప్పగలిగిన స్త్రీలు ఒకళ్ళూ లేరు. దుర్మార్గాని కీడ్చి వాళ్ళున్నారు. ఎంత సేపటికి భర్తకోసం, తమ సుఖాన్ని , ప్రాణాన్ని, మానా ఆఖరుకి ఇచ్చారు కాని, వాళ్ళకి నిజమైన ఉపకారం చేసిన వాళ్ళు లేరు అందరూ బానిసలు.

కృష్ణ - పోనీ అంత స్వార్థ త్యాగం చేశారు. చాలదూ?



సుంద - చేసి ఏం లాభం? తమకి మహోపకారం చేస్తున్న పురుషుడికి ఇంకొంచెం వీలు కలిగించారు. వాళ్ళకి ఇంకా దౌర్జన్యం నేర్పారు. స్త్రీకి గౌరవం న్యాయం లేకుండా చంపుకున్నారు. అంతే.

కృష్ణ - నేను వప్పుకోను.

సుంద - దాన్ని మొండివాదం అంటారు.

శశి - చేతులు నెప్పెట్టడం లేదూ మీకు? ఇంక వెనక్కి వెడదాం.

సుంద - సరే. వెనక్కి వెళ్ళడమంటే పడవని వదిలెయ్యడమేగా.

కృష్ణ - శశీ, సుందర్రావు ఫిడేలు వాయించడం నువ్వు వినలేదు కదూ, ఈవాళ వాయిస్తాడు.

సుందరరావు ఫిడేలు వాయించెను. ఆహా యేమి వాయిద్యము! ఏవో ఇదివఱ కెన్నడూ ఎరగని కోర్కెలనన్నిటిని బయటకు లాగుకొని వచ్చెను. వానికి అంతము లేదు ఆ కోర్కెలు ఫలించ వెన్నడునూ. అందరానివి. మానవశక్తి కతీతములు. ఆహా, ఆ స్వరముల సౌందర్యము? ఆ గాలితో యూగు ఆకుల గీతములతో, ఒడ్డును ముద్దిడు అలల శబ్దములతో, ఆ సౌందర్యమున ధ్వనించు ఆత్మగానముతో కలిసి మెలసి ఒకటై ఆ వెన్నెల మార్దవమును, ఆ మేఘముల రంగులను, ఆ ఆకసపు నీలపు లోతును, ఆ నీటి ప్రకాశమును, ఆ భూమి సౌజన్యమును, ఆ పచ్చిక లావణ్యమును, చెట్ల నీడల నిశ్శబ్దమును, పరిమళమును, అంతటిని ఆత్మ సామీప్యమునకు కొని వచ్చి విడిచినదా గానము. "కావలెను" "కావలెను" మహాతృష్ణతో అరచినది. "కావలెను. ఏమి కావలెనో తెలియదు. ఈ సౌందర్యము కన్న, ఈ దేహ సౌఖ్యముకన్న అధికమైనది, శాశ్వతమైన దేదియో కావలెను" అని నరనరముల నుండి భూమి రంధ్రముల నుండి, చెట్లయాకుల చిన్న నోళ్ళ నుండి, చంద్రకిరణములనుండి, ఆ జలకణముల నుండి మహాబాధతో విలపించినదా గానము. దుఃఖము భరింపరానిదైనది. సౌందర్యము నిలువదు. మేఘములు పరువెత్తుచున్నవి. రంగులు మాయమైనవి, యవ్వనము పోవుచున్నది. శరీరము శుష్కించినది. పువ్వులు వాడినవి. పరిమళము లేదు. పసిపాప యెదుగుచున్నది. ముద్దుమాటలు మాయమైనవి చూచునంతలో, అనుభవించునంతలో, ముట్టుకొను నంతలో నిలువకపోవుచున్నది సౌందర్యము. యేది యేది. ఆ సౌందర్యము అని పర్వులెత్తినది ఆ గానము.

ఆ గాన మాధుర్యమునకు కృష్ణుడు నిద్రావివశుడయ్యెను.

శశిరేఖ కండ్ల నుండి జలజలమని నీరు వ్రాలెను.

శశి – అట్లా పొద్దం చేతకావడానికి నా ప్రాణమన్నా యిస్తాను.

సుంద – అంత ఇష్టమూ సంగీతమంటే?

శశి – మీరు పాడుతున్నంతసేపు నిగూఢమయిన నా మనోభావములు నా సర్వశక్తులున్నూ మిళితములై వ్యక్తీకరింపబడినట్లు తోచింది. అట్లాంటి సంగీతానికి ప్రాణమిచ్చినా తనివితీరదు.

సుంద – ఇంత ఇష్టంగా విని ఆనందించేవాళ్ళు దగ్గిర వుంటేనే కా సంగీతం వచ్చి సార్థకమేమున్నది? మీరు కూడా నేర్చుకోరాదూ అంత యిష్టమైతే

శశి – నేర్పేవాళ్ళెవరు? తీరుబడిలేదు. జీతమియ్యడానికి డబ్బా లేదు.

సుంద – ఎన్నాళ్ళని యిల్లా దేనికీ కరువు పడుతోవుంటారు మీరు? ద కావాలనిపించదూ మీకు?

శశి – పాపము కృష్ణుడికేమీ చేతకాదు. నన్ను విడచివెళ్ళి చదువుకోడ

సుంద – అందరూ లోకంలో వెళ్ళటంలేదూ? ఇన్నాళ్ళు చాలదా యేమిటి ప్రేమ ఇంకా యెన్నాళ్ళు ?

శశి – ఏమిటట్లా అంటున్నారు?

సుంద – మరేమీలేదు. మొగాళ్ళ ప్రేమ చంచలమని.

శశి – కృష్ణుడికి నామీద ప్రేమ పోతుందా! ఆ చంద్రుడు వేరవుతా గాని! నా కోసంకాదూ, వుద్యోగమూ, చదువు లేకుండా ఇట్లా వున్నాడు?

సుంద – అదో కష్టం గావును? మీలాటి వారికోసం లోకంలో ఎవరు అంతకంటే ఎక్కువే చేస్తారు. ఇంతకీ వాడి అదృష్టం.

శశి – ఏంటో కొత్తగా మాట్లాడుతున్నారు. నాకు బాగా వుండలేదు.

సుంద – ఏమనుకుంటేే ఏం లాభం? నేను ఫిడేలు నేర్పితే నేర్చుకుంటారా

శశి – ఆయన్నడుగుతాను. అయినా నాకు వస్తుందనుకోను.

సుంద – ఎందుకు రాదు? ఇప్పుడు చూడండి. ఎంత సులభమో ఇట్లా పట్టుకుని కమాను లాగి చూడండి.





శశిరేఖ ఫిడేలు తీసికొని వాయించెను. అట్లు కాదని అతడు చేయి పట్టుకొని వాయింపించపోయెను. ఆమె చెయ్యి వెనుకకు లాగుకొనగా, పడవ వెనుకకు వంగెను. తత్తరపాటున ఆమెనాతడు గట్టిగా రెండు చేతుల తోడను లాగుటచే ఆమె అతనిని త్రోసి వెనుకకు వరిగెను. పడవ సగము వరిగి శశిరేఖ నీళ్ళలో పడెను. ఇదివరకే మేల్కాంచిన కృష్ణుడును, సుందరరావును, నీళ్ళలోకి దూకి ఆమెను వడ్డున చేర్చిరి. శశిరేఖకు స్మృతి లేదు.

తెల్లవారునప్పటికి శశిరేఖకు ఎక్కువగా జ్వరము తాకెను. కడుపు నందు విశేషమగు నొప్పిచే బాధపడుచుండెను, సుందరరావు చూచి ఆమె అపాయస్థితిలో నున్నదనియును, యింటివద్దకన్న నుపచారము బాగుగా జరుగుననియు, నామె నాస్పత్రికి మార్పించెను. కృష్ణుడును సుందరరావును రేయింబగళ్ళు ఆమెను కాచుకొని యుండిరి. పదిహేను దినముల కామెకు స్వస్థత కలిగెను. కాని మిగుల బలహీనముగ నుండి ఆస్పత్రియందే యున్నది. ఇంతలో కృష్ణుని తల్లికి విషజ్వరము తగిలినది. ఆ యింటికి శశిరేఖను తీసుకుని వెళ్ళుట మంచిదిగాదని సుందరరావనెను. తల్లిని కనిపెట్టు కొనియుండు కృష్ణుడును ఎక్కువసార్లు శశిరేఖను చూచుటకు వీలులేదు. శశిరేఖకు కావసిన యుపచారమును చేయించుటయు, ఆమె వంటరిగా యుండకుండ మాట్లాడించుటయు సుందరరావుపై బడినది. ఒకనాడు మధ్యాహ్నము శశిరేఖ ఆస్పత్రిలో తన గదిలో మంచముపై పరుండగా సుందరరావు కుర్చీపై కూర్చుని మాట్లాడుచుండెను.

సుంద – ఎట్లా ఉందీవేళ, చెయ్యి ఏదీ, మెత్తని చెయ్యి, ఎంత మొద్దెక్కినదో పని వల్ల. తామరాకును తాటాకు చేయటం పాపము.

శశి – పనిచెయ్యక తప్పుతుందా ఆడవాళ్ళయిన తరువాత?

సుంద– కొందరికన్నా తప్పి తీరాలి. కొన్ని పువ్వులను తల్లో పెట్టుకుంటారు. కొన్నిటిని చెట్లమీదనే వాడిపోనిస్తారు, అన్నీ ఒకటే?

శశి – మీకుమల్లే ఉద్యోగంలో వుంటే కృష్ణుడుకూడా నవుకర్లను పెట్టేవాడే.

సుంద – ముందు నా ప్రాణాన్ని పోగొట్టుకుంటాగాని అట్లాంటి చెయ్యని పని చెయ్యనిస్తానా? ఆ మృదు దేహం మీద ఈగని వాలనిస్తానా?

అతని కంఠధ్వనియందేదో మార్పు వినిపింపగా శశిరేఖ ముఖమెత్తి అతనివైపు చూచునప్పటికి కండ్లయందు దగ్ని మండుచున్నటుల కాన్పించెను. అతడేదో

లోపల నణచు కొనుటకు మహాప్రయత్నములు సలుపుచున్నటుల కా
చుండెను. శశిరేఖ బలహీన మామె కొక కొత్త యందము నిచ్చినది. బల
నిటునటు తిరిగి దొరకకుండ నుండినది. అసహాయయై యొక గుప్పెటలో
నటుల అచట పరుండి యుండుట కలిగినది. ఆ కండ్లు మాత్ర మతి ప్రకా
ములై ఆకర్షణాశక్తి నినుమడించుకొనెను. కలవ తూండ్లవలె తెల్లని
హస్తములు సన్నని దేహము ప్రక్కన పడియుండెను. మొదటినుండియు శశి
సుందరరావును చూచిన ప్రీతి. అతని వైద్యము, మర్యాద, సంపాదన
నామె కాశ్చర్యమును, గౌరవము కలదు. ఎంతో నిపుణతతో తాను
రోగముల నాతడు చెప్పినపుడు ఆమె యాతని శక్తి కాశ్చర్యపడుచుండెను
యీ దినమాతని ముఖము కాంచినది మొదలు ఆమె హృదయమున కొత్త
మొకటి కనబడినది. గుండెలు తటతట కొట్టుకొనుచు మనసు గిర్రుని తిరి
చుండెను. తెలివిగల యాతని ముఖమును, నున్నగ గొరిగిన యా
పెదవులను, తీక్షణములగు నా కండ్లు చూచిన నామెకు భయము తో
భయమువలని అయిష్ట తయు, నాతనిపై గల గౌరవముచే నిష్టతయు కలి

శశి – మీకు ఇష్టమయినట్లాంటి వాళ్ళని పెళ్ళి చేసుకోరాదూ?

సుంద– శశీ! నీకు తెలీదూ? నన్నింకా అర్థం చేసుకోలేదూ?

అని ఆమె ముఖము దగ్గరగా వంగి అడిగెను.

శశిరేఖ వడలు కంపించినది. రెండు చేతులతో నతనిని నెట్టివేసినది
అతడా చేతులను గట్టిగా పట్టుకొని వానిని బలవంతముగ ముద్దు పెట్టి
వెళ్ళిపోయినాడు.

శశిరేఖ అట్లే పరుండి ఆలోచించుకొన్నది. బలవంతముగ తన
కావించిన అవమానముకై మిగుల కోపం వచ్చినది. నేత్రములు కోపారుణములై
ముఖమెర్ర బారినది. కాని అతని మాటలు, అతని స్పర్శ తన కానంద
కలిగించిన సంగతి జ్ఞప్తికి వచ్చుచుండెను. అతడేమి చేసినను తన కి
వచ్చుననియు, అతని ప్రేమను తానును వాంఛించుచున్నటుల ఆమెకు తో
ఆ తలపుతో వడలు వణకెను. భయము వేసెను. కృష్ణునియందు తనకు ప్రే
పోయినదా? పోనీ, తగ్గినదా? లేదు లేదనెను ఆమె హృదయము. కృష్ణుని
మృదుత్వమును, అమాయకత్వమును, తనపై నాధారపడు అసహాయత్వము



తనను దైవముగా చూచు ప్రేమను, అతని కుర్రతనము తలచు కొనిన అతనిపై ప్రేమ యెంతో తోచుచుండెను. కాని సుందరరావు గంభీర స్వభావమును అతనికే లోబడిన అతని శక్తిని, బలమును, తనయందాతడు చూపు గౌరవమును ఆమె నాకర్షించెను. అందరును ఎవరిని గౌరవించుచుండిరో అతడే తన సౌందర్యము నకు దాసుడయ్యెనుగదా యని గర్వము కలిగెను. కృష్ణుడామెను "నీ వందముగా నున్నావ" న్నప్పుడు ఆమె యంద మామెకు తెలియలేదు చిన్నపిల్లవలె నవ్వెను. కాని యిప్పుడీతని చూపులే తన యందమును తనకు వెలిబుచ్చుచుండెను. కృష్ణుని ప్రేమ యే యాటంకములేక యామెపై ప్రవహించి ముంచివైచెను. కాని యీతని ప్రేమ ఆటంక పరుపబడి యాగి యాగిలోనిముదక ప్రవహించుచుండును. అతని ప్రేమను మళ్ళించుకొనుటకు, అతని తలపులను మార్చుకొనుటకు, అతడు చేయు మహా ప్రయత్నములు అతని ప్రేమకు మరింత బలమునాపాదించుచుండెను. కృష్ణుని ప్రేమించు తాను యీ తలపులనైన రానిచ్చుట మంచిదేనా? న్యాయమా? పాపముకాదా? కాని తన మనస్సంతయును సుందరరావు వైపు లాగుచున్నదే! ఈతని ప్రేమలేక యెట్లుండకలదు? ఇతని ప్రేమను తృణీకరించి కృష్ణునితో పూర్వమువలె నుండగలదా? నిర్జీవముగా దినముల నెట్లు గడపగలదు? సూర్యుని ముద్దుల రుచి చూచిన కమలము, ఇక చంద్రుని వెన్నెలతో నెట్లు తృప్తినందగలదు? కాని కృష్ణుని ప్రేమించి తా నితనిని కూడ ఎట్లు ప్రేమించుట? తాను వీరిద్దరి నొక్కసారే ప్రేమించుచుండెనా? మానవ హృదయమెంత నిగూఢమో! కృష్ణుడు తనను ప్రేమించెను: గాని అతను తన చూపుల తోడనే యితనివలె తన శక్తినంతను లాగివైచి తన హృదయమును తనది గాకుండ చేయలేదు. వలయందు తగుల్కొని శక్తియంతము బోగొట్టుకొనిన చిలుకవలె నామె యుండెను, కాని యెంత తాను వలచినను కృష్ణుని మాత్రము తాను మోసపుచ్చుకూడదని నిశ్చయించుకొని, వెంటనే కృష్ణునికి తన నింటికి తీసికొనిపొమ్మని యుత్తరము వ్రాసెను. ఆ సాయంకాలము తరవాత దానచట నుండుట కిష్టము లేదనియెను. అరగంట లోపునను ఆస్పత్రి నౌకరు ప్రత్యుత్తరము తెచ్చెను.

శశీ,

అమ్మకు జబ్బు ఎక్కువైనది. ఇచ్చట కీస్థితిలో నీవు వచ్చుట కెంతమాత్రము వీలులేదు? నా కామెను వదిలి ఒక్క క్షణమైనను తీరుబడి యగుటలేదు. ఒక్క

వారము వఱకచ్చుటనే యుండుము. నానుండి ఎడబాటు నీకెంత బాధ కలిగించు
తెలియును. కాని ఒక్క వారము రోజులే కదా! ముద్దులు.

ఇట్లెల్లప్పుడు నీ కృష్ణ

అనుభవ మెరుంగని నూతన యవ్వనమున కృష్ణుని ప్రేమను గైకొన్న శ యిప్పుడు యిరువదియేళ్ళ స్త్రీ అయినది. కృష్ణుడు ఆమె మనసును ఆట దొంగిలించెను. సుందరరావు ఆమెని స్త్రీవలె సన్మానించి ఆమె ప్రేమను కోరలేదే. ఇప్పుడు ప్రౌఢ అయిన శశిరేఖ హృదయము ప్రేమ వికాసమును పొంది, గాఢ గంభీరముగ తన సర్వశక్తులను పీల్చివేయు బలముగల భయంకర మోహము కళ్ళు తిప్పుకొన లేకపోయినది. తీవ్రమగు ఉద్రేకములతో పెనగిన మహో రక్తమామె నాళముల ప్రవహించుచుండెను. ఆమె పాదములకు నమస్క తాకిన ఆమె దేహ మెక్కడ కందునో, అని ఆమెను దేవతగ పూజించే భక్తులతో కవసరము తీరినది. ఆమెను నలిపి జీవన రసమును పిండి, తాగి, మూర్ఛనం గల ప్రేమ నామె వాంఛించెను. అగ్నివలె తాపమున దహించు తృష్ణకు ఉప ముగ మహాప్రళయ, మేఘముల గర్జించు చండవర్షమే కావలెను.

## 6

ఆరు రోజులు గడిచినవి. సుందరరా వాదినము నుండియు శశిరేఖ స్థితిని కనుగొనుటయే గాని, ఆమె గదివైపున కైనను వచ్చుటలేదు. శ యతడెందుకట్లు మారెనాయని యాశ్చర్యపడెను. అతనికి తనపై కోపము వ కాబోలు! కోపము వచ్చిన తనకేమి? పోనీ ఇబ్బంది తొలగెను కదాయని సం కదా! కాని మనసు వ్యాకులపడుచున్నది. తానింటికి బోవులోపల తనకు కో రాలేదని అతనికి తెలియ చేయవలయును. కృష్ణుని చూచుటతోడనే సుంద విషయ మాతనితో చెప్పవలయునుకదా? అతడింక సుందరరావుతో తన కేమి కోపము లేదనియు, కాని అతడట్లు తనను ప్రేమించుట తప్పనియును చెప్ప ఎంత బాగుండును. ప్రొద్దుననే తాను తన ఇంటికి వెళ్ళుచుండెనే! ఇంక స యేది?

ఇంతలో నౌకరొక చీటి తెచ్చియిచ్చెను. గుండెలు కొట్టుకొనెను, సుంద దస్తూరి, వణకు వేళ్ళతో చీటి విప్పి చదివెను.





అమ్మా,

మీ అత్తగారికి స్వస్థతగా నున్నది. మీరు రేపు యింటికి పోవుచున్నారు. నా తెలివితక్కువను క్షమించి యుంటిరేని, ఈ సాయంత్రము నా యింటి కొక్కసారి భోజన మునకు వచ్చి. నన్నానందింపచేసేదరా? ఇంక నెన్నడును అట్లు చేయను. నా తప్పిదము నకు నేనెంత బాధ్యుడనో మీ అందమును అంత బాధ్యత గలదే.

ఇట్లు పశ్చాత్తాప తప్తహృదయుడు,

సుందరరావు

"సరే" నని చెప్పమని ఆమె ప్రత్యుత్తరము పంపెను. తానే సమయము కొఱకు వేచియుండెనో యది తనంతట యదే తటస్థించుటచే ఆమె హృదయము సంతోషముతో నిండిపోయెను. వెంటనే దుస్తులు మార్చుకొని, దినముకన్న భద్రముగ శృంగారించు కొనెను. ఎందుకంత కాలము ఆ అద్దము ముందు? తానా సుందరరావున కెట్లు కనబడిననేమి? ఏమో ఆమెకే తెలియదు. పాపము. ఎంత పశ్చాత్తాప పడినాడో కదా! తన అందమతనినట్లు చేయునట్లు చేసి యుండును. తనకంత అందము కలదా? పాపమాతడింక వంటరిగా నుండవలయు కదా? తననేగాక తన స్నేహితుని గూడ కోల్పోయి ఎంత చింతించునో? ఈ వక్క సాయంత్రమే కదా.

సుందరరావు బంగళా, ఆస్పత్రి ఆవరణలోనే యుండెను. శశిరేఖ ఇదివఱ కెన్నడును అచటకుబోయి యుండలేదు. చక్కని బంగళాయు చుట్టును సుందరమగు విన్ని పూవుల చెట్ల తోటయు గలదు. తోట తలుపు దగ్గరకు వచ్చునప్పటికే సంతోషము తొల్కాడు ముఖముతో సుందరరావెదురు వచ్చి ఆమెను తోటలోనికి తీసికొని పోయెను. శశిరేఖ చుట్టును చూచినది. చామంతి విరివిగా పెరిగి మంచి వాసన విచ్చుచుండెను. పూర్ణముగ విచ్చిన గులాబీ పువ్వులు ఆకసమువైపు తెరచుకొని యుండెను. అస్తమయ సూర్యుడు తోటనే రక్త వర్ణముతో కప్పెను. చంద్రకాంత యనేక రంగులతో నవ్వుచుండి నది. తడకలపై జూకామల్లె పాకియుండెను.

శశి - ఎంత అందంగా వుంది! యింత అందంగా ఎవరు చేశారు?

సుంద - నేనే.

శశి - ఇదివరకే నాతో ఎందుకు చెప్పలేదు? ఎంత అందంగా ఎప్పుడూ వచ్చేదాన్ని, ఇక్కడికి, నాకు తెలిస్తే , కల్లోకూడా ఇంత అంద తోట వుందనుకో లేదు.

సుంద - నేనూ, మీరూ, సమానంగా ప్రేమించే విషయాలు చాలా న్నాయే!

శశి - అందమయినదాన్ని చూస్తే నాకింక యేమీ అక్కర్లేదు. అంద యిచ్చేస్తాను. ఈ లోకంలో వున్న అందమయిన కట్టడాలూ. తోటలూ, ప చూడాలని వుంటుంది. ఈ దేశములోనే చూడ్డానికి నోచుకోలేదు. ఈ వున్న అందమయిన మనుష్యులందర్తోను స్నేహం చెయ్యాలని వుంటుంది అందమూ నాది కాకూడదూ? ఎన్నిసార్లో ఆకాశంలో యిట్లాంటి అంద దాన్ని నాది అనుకుం టాను. కాని అప్పుడే పోతుంది. లోకంలో అంత అ అంతేగావును!

సుంద - కాదు. మీ మొహం అందం ఎన్నడూ పోదు.

శశి - పోకేంలేండి,ఆగండి నాలుగు నాళ్ళు.

సుంద - నేను చూపిస్తాను లోకంలో సుందర ప్రదేశాలన్నీ హిమాలయాల్లో మహారణ్యాలు, స్వర్గాన్నంటే హిమవచ్ఛిఖరాలు. గంగా నదీ తీరముల వనాలు, మలబారు సరోవరాలు, కావేరీ ప్రాంతముల చూచి సంతోషించే సంతోషాన్ని నేనున్నూ పొందుతాను.

శశి - ఎట్లా? కృష్ణుడొప్పుకోవద్దూ? ముసలివారిద్దరో?

సుంద - లోపలికి రండి.

తన యిల్లునంతను అతడామెకు చూపెను.

శశి - ఈ పటములెక్కడివి? ఎంతందంగా వున్నాయి? ఎక్కడ కొ అబ్బా! యీ పటాల్లో ఉన్నటువంటి చోట్ల వుంటే ఎంత బాగుంటుంది విచారమనే మాట యెక్కడిది?

సుంద - మీతో ఎవరూ ఉండనక్కరలేదూ అక్కడ? ఈ పటాలు మీకు?

శశి- వద్దు. ఈ పుస్తకాలన్నిట్లో ఏముంటుంది. ఇవన్నీ మీరు చ ఇదంతా వైద్యమే?



సుంద - ఇవన్నీ కథలు.

సుంద - ఇవన్నీ కథలా? అన్నీ చదివారూ? మీకెన్నో కథలు వచ్చి ఉండాలి. కటన్నా యెన్నడూ చెప్పారుకారేం?

సుంద - మీకంత యిష్టమనుకోలేదు.

శశి - మీరన్నీ అట్లానే అనుకుంటారు. మీరు సంగీతం పాడిందాకా నాకంత ష్టమన్న సంగతి తెలిసిందీ? ఈవాళ పాడరూ వొకసారి!

సుంద - రాణి ఆజ్ఞాపిస్తూవుంటే సేవకుడు చేయకుండా వుండగలడా? జనమైన పిమ్మట అని శలవా?

శశి - (నవ్వుచు) సరే. ఎంత మంచి వాసన వేస్తోంది! ఇట్లాంటి బంగళాలో క్కళ్ళూ వుండడం బహుకష్టం. నిద్ర వచ్చేస్తోంది.

సుంద- ఈ బంగళా అందం నాకు యీ రోజున తెలుస్తోంది. పడిన కష్టం లితానికి వచ్చింది. మీ యిష్టం వచ్చినప్పుడు రండి. నేనే పనిమీదనున్నా మీరు చ్చి మీదిలాగే వుపయోగించుకోవచ్చును.

శశి - మళ్ళా రానుగదా-

అని మరిచిపోయి జారి వచ్చెను.

సుంద - ఎందుకు?

శశి - ఏదో అట్లా అనిపించింది.

సుంద - మళ్ళా రారా? మీరు నా యందు దయయుంచి రావడంవల్ల న్ను క్షమించి నా తప్పు మరచినారనుకొన్నాను. కోపము పోలేదా?

శశి - నాకు కోపమసలు రానేలేదు.

సుంద - రానేలేదా, ఎంత అదృష్టవంతుణ్ణి! శశీ, శశీ, నా మీద ప్రేమ ందా? నీకు కోపము రాలేదా?

అని ఆమె యెరుగకముందే ఆమెను కౌగలించుకొని ముఖమును ముద్దు ట్టుకొనెను. శశిరేఖ వడలంతయును వణకెను. నిశ్చేష్టితయై నిలవబడెను. ండ్లనీరు కారుచుండెను.

సుంద - ఎందుకు దుఃఖము? శశీ, నా మనోహరీ, ఎందుకు చెప్పవూ?

శశి - కృష్ణునికి అపరాధము కాదూ? నన్ను నమ్మిన అతన్ని
మోసపుచ్చడమా? అది నా మనస్సు కాల్చి వేస్తోంది.

సుంద - ఇన్నాళ్ళు నువ్వతనిదానివై యుండ్లలేదూ? ఇంకా ఎందు

శశి - ఇట్లాంటి మాటలు నాతో చెప్పొద్దు.

సుంద - కాని వొకటి చెప్పవూ? అతని విషయం అట్లావుంచి నా
కిష్టమేనా?

శశిరేఖ తల యూగించెను. "నా శశీ" యని అతడామె వక్షమును
కుని నోటిపై మెడపై ముద్దులు పెట్టుకొనెను.

సుంద - శశీ, నన్నొక్కసారి ముద్దు పెట్టుకోవూ?

శశి - వొద్దు.

అని అతనిని తోసికొని బయటకువచ్చి తోటలో కుర్చీలో కూర్చు
సుందరరావు వెనుకగానున్న కుర్చీలో కూర్చుండెను. ఆమె మనసు
మండిపోవు చున్నది; తాను చేసిన పనిని గూర్చి ఆలోచింప ప్రయత్నించె
ఆలోచనాశక్తి పోయినటుల తోచెను. కొట్టుకొను ప్రతి నాడితోను పరువెత్తు
కృష్ణుని కెంత కష్టము కలుగునో అను తలపు మాత్ర మామె మనసును
మాడ్చుచుండెను. వంట సిద్ధమైనది.

సుంద - భోజనానికి లేవండి.

శశి - నాకక్కర్లేదు. క్షమించండి.

సుంద - ఇది న్యాయమేనా. పైగా ఇంటికి వచ్చి పస్తుపడుకుంటా

శశి - సరే లెండి, పదండి. నిద్రగా వుంది.

శశి భోజనము నేమాత్రమును చెయ్యలేదు. ఆమె కొరకెంతో
వంట చేయబడెను. సుందరరావు ముఖము చిన్నపోయినది. భోజనము
తాంబూలము వేసికొనుచు, నక్షత్ర కాంతికింద తోటలో కూర్చుండిరి,
చామంతి పువ్వులను చీల్చి రేకులను వెదజల్లుచుండెను.

శశి - శెలవు. పొద్దుపోయింది! వెడతాను.

సుంద - రాణి సేవకున కిచ్చిన ఆజ్ఞను మరచిందా?

శశి - చాలా పొద్దుపోయింది. ఇంకోసారి.



సుంద - మీ యిష్టము. నన్ను నిరాశ చెయ్యడం న్యాయమని తోస్తే -

శశి - సరేలెండి.

శశిరేఖ కూలబడినది. సుందరరావు ఫిడేలు తెచ్చుట కింటిలోనికి పోయినాడు. రివ్వున చల్లని గాలి వీచుచున్నది. చీకటియందు చెట్లు ఇటునటు అశాంతితో కదులు చున్నవి. దూరమున పొదల ఆకుల చీకటిలో మిణుగురు పురుగులు మెరయుచున్నవి. జాజిపువ్వులవాసన వింత తలపులను మనసున పుట్టించుచున్నది. తలపై నక్షత్రములు దీపములవలె మండుచున్నవి. ఆరుద్ర నక్షత్రముల గుంపు ఏదో వింత యుద్రేకమును పొడమ చేయుచుండును.

సుందరరావు ఫిడేలు వాయింపజొచ్చెను. అతని హృదయారాటము లన్నియు ఆ సంగీతమున ప్రతిఫలించెను. ఆహా యేమి వాయిద్యము! ఎచటనో దాగి చిన్నప్పుడు మరచిన సుఖదుఃఖముల జ్ఞప్తికి తెచ్చు గానము. హృదయాకాశమున నన్నని మబ్బులవలె యావరించిన యాదర్శముల వ్యక్తీకరించు గానము. నిగూఢములగు సర్వ విధములగు నుద్రేకముల నూతన తీక్ష్ణత్వమున వెలిగించు గానము. సర్వస్వరముల యందము నొకటి గూర్చి కంఠమాలికలవలె యర్పించు గానము. సర్వదుఃఖములను, సందేహము లను ఆలోచనలను, భయములను వదలి జీవితమును ప్రేమ దేవతా పాదముల బలి యిమ్మని యుత్సహించు గానము, లోకమున సౌందర్యము కన్న మించిన దేదియులేదని, వేనోళ్ళ బోధించు గానము. పుణ్యము, పాపము, కర్తవ్యము, విధి, అధికారము, ఆజ్ఞ, ప్రతిష్ఠ, పవిత్రత అనునవి మనుజుడు సృజించుకొన్న మాయ భూతములే కాని ఇంకే మియు కాలనియు, సత్యము ప్రేమయే ప్రేమింపదగినది ఒక్క నిముషమైనను సౌందర్యమే నని, సుందరస్వరముల వర్ణించు గానము. "ప్రేమించు, ప్రేమించు. ఒక్క నిముషమునకై నను సర్వమునుప్రేమ హోమమున దగ్ధము చేయుము"ని ప్రోత్సహించు గానము. సౌందర్యము నశించుచున్నట్లు కనబడినను, తిరిగి తిరిగి హృదయముల మూర్ఛనందించుట కుద్భవమగుననియు, సాయంత్రపు ఆకాశ వర్ణములు ఉదయమునను, పున్నమినాటి వెన్నెల అమావాస్య నక్షత్ర కాంతి యందును, స్త్రీ సౌందర్యము శిశువునను, మలయ మారుతము శీతలత్వము హిమమున, ఆవిర్భవించునని యాస పుట్టించు గానము. అట్టి, గానము నతడు ధ్వనింప చేసెను. శశిరేఖ వడలు మరచినది ఆనందమున పరవశత్వము నొందినది. మనుష్యలోకము

నకు, కష్టసుఖములకు, స్థూల జడత్వములకు, అది దూరమగునేదో మహా
లోకమున తిరుగుచుండెను. ఒక గంట, రెండు గంటలు, మూడు గం
దాటినవి. ఇంకను సుందరరావు వాయించుచునే యున్నాడు. నిశ్చలతచే
యట్లే పరుండెను. పన్నెండు గంటలు కొట్టిన చప్పుడు కాగా, శశిరేఖ
లేచేను.

శశి - నేను వెడుతున్నాను.

సుంద - అప్పుడే?

శశి - ఇప్పుడు కొట్టింది పన్నెండు కదూ? ఇక నేను పోవాలి.

అని లేచెను. సుందరరావును లేచెను.

సుంద - వెడతావా? శశీ? ఇదేనా ఆఖరుసారి. ఎట్లా బతకను?

యీ చీకట్లో నన్ను వదలిపోవడం న్యాయమేనా ?

తిరిగి చల్లని గాలి విసరెను. జాజి పువ్వుల వాసన "వైను" వలె తలకె
వచ్చుచుండెను. సంగీత ధ్వని యింకను చెవుల వినబడుచుండెను. చుక్కల
ప్రకాశమున కండ్లు మిరుమిట్లు గొల్పుచుండెను. సుందరరావు శశిరేఖను కౌగి
కొని దగ్గరకు లాగుకొన్నాడు ఇద్దరి హృదయములను బాధయెత్తు చుండు
కొట్టుకొను చున్నవి. వేడి నిట్టూర్పుతో గట్టిగ నామె నదుముకొనెను.

సుంద - శశీ, ఇప్పుడెక్కడికి వెడతావు. ఆస్పత్రి తలుపులు మూ
నువ్వు యింటికి వెళ్ళి వుంటావనుకుంటారు వాళ్ళు. ఎక్కడికి పోతావు? దై
నిన్ను నా దగ్గిరికి పంపింది తెలీడం లేదూ, శశీ, శశీ, సందేహమెందు
రావూ?

శశిరేఖ తల గిర్రని తిరుగుచుండెను. ప్రతి నరమున సమ్మెట వలె కొట్టు
చుండెను. లోకమునందలి మహా ఉద్రేకములన్నియు ఆమె శరీరములో పొంగు
టుల తోచుచుండెను. తలపులు లేవు. హృదయచేతనము
మనేకాందోళనములతో బ్రద్ధలగునట్లుండెను. అపరాధమే అను మహా
ఒక మూల. అన్నియును నిర్లక్ష్యము చేయు మహా ప్రేమాగ్ని వదలంతు
ఆహా ఎట్టి ఆనందము. ఆ కౌగలించుకొనిన చేతులు వంటిని తాకి మందు
ఆ హృదయము తాకుడు నరనరమును పీకుచుండెను. మెడపై యురముపై



పెదవులు కాల్చుచున్నట్లుండెను. ఆ వేడి యూపిరి ఆమె ముఖమంతయును కప్పుచుండెను.

సుంద - ఈ నక్షత్రములు, యీ గాలి, యీ పువ్వులు ప్రేమించమని అరుస్తున్నాయి. తెలియడంలేదూ? నిన్ను వొదిలి బతకలేను. వినపట్టంలేదూ ప్రేమవాణీ! ఇంక వదలను, రా, రా, నా శశీ, మనోహరీ, నువ్వు నా దానవు. రా.

శశీ - కాదు.నేను పోవాలి, వదలండి. అయ్యో, అయ్యో, వదలండి నేను వుండను. తప్పు. నేను వొప్పుకోను. వదలమంటంలేదూ? నేను వుండను. నేను బతకను. అయ్యో

అని అరచి అతనిని తోసివేసి తలుపు దగ్గిరకు వడిగా నడిచెను. సుందరరావును మెల్లగా వెంట వెళ్ళెను. అతనికి వళ్ళు తెలియుటలేదు. శశిరేఖ వెళ్ళుటతోడనే అతనికి పిచ్చియెత్తినట్లయ్యెను. ఇంతలో రాత్రి పిట్టవకటి కెవ్వన యరచి శశిరేఖ దగ్గరగా ఎగిరెను. శశిరేఖ అరచి వెనుకకు సుందరరావు కౌగిలిలోకి వరిగెను.

సుంద- ఏమీలేదు. ఎందుకు భయము. నేను లేనూ? ఎందుకు వణుకుతావు?

శశి - నేను ఒక్కత్తైనూ వెళ్ళలేను. నన్ను మీరు తీసుకువెళ్ళండి. ఇంటికి వెడతాను

సుంద - శశీ, నా మీద ప్రేమ లేదూ? రా, చూడు, ఈ రాత్రి నిన్ను వదలను. పోనీను శశీ, నన్ను వదలగలవూ? వదలగలవూ.

శశిరేఖ గజగజ వణకుచుండెను. ఆమె మనసామెకు తెలియదు. సుందరరావామెను యూపిరాడకుండ మాట్లాడనీక కౌగలించుకొని, ముద్దు పెట్టుకొనెను. అతని చేతులు ఆమెను కఠినముగ - కత్తితో కోసినట్లే అంతటను తాకుచున్నవి.

సుంద - రా, ఇంక సందేహించకు. రా. ఈ రాత్రి నిన్ను వదలుతానా, నిన్నిక్కడ బలవంతంగా నిలిపిస్తాను గాని?

శశి - అయ్యో! రాను, రాను. నా మీద దయలేదూ? నన్ను వదలరూ? నేను వెళ్ళాలి, అయ్యో!

సుందరరావామె మెడను గట్టిగా అదిమి ముఖమును ఊపిరాడకుండ ముద్దుచే నింపి వేసెను.

సుంద- నా మీద దయలేదూ? సరే, అంత అయిష్టమయితే!

అని పెనుగులాడు శశిరేఖను వదలి దూరముగ పోయెను. శశిరే వచ్చి అతనిని కౌగలించుకొనెను.

శశి – మిమ్మల్ని వదల్లేను. వదల్లేను. అయ్యో! వదల్లేను. నన్ను రా దగ్గరికి. నన్ను తీసుకుని వెళ్ళరూ? నా మనోహరా, నువ్వే నాకు. ఇం లేరు. మీరు లేంది బతకలేను. రండి రండి ఇంకెందుకు?

సుందరరావతి యానందమున ఆమెను యింటివైపునకు లాగె జుట్టు విడి ఆమెను కప్పి వేసినది. కళ్ళు కనపడవు.

సుంద – అమ్మా! ఎంత దయ నా మీద!

శశి – వద్దు, ఇది తప్పు, జన్మమంతా మీ దాసినౌతాను. కాని నన్ను నాకు శక్తిలేదు. బలంలేదు. నన్ను పోనీండి. నమస్కారము చేస్తాను.

సుందరరావామె మాటల నర్థము చేసికొను స్థితిలో లేడు, ఆమె చేయివేసి దగ్గరకు లాక్కొని అడ్డముగానున్న పడకకుర్చీ తగిలి ఆమెను లాగుకొని దానిపై బడెను.

సుంద – ఇంక మాట్లాడకు. ఇట్లా చూడు. శశీ, నా దానవైనా సౌఖ్యము. నా దానివి, దానివి.

అని చేతిని ఆమె వక్షము చుట్టూ వేసెను.

శశి – అయ్యో కృష్ణా..............

ఇంక మాట్లాడకండ రెండు పెదవు లామె స్వరము నాపెను. చల్ల వీచెను. పువ్వుల వాసన చుట్టుకొనెను. నక్షత్రములు ప్రకాశించెను. గాఢాంధ

## 7

తెల్లవారుచున్నది. అయిదు గంటలయినది. చల్లని, బడలికలు గాలి వీచుచుండెను. కొత్త పువ్వులు పూచి వనమంతయు అలంకరిం సన్నముత్యముల వలే ఆకులను పువ్వులను మంచు అలంకరించినది. రా జాజి, గులాబి, పారిజాతము, గన్నేరుపువ్వు లాతోటలో తలలుయూచ



ఉయ్యాలలూగుచున్నవి. ఆకాశమునుండి గులాబి రంగు భూమియంతయు కొత్త వస్త్రమువలె నలంకరించినది.

సుందరరావు పడకగదిలో శశిరేఖ లేచి కూర్చుని తోటవైపు చూచుచున్నది. ఆమె కప్పుకొన్న సన్నని యుత్తరీయమునుండి సున్నితమును, సుకుమారమును, మృదువు నగు నామె శరీరమంతయును, కానవచ్చుచుండెను. నున్నని భుజములను, దానిపై సన్నని ముడుతలులేని మెడయును, సౌందర్యమును పూజించు కవులను సహితము అనిమిషులను చేయగల వంపులు తిరిగిన ఆ వక్షమును నల్లని వెంట్రుకుల కప్పు చుండెను. ఎర్రగ నలిగిన పెదవి యూరక వణకుచుండెను. ఆమె మనసిచటలేదు.

రాత్రి నుండియు గడచిన సంగతులన్నియు తలపునకు వచ్చుచున్నవి. కృష్ణుని తలంచుకొన్నపుడెల్ల ఆపరాని దుఃఖము పొర్లి పొర్లి వచ్చెను. ఆ గవాక్షమును అల్లుకొనిన రాధామనోహరి పువ్వుల వాసనను గాలి లోపలికి కొనివచ్చుచున్నది. సూర్యుని లేకిరణములు మంచుముత్యముల వివిధ వర్ణములతో మెరిపించుచున్నవి. కృష్ణుడీసరికి తన కొరకై సిద్ధముగా నుండును గాబోలు అను తలపు శశిరేఖ మనసునకు వచ్చినది. తన స్థితిని తలచుకొని వేదననాపజాలక మూల్గుచు, నిద్రించుచున్న సుందరరావు సంగతే మరచి, వెనుక నాతనిపై బడెను. అతడును "ఏమి" అనుచు ఉలికిపడి లేచి, ఆమెను తననానుకొను నటుల కూర్చుండపెట్టి.

"ఎందుకట్లా పడ్డావు?"

శశి – ఏమీ లేదు.

సుంద – నాతో చెప్పు. ఏడవకు. ఎందుకూ ఏడుపు?

శశి – నేనిప్పుడింటి కెట్లా వెళ్ళను?

సుందరరా వాలోచించుచు అయిదు నిముషములు కూర్చుండెను.

సుంద – అవును. వెళ్ళొద్దు. ఇక్కడేవుండు.

శశి – అయ్యో. కృష్ణుడేమంటాడు? నన్ను విడిచి ఒక్క నిమిషం వుండలేడే! నన్నిక్కడ చూచి బతగ్గలడా? అతని దుఃఖము చూస్తే నేనుండగలనా?

సుంద – మరి చేసేదేముంది? పోనీ, అతని దగ్గిరికే వెళ్ళు. ఇక తప్పకపోతే.

శశి – ఇక కృష్ణుడి మొహం ఎట్లా చూడను? వెళ్ళిమాత్రం ఏమి లాభం? ఇంక అతని పాదాలు ముట్టుకోడానికైనా అర్హురాలినా? అయినా మిమ్మల్ని వదలగలనా?

సుంద - నన్నొదల్లేవా?

శశి - ఇంకా అడుగుతారా? వదలగలిగిన దాన్నవుతే యిట్లా యెం
తాను?

సుంద - అయితే ఇప్పుడు మా ఇద్దరిలో నెవరినీ వదలవా ఏమిటి!

శశిరేఖ ఊరుకున్నది.

సుంద - అతనితో ఇదంతా చెప్పడమెందుకు ? అతనిదగ్గిరే ఉండు. నా
స్నేహముగా ఉండు. నా కంతకన్న ఏమీ అక్కరలేదు ?

శశి - కోపముతో అతనిని విదలించుకొని లేచినది.

శశి - నా సంగతంతే అనుకొన్నారా? మీ మీద కృష్ణునికన్న
ప్రేమ కలిగి నన్ను బలవంతపరచినది కాని, లేకపోతే నా చిటికిన వ్రేలు
దాన్నా మిమ్మల్ని? ఎప్పుడు మీ దాన్నయినానో, అప్పుడే కృష్ణుడు నా జీవితము
తొలగిపోయినాడు. ఇంక కృష్ణుడితో ఉండలేను. మిమ్మల్ని వదలనూలేను. కృష్ణు
ఉన్నా ఒకవేళ మిమ్మల్ని నా దగ్గిరకు రానిస్తానా? నా ప్రాణము ముందు
కాని? ఆడవాళ్ళంటే అధములని మీ అభిప్రాయము కాబోలు. నా మీద
నీచమైన అభిప్రాయమున్నప్పుడు మీకు నా మీద ప్రేమ యేమిటి? నేను ఎ
క్కడికి వెడతాను.

సుంద - శశీ, నా తెలివితక్కువను క్షమించు. నన్నేమి చెయ్యమం
ఆజ్ఞాపించు.

శశి - మనమిక ఈ వూళ్ళో ఉండకూడదు. మనము కంటికి కనబడ
ఉంటే పాపము కృష్ణుడు నన్ను మరచిపోవడం సులభమవుతుంది.

సుంద - నేనెట్లారాను? బదిలీ తెప్పించుకుని రావాలి.

శశి - మరి ఇప్పుడు కృష్ణుడు వచ్చి పిలవడా? ఏమి చెయ్యను?

సుంద - పోనీ నాలుగురోజులక్కడ ఉండు.

శశి - ఎట్లా ఉండను? నేనతని ఇంట్లో ఉండడం మీకిష్టమేనా?

సుంద - మరేమీ చెయ్యను?

శశి - నేనైనా వెళ్ళిపోతాను. బదిలీ అయిన తరువాత మీరు రండి



సుంద - ఎక్కడికి వెడతావు ?

శశి - ఎక్కడికైనాను.

సుంద - తరవాత కృష్ణుడు వచ్చి నీవెక్కడని నన్నడిగితే?

శశి - అవును. అదొక యిబ్బంది.

సుంద - అదికాదు. వెళ్ళేటట్లయితే మనమిద్దరము వెళ్ళాలి. శలవుకి రాశేశి నేనుకూడా ఈవాళే వస్తాను. మధ్యాహ్నము రైలులో వెడదాము. సామానంతా పంపమని వెనకనుంచి వ్రాస్తాను. ఎవరికీ తెలియకూడదు వెడుతున్నామని.

శశి - సరే. మరి సాయంత్రముదాకా? ఇప్పుడే వాళ్ళు వొస్తారే?

సుంద - సాయంత్రము వస్తున్నామని ఇప్పుడే కృష్ణుడికి చీటి వ్రాస్తాను.

మధ్యాహ్నము ఒంటిగంటైనది. సుందరరావు బయటకు పోయి యుండెను. అవసరమైన వస్తువు లొకపెట్టెలో సర్ది శశిరేఖ గదిలో కాగితము కలము ముందుంచుకొని ఆలోచించుచు కూర్చుండెను.

వాలిన సూర్యుడామె శిరోజములపై గవాక్షములోనుండి దాని కల్లుకొనిన సూర్యకాంతము తీగె ఆకులలో నుండి మెరయుచుండెను. ఆ విశాల నేత్రముల నుండి కన్నీరు జలజల రాలుచుండెను. వెక్కి వెక్కి వచ్చు దుఃఖముతో వక్షము కదలుచుండెను. వ్రాత ఒక్క అక్షరమైనను సాగలేదు. వ్రాయబోవునప్పటికి పొరలి పొరలి దుఃఖమువచ్చి కాగితము, చేతులు తడియుచుండెను. తాను చేయబోవుపని న్యాయమా? తన కొరకు జీవితమును పాడుచేసుకొని, చదువు మధ్యలో మాని, కొడుకెంతో సంపాదించునని గంపెడాశ పెట్టుకొనియుండు తల్లిదండ్రుల నిరాశపరచి, దరిద్రము ననుభవించుచు, తన సౌఖ్యమే అతని సౌఖ్యమని ఎంచుకొని, తోడునీడగ పనిచేయుచున్నను, తన వెంట శశీ, శశీ యని తిరుగుచు, ఒక్క నిమిషము కనుబడపోయిన ఎక్కడెక్కడ యని తల్లడిల్లుచు, తనలోనే జీవితము నానందముగల కృష్ణుని వదలుట మంచిదా? ఈ వార్త విన్న తరువాత అతని కానందముండునా? శాంతియుండునా? పిడుగుపడినట్లాతని ప్రాణము నలిగి పోదా? ఒక్కసారి అట్టి సుగుణ నిధిని స్వార్థత్యాగిని, నిష్కపటవర్తనుని, ప్రేమావిధిని, అమాయకుని, ఇట్లు వంచించి, నరకమున త్రోసిపోవుటకన్న క్రూరత్వము గలదా? స్నేహితులను, బంధువులను, సంఘముకు వదలిన ఇంకేమి కలదు అతనికి తనుగాక? తన ఆనందముచే, పాదములచే, స్నేహముచే, మంత్రింపబడిన ఆ

నీళ్ళు, చెట్లు, పచ్చికబయళ్ళు, కాలువలు అతడు చూచుచు, ఆ ప్రేమా దీప జ్ఞాపకమున, ఎట్లు బ్రతుకగలడు? అతని నంతగా ప్రేమించునటుల క తానే అతనిని మోసగించిన అతని హృదయము పగులదా? మనుష్యులయ విశ్వాసము నశింపదా? విశ్వాసము, ప్రేమ, సంతోషము పోయి, అయ్యో అధమ జీవితమున కూలునోకదా? అటుపై అతను బ్రతికి ఎందుకు బ్ర ఎందుకు? కాని ఏమి చేయవలెను? ఎట్లు తిరిగి అతని దగ్గరకు పోయి యు గలదు? తనకు శాంతి యుండునా? ఇంక ఆ యింటి పనులు చేయుచు తృప్తి యుండగలదా? హృదయాకాశమందు క్రొత్త ఆదర్శములు క్రొత్త ప్రేమావేశ యుదయించినవి. ఇంక తన విధి వెనుక బోయి తీరవలయును. పూర్వజన్మ వదలవలయును. నిర్మలము, అమాయకము, వెన్నెలవలె స్వచ్ఛమునగు కృ ప్రేమను వదలి, గూఢము, తీక్షణమునగు యీ సుందరరావు ప్రేమను పోవలసినదే. ఎప్పటికిని కృష్ణుడు తనవాడు. అతనిని నమ్మిన ఇంక సం మక్కరలేదు. భయము లేదు. తనకు బాధ కలుగచేయుటకన్న ప్రాణముల వదలును. కాని సుందరరావును జూచిన సర్పమును చూసిన రీతిని భయ ఎంత మంచిగా నున్నను ఇపుడు ఏ నిమిషమున ఎదురు తిరిగి కాటు వే నమ్ముటకు వీలులేదు. కాని ఆ భయమే, ఆ మోహమే నామె నాకర్షించుచుం కండ్లను మంత్రించి వేయుచుండెను. ఇంక తనకు శాంతిలేదు. ఆ మహా మోహమున మ్రుగ్గిపోవలసినదే. ఆ మహామంత్రమును ఆ ఐంద్రజాలమున ప్రేమ నాహుతి చేయవలసినదే. తాను ప్రేమతో నాటలాడు దినములు దాటి నవి. ప్రేమను ప్రౌఢవలె నాలింగనము చేసికొనవలసిన సమయము వచ్చి ఇంక పూర్వపు జీవనము పనికిరాదు. సంశయరహితముగ జీవన వార్ధిని కొట్టి పోవుటకు సిద్ధముగ నుండవలసినదే.

ఆ పడవ షికారు వెళ్ళిన సాయంత్రము ముందు తనకును కృష్ణుని శాశ్వతమగు ప్రేమబంధన మేర్పడినదనియు, కృష్ణుడు తనయందవతార ననియును ఇద్దరును ఒక్కరినే ఒకరికొరకొకరు ప్రేమించెదరనియును, అనుకొనెను. అట్టి బంధన మేర్పడిన, అది శాశ్వతమై యుండెడిది. కాని యిప్పు కలదు? ఆ సాయంత్రము నీళ్ళలో పడుటతోడనే ఆశలన్నియు అడుగంటి స్వప్నములు మాయమ య్యెను. ఆనాటిపాటుతో కృష్ణుడు, తన ప్రియురా సంతానమునుగూడ గోల్పోయెను.



దుఃఖమంతయు కృష్ణుని కొఱకే. అతడు తనకు వద్దనిన, తనపై ప్రేమలేదనిన ఇంకొక బాలికను వలచిన, తానెంత సంతోషముగా అతనిని వదలియుండును. అయినను తాను వెళ్ళిన తరువాత సంతోషమున నుండునేమోలే, అతని స్వల్ప సౌఖ్యము కొరకు తన జీవితము నంతను ఎట్లు పాడుచేసికొనగలదు? ఇక తప్పదు, విధి తనను రమ్మని పిలుచుచుండెను. తాను పోక తప్పదు. కృష్ణునికి శలవు ! అయ్యో ! అతనినింక చూచుటపడదు కాబోలు. తన కృతఘ్నతను విని, అతని ముద్దు ముఖ మెట్లగునోకదా! ఆ ముద్దు కన్నులనుండి ఎంత నీరు కారునోకదా? ఎంత విలపించునో, పొరలి పొరలి దుఃఖము వచ్చెను.

✦ ✦ ✦

కృష్ణుడు సాయంత్రము నాలుగు గంటలకు తన కుటీరము వాకిట నిటునటు అశాంతితో తిరుగుచుండెను. మాటిమాటికి ఆస్పత్రివైపు శశిరేఖ వచ్చుచున్నదేమోనని చూచుచుండెను. ఇన్ని దినములెన్నడు నాతడు శశిని విడిచియుండలేదు. ఒక్కసారి ఆమెను వెంటనే చూడవలెననెడి తృష్ణ నాతని నావరించెను. ఇంటివద్ద పరిచర్యచేయుట కాతడుగాక ఇంకెవ్వరును లేరు. ఎంతో ఆశతో, ఏమియును తోచక, ఇంకను రాలేదేమని యాశ్చర్యపడుచుండెను. ఇంతలో ఆస్పత్రి నౌకరాతనికొక యుత్తరము తెచ్చియిచ్చెను. ఇంక ఏమి యాటంకములు వచ్చినవో కదాయని, తలవరపడు హృదయముతో, దానిని తెరచి చదివెను.

నా ముద్దుల కృష్ణా,

శశిరేఖయనుదాని నెన్నడును కలిసికొనలేదనుకొనుము. నిన్నన్ని కష్టముల నష్టములందించిన శని యీనాటితో తొలగిపోయినదని సంతోషించుట నేర్చుకొనుము. నీమీద ప్రేమ నాకెన్నడును మరపునకు రాదు. నీ నుండి యెడబాటు నాకతికష్టముగా నున్నది. నన్ను, లాకులను, చెట్లను, వనమును పూర్ణముగ మరచిపొమ్ము. నీవంటి సుచారిత్రునకు నా వంటిదాని సంపర్కము తగదు. నా హృదయం బ్రద్దలగుచున్నది. నీవెంత దుఃఖించెదవో నేనెరుంగుదును. కాని ఏమి చేయగలను? నేను మరణించితి ననుకొనుము. కృష్ణా, శలవు, నీ పటమెల్లప్పుడు నా మలిన హృదయమున శాశ్వతముగ నుండును. నన్ను మరచుటకు ప్రయత్నింపుము. నీ ముద్దు ముఖమును, ముద్దు మాటలను, యీ జన్మమున మరవను.

నిన్న రాత్రి నేను...

కృష్ణుడింతవరకే వెలవెలబారు ముఖముతో చదివెను. నోటమాట కన్నీరు బొట్టులేదు. నరికిన వృక్షమువలె, మరణించిన వానివలె క్రిందబడిపో

# 8

నెలదినములు సుందరరావు శలవు పుచ్చుకొనెను. ఇరువురు పట్టణముల విహరించిరి. మళయాళమున, బొంబాయి రాజధాని య తిరిగిరి. సుందర రావుకు బళ్ళారిజిల్లాలో జిరగణహల్లీ యందు చేరవలసివచ్చెను. సుందరరావు నుండి మహా ప్రేమను, గాఢమగు య ననుభవించి శశిరేఖ సంతస్టురాలయ్యెను. సుందరరావును శశిరేఖా సౌంద తనివితీరా యనుభవించెను. కాని సుందర రావుది కృష్ణుని దానివలె స నిర్మలముననగు మనసు కాదు. ఎల్లప్పుడు నెడతెగని అశాంతాగ్నిలో తరువాత సౌఖ్యమును గోరుచుండును. కృష్ణుడు శశిరేఖ కెట్లు ఆ కలిగింతునాయని యాలోచించుటచే యామె యానందించినపు డెల్ల సంతోషించుచుండెను. సుందరరావు శశిరేఖ నుండి తానెంత యానం పొందుదునాయని ప్రయత్నించుటచే ఆ యానందమును నాల్గవ కోల్పోయెను. ఒరుని సొత్తయినంత కాలము దానిని సంపాదించుటే అ తను జయము పొందిన కొలదిని మహదానందమును పొందెను. స్వర్గము లేదనుకొనెను. కాని యది తనది యగుటతోడనే దానిలో నుం పోయినది. స్త్రీ తన సమస్తమును తన హస్తములోనుంచిన కృతజ్ఞత చూపు మిక్కిలి యరుదు. స్త్రీ పురుషుని తన శక్తిచే యాజ్ఞయందుంచుకొనవలె పురుషుడామెను నీచముగ లోబరుచుకొనును అందువల్లననే స్త్రీ పురుష విషయమునను సమానులైనగాని ప్రేమయుండదు. ఒకరిపై నొకరాధా యా ప్రేమ నశించినదే. శశిరేఖ యింకొకరి యధీనమందుండి, తనది కా సుందరరావవామెకు బాని సయై యుండెను. ఆమె కృష్ణుని దగ్గరున్న స్వతంత్రముగ జీవించుచున్నను సుందరరావామెకు యింకను బానిసయై వాడే కాని వేరు దిక్కులేక, అతనిపై తన జీవనమునకు తనపైనాధారపడు శశిరేఖ అతనికి మహాభారమయ్యెను. ఆమె యంద మెంత ఎక్కువగ



ఎంత కొత్తగ కాన్పించుచున్నను, ఏమి చేయుటకైన తనదేయని నిశ్చయమగుట తోడనే, ఎందునకును కొరగానిదయ్యెను. సౌందర్యము నితరుల యందు చూచి యానందింపగల స్వభావములు యరుదు. సుందరరావువంటి వారు సౌందర్యమును చూచుటతోడనే తా మనుభవింపనిది శాంతినొందరు. శశిరేఖ సౌందర్యమును చూచి కృష్ణుడు పూజించెను. తానా సౌందర్యమున కేమి యివ్వగలనా యని యోచించెను. కాని సుందరరావు దాని నెప్పుడనుభవింతునాయని తొందరపడెను. సౌందర్యము ననుభవించుట స్వార్థపరుల కెట్లు సాధ్యమగును? భౌతిక శరీరముచే, ఇంద్రియములచే, శరీరము ననుభవింపగలుగుదురు. గాని ఆ నిర్మలమును, భౌతికాతీతమునగు సౌందర్యము నెవ్వడు తనది మాత్రముగ చేసికొనగలడు? ఎంతయో ప్రయత్నించియు విఫలుడై తన కామాగ్నిచేతనే దహింపబడి, యామె యాత్మనర్థము చేసికొనలేక అంధకారమున నిరాశచెంది అతడు క్రూరత్వమును వహించెను.

శశిరేఖకు మాత్రము ఒకసారి పొడమిన ప్రేమ సుందరరావుపై పోలేదు. అతని ముఖమును, తెలివిని, శక్తిని చూచినపుడెల్ల ఆమె కాశ్చర్యము. అతని ధనము తనకు సమస్త సౌఖ్యముల నిచ్చుచుండ, ఆమెకు మిగుల గర్వము. కాని సుందరరావామె యెడల చూపు అనాదరము హృదయమును వేధన పరచుచుండెను. అయినను ఆమె కతనిపై కోపమే మాత్రమును లేదు. అతనిని నమ్మి వచ్చితినేయను చింతయునులేదు. దినదినమును ఏమియును క్రొత్తలేక, జీవనరహితముగ నడుచు కాలముకన్న అతని క్రూరత్వముతో కూడుకొన్నను, యీ భయంకర జీవనమే ఆమె కుత్తమముగ తోచెను.

అనేకమంది నౌకర్లున్నను శశిరేఖయే యింటిపని నంతను స్వయముగ చూచి, సుందరరావున కెక్కడును విసుగు కలగచేయకుండ ప్రయత్నించుచుండెను. కాని అతనికి తృప్తిలేదు. ఒకనాటి సాయంకాల మతడా స్నత్రినుండి యింటికి వచ్చెను.

శశి - ఈవాళ హంపికి వెళ్ళడం వుందా?

సుంద - తెలీదు.

శశి - పోనీండి. ఇంకోసారి వెళ్ళొచ్చును. నాకీవేళ వంట్లో సరిగ్గాలేదు.

సుంద - ఎప్పుడూ ఏదో వకదాన్తో మూల్గుతో వుంటావు. నీ వొళ్ళు బాగు లేదని నేను నా ప్రయాణం మానుకుంటాను గావును. తెల్లారకట్టే వెళ్ళాలి.

శశి - ఎందుకంత కోపంగా వుంటారు?

ఎంతో భద్రముగా బట్టలు వేసుకొని తల దువ్వుకొని ఎవడైన చూచిన మోహించునంత యందముగా కనుపడుచూ, ఆమె యతని కొరకు వేచియు యుండెను.

సుంద - పాడుదేశం వచ్చాం. ఎంత హాయిగా వుండేది గోవిందపురము ఈ మూర్ఖము, పెంకెతనము, పిరికితనము ఎక్కడా చూడము. ఈ జన మనుష్యులో, పశువులో తెలీదు. ఉండడానికి ఇల్లన్నా మంచిది లేదు.

శశి - పోనీండి. ఎట్లాగో ఓలాగు ఉన్నాంగా.

సుంద - ఉన్నాము. వాళ్ళకేమో? ఆమె మీ భార్యేనా అని అడుగుతారు. కా అనుమానంతోచి మన్నీ యింట్లోంచి పొమ్మన్నారు. ఆ దేశంలో గవర్నమెం యిళ్ళుండేవి. ఇక్కడ అవన్నీ లేవు.

శశి - పోనీండి. వెళ్ళిపోదాం.

సుంద- నీకేం చెపుతావు. ఎక్కడికి వెడదాం? వాళ్ళు అసలు అనుమా ఎందుకు పడాలి? ఏదో నువ్వే చెప్పి వుంటావు. లేకపోతే నీ టక్కు వేషాలూ చూసి, వాళ్ళు అనుమానపడి వుంటారు.

శశి - నన్నెవరు పలకరిస్తున్నారు, నేను చెప్పడానికి ?

సుంద - లేకపోతే ఆ పశువు కృష్ణుడు రాసివుంటాడు వీళ్ళకి ఓర్వలేక

శశి - ఆయన అల్లాంటి వాడుకాదు.

సుంద - అతన్ని నా ముఖం ముందు వెనక వేసుకు రావడం బహు బా వుంది. అతని దగ్గర వుండకపోయినావూ, నన్నిట్లా యేడిపించకపోతే ?

శశిరేఖ సుందరరావు దగ్గరకు వచ్చి మెడచుట్టును చెయ్యివేసి.

శశి - ఎవరో విసికిస్తారు మిమ్మల్ని అందుకనే ఇట్లా అవుతారు మీ అంది.

సుంద - ఈ మునిసిపలు సంఘమంత బుద్ధిహీనుల్ని ఎక్కడా చూ లేదు నేను. నేను వాడి నౌకర్ని కాబోలును. వంగి సలాములు చెయ్యలేదని వైర్యం



కోపం. అందరి కాళ్ళు పట్టుకొని నాలుగు వోట్లు తెచ్చుకొని నాలుగు రోజులు పట్టపగలు వెలగపెట్టేవాడి క్కూడా అంత పొగరే ! ఇంక తక్కినవాళ్ళు చెప్పనే అక్కర్లేదు. వాళ్ళింటో ఎవరికన్నా జబ్బుగా వుంటే నేనేమో కనుక్కొంటూ వాళ్ళచుట్టూ తిరగాలిట. ఒకడు వచ్చి ఏం ఏం మందులున్నాయో చూపించు ఆస్పత్రిలో అన్నాడు. తెలిసినట్టే వాడికి! అవతలికి నడవమన్నాను. అందుకని వాడికి నా మీద కోపం.

శశి - బాగానే వుంది! మంచివాడే దొరికాడు! పోనిద్దురూ! ఈ పాడు పని మానేద్దురూ, మన ప్రేమ ఉందిగా ఇంకేం కావాలి మనకి!

సుంద - ప్రేమ నీకు రేపు భోజనం పెడుతుంది! పిచ్చి మాటలు రెండు నేర్చింది ఎక్కడో.

శశి - నా మాట వినరూ? ఇట్లా చూడండి. ఈ చీర బాగుండలేదూ? ఆవాళ సాయంత్రం...

సుంద - నూరుమందిని చూశాను, ఇంతకంటే బాగా కట్టుకొన్న వాళ్ళని. నీకు చాతాకాదు వాతాకాదు.

శశిరేఖ నుండి ఆనందం అనుభవించడం సుందరరావునకు చేతకాదు. ఆమె ఆత్మ మనసు అతని కర్థముకావు. అందుచేత ఆమె కష్టపడడం చూడడంలో ఆనందము సంపాదింప మొదలుపెట్టెను.

తెల్లవారి హంపికి వెళ్ళిరి. శశిరేఖ సౌందర్యమును పూజించు మహాభక్తురాలు. సృష్టియందుగాని మనుజుల యందుగాని సౌందర్య మామెకు వెర్రినెత్తించును. హంపి యందావచ్చిన బయళ్ళను, రాళ్ళగుట్టలను చూచుటతోడనే ఆమె కతి యానందము కలిగెను. సుందరరావామెను వెక్కిరించుచున్నను, ఆమె సంతోష మణగక పైకి ప్రవహించుచుండెను. ఆమె కానందము కలిగిన కొలదిని అతనికి కోపమెక్కువగును.

శశి - ఇక్కడ ఈ గాలేదో సంతోషము కలిగిస్తోంది. ఈ స్థలమునందే ఏదో మహాత్మ్యమున్నది. చూడండి ఈ చెక్కడము. ఏ కొండనో ఇక్కడ చెక్కివేశారు. పురము మధ్య ఇట్లాంటివివుంటే ఎంత ఆనందంగా వుండేదో ? ఆహా !

సుంద - ఇవన్నీ నీవు కవివలె వర్ణిస్తున్నా ననుకొంటావు గావును. నేను తప్పు ఇంకెవరూలేరు వినడానికి !

ఒక్కసారాతని మాట కెదురు చెప్పదు శశిరేఖ. ఎంత వెక్కిరించు
విననట్లే యూరకుండును.

శశి - అబ్బా ఎంత బాగుందండీ ఈ గుడి. ఇట్లా దగ్గిరగా కూ
ఎవరూ లేరుగా? ఎంత మంచి గాలి. రారూ?

ఆమెయే అతని దగ్గిరగా పోయి కూర్చుండెను. అతని భుజముపై
వేసెను.

సుంద - అసలే చమటగా ఉన్నది. ఉండు. సరసాలు చాల్లే.

శశి - ఈ రాళ్ళను పైకి ఎట్లా ఎత్తారో కదా! ఎంత బాగా చెక్కా
ఎంత గర్వంగా వుండేదో ఈ పనివాళ్ళకి! ఒకళ్ళకంటే ఒకళ్ళుమించి పని చెయ
పోటీలు వేసుకునేవాళ్ళు కాబోలు? అంతా రాజుల అనుగ్రహము. ఒక్క మం
ఒక్కగుడి తయారయిందంటే ఎంత సంతోషంతో ఎంత ఉత్సవాలు చేసి
కదా?

సుంద - ఏదో ఒకటి చేసేవాళ్ళు. ఎందుకట్లా వాగుతావు ?

శశి - ఇవి చూస్తే ఆనందం కలగడం లేదూ? ఆనందం కాదు.
వస్తోంది. అయ్యో ! అన్నీ పాడుపడ్డాయికదా? నిజంగా మహారాజ్యమై ఉ
ఇది. ఇక్కడంతా సైన్యాలుండేవి కాబోలు! వాళ్ళు పనిలేక హాయిగా పడుకునే
ఈ మందిరం చూడండి. ఆడవాళ్ళు దీనిమీద వుండేవాళ్ళు. పాపం, యు
గెలిచివస్తే భర్తల్ని సన్మానించేవాళ్ళు. ఆఖరుసారి తురకలు నాశనం చేసేట
తుట్టెలో యీగవలె ఒక్క మొగవాడు సంరక్షించేవాడు లేక ఎంత అదలిపోయా
కదా! ఈ చెరువులు చూడండి. ఎన్ని ఉద్యానవనాలు ఉండేవో !

సుంద - ఇంకా ఎక్కువ వాగినావంటే నేను ఒంటరిగా వెడతాను.

శశిరేఖ పొరలివచ్చు తలపులను లోపల కుక్కుకొనెను.

సాయంత్రము తుంగభద్ర వడ్డున మెట్లమీద కూర్చుండిరి. నది ప
నుండెను. నదిమధ్య ఎనుములవలె స్థిరముగనుండు పర్వత శిలల తాకి యు
నవ్వుచు ప్రవాహము పొంగి పొరలుచుండెను.

శశి - చూడండి. పూర్వము ఇక్కడ ఎంత శోభగా వుండి వుండాలో!
వంతెన వుండేదిట. ఈ గట్టున గుళ్ళూ ఇళ్ళూ ఉండేటప్పుడు స్త్రీలు పూజార్థ



పుచ్చుకొని గుళ్ళకి వెడుతూవుంటే, పిల్లలు ఆడుకుంటూ వుంటే వడ్డునంతా మనకుమల్లే అనేకమంది చల్లగాలికి కూర్చునివుంటే, చాతయినవాళ్ళు తోలు పడవల్లో యీ ప్రవాహంలో ఆడుతూవుంటే, పూరంతా విజయధ్వజాల్తో నిండివుంటే ఎంత బాగుండేది! అప్పుడు మనమూ, మన రాజ్యమూ, అని గర్వపడుతూవుంటే ఎంత గొప్పగా వుండేది! మన యుద్ధాలు, మన దండయాత్రలు, మన యుద్ధ సన్నద్ధాలు, ఎంత తమాషాగా తఉండేది!

సుంద - మళ్ళీ మొదలుపెట్టావూ ? పోదాం పద యింటికి. ఇంత దూరం నీ మాటవిని వచ్చాను బుద్ధిలేక.

శశి - ఇంకొంచెం సేపుండరూ ? మళ్ళీ ఎప్పుడొస్తామో !

సుంద - వస్తావా రావా, నేనొక్కణ్ణే వెళ్ళనా ?

ఇద్దరును కమలాపురము బంగళాకు వెళ్ళిరి. భోజనమైన తరువాత సుందరరావు బయట కూర్చున్నాడు. శశిరేఖ గదిలో అద్దము ముందు నిల్చుని యున్నది. స్నానము చేసి తలలో పువ్వులు పెట్టుకొని సౌందర్య దేవతవలె కనబడుచున్నది. ఆలోచించునట్లే యుండి, చివరకు సుందరరావు దగ్గరకు పోయి కూర్చుండెను.

సుంద - ఎవరూ లేరుగా చూడ్డానికి? ఎందుకా షోకు?

శశి - ఎవరూ లేరూ?

సుంద - తెలివికి సంతోషించారు.

శశి - నిద్రరావటంలేదూ?

సుంద - వొస్తోంది.

శశి - అయితే రండి.

సుంద - పరుపు బయట పడెయ్యి. వసారాలో పడుకుంటాను.

శశి - లోపల పడుకోరాదూ ?

సుంద - నీ కెందుకాసంగతి ?

శశి - పడుకోరూ? నే నడుగుతున్నా ననన్నా!

సుంద - పో! నా కసహ్యం మేస్తోంది. నీ మాటలూ నీ వేషాలూ!

శశిరేఖ మెల్లగా లేచి లోపలికి వెళ్ళెను. దినము తరవాత తటస్థించుచుండెను. శశిరేఖకు ప్రేమయే ఆహారము. అది లేకుండిన శాంతిలేదు. తన వలన ఏమి నేరమో ఆమెకు తెలియదు. సర్వ విధముల సంతోష పెట్టజూచెను. అతడు తనతో ప్రేమగా మాట్లాడకూఢదా? తన్నొకసారి యాదరింపరాదా? అతనికి తన ప్రాణమునుగూడ సంసిద్ధమై యుండెను. కాని తనపై దయతో నొక్క చూపైన చూడడే! దిన మొక మరణముగా నయ్యెను. అతనిపై తనకెంత ప్రేమ! చెయ్యివేసి మంచి మాటలాడినా చాలదా? అదియే కరువయ్యెనా? కదా అతనిని కోరినది? కాని యేమియును తెలియని చంటి బిడ్డవలె తప్ప శశిరేఖ కేమియును తెలియదు. అతడు గాక జీవితమున ప్రేమలేక ఆమెకు జీవితము భారముగ తోచెను. శాంతి లేదు. ఆపరాని దుఃఖముతో మంచముపై బోర్లపడి వెక్కి వెక్కి యేడ్చెను. రాత్రులు గడుపుట ఆమెకు మామూలే, ఏమియు నెరుగక నెరుంగుటకు సుందరరావు నిద్రించుచుండ, ఆమె మాత్రము రాత్రంతయు నిద్రలేక చప్పుడైన నాతనికి కష్టము కలుగునేమోనని, లోపలనే ఏడుపు జాగరము చేయుట ప్రతి రాత్రియు జరుగుచుండెను. తెల్లవారి సిద్ధముగా నుంచక ప్రొద్దెక్కి లేచిన చీవాట్లు తప్పకపోయెను.

ఒక గంట అయిన తరువాత మెల్లగ తలుపు తెరచుకొని పరుపు బయటకు తీసుకొని పోవుటకు వచ్చెను. శశిరేఖ త్వరగా తుడుచుకొని చిరునవ్వు నవ్వుటకు ప్రయత్నము చేయుచు కూర్చుండెను.

సుంద - ఏం పన్లేదూ? ఏడవడం తప్పు? ఆ కృష్ణుని తలుచుకొని నన్ను చూచి ఏమీలేనిదానివలె దొంగవేషం వేసుక్కూచుంటావా?

శశి - మీకు తెలీదూ, నేను ఎవరి కోసం ఏడుస్తానో?

సుంద - జ్ఞాపకం వచ్చింది. నిన్న తమరికొక వుత్తరం వచ్చింది. విటుడి దగ్గిరనుంచి, చదువుకోండి.

అని కోటు జేబులో వెతకి ఒక చించిన కవరును ఆమెపై దానిపై చిరునామా ఆమె చూచెను. కృష్ణుని వద్దనుండి. గుండెలు ఎట్లున్నాడో? అతనిపై ప్రేమ అణగియున్నను, జాలి మాత్రము



నుండెను. అతని పేరు విన్నప్పుడెల్లను కన్నీళ్ళు కారును. అతడు తన కృతఘ్నుతకు చివాట్లు పెట్టెను కాబోలు. లేక ప్రేమ తెల్పుచూ వ్రాసెను కాబోలు ! దానిని సుందరరావేల చదువవలెను? ఇంక నావేశము నాపుకొనలేకపోయెను.

శశి - నా వుత్తరమెందుకు చదివారు?

సుంద - (నవ్వి) ఈ పతివ్రతల వుత్తరాలు చదవకూడదు గావును? వెళ్ళే యేత్తేస్తున్నావేంటి? శీఘ్రముగా దయచెయ్యి. యోగ్యతాపత్రం కూడా యిచ్చి పంపిస్తాను.

శశి - నాకు వచ్చిన వుత్తరం చదవడానికి మీకు సిగ్గెయ్యలేదూ? ఇంకా మాట్లాడతారు !

సుంద - ఏం, మాటలు మీరుతున్నాయి. నోరుముయ్యి? ఎందుకూ పనికిరాని వాడు ఎవడో యింత మహావుత్తరాన్ని....

శశి - అట్టే మాట్లాడకండి. అతని కాలిగోరికి సరికారు మీరు ప్రవర్తనలో.

సుందరరావు కన్ను లెర్రచేసి ఆమెను కొట్టబోయెను. ఆమె చేతులు కట్టుకొని నిల్చుని చిన్న నవ్వు నవ్వుచు -

"కొట్టండి అదొక్కటే తక్కువగా వుంది. కొట్టడమే."

ఆమె చూపులలో ధైర్యముచూచి అతను మాట్లాడక వెనుకకు తగ్గి వెళ్ళి పోయెను. ఆమె ఉత్తరము చదువుకొనెను.

శశీ,

నిన్ను మరచిపోజాలను. ఎటుచూచినా నీ జ్ఞాపకమే. ప్రయత్నించుచున్నాను గాని మరుచుటకు దుర్భరమైన వేదనను పొందుచున్నాను. నీపై నాకు కోపముండదు. నీవు మాత్రమేమి చెయ్యగలవు? నీ దగ్గిరకు నేను రావడానికి వీలులేకుండా చేసినావు. ఇంక యావజ్జన్మమున దర్శనమైనలేదు కదా మనకు? నీవైనను నన్ను మరచిపోయి సౌఖ్యముగా నున్నావని తలచెదను. నాకు కలిగించిన బాధవంటి బాధను నీవెన్నడును పొందకుండ యీశ్వరుని ప్రార్థించుచున్నాను.

నిన్ను మరవలేక దుఃఖించు

కృష్ణుడు.

శశిరేఖ ఉత్తరమును హృదయమున నద్దుకొని దుఃఖించెను. అయ్యో! ఎ బాధపడుచున్నాడో అను తలపు వేదనను కలిగించుచుండెను. ఒక్క కునుకు రేయి యంతయును అట్లే నిశ్చేష్టితయై నేలపై పడియున్నది. తెల్లవారకట్ట చల్లగాలి కొంచెము నిద్రఫట్టెను. ఇంతలో సుందరరావు కాలితో ఆమెను త్రోసి

"లే, లే, బళ్ళు వచ్చాయి" అన్నాడు.

శశి - అబ్బా, కొంచెముండరూ, తల బద్దలవుతోంది. నిద్దర్లేదు. క మండిపోతున్నాయి. కొంచెముందురూ ?

సుంద - నీవెవణ్ణో తలుచుకుంటూ, రాత్రంతా జాగరణచేస్తే రాణీ గా కోసం నేనాగి వుండాలి కాబోలు ?

శశి - నా మీద అంతమాత్రం దయలేదూ. నాకు మీమీద తప్ప ఎ మీద ప్రేమ? ఇట్లా కూచోండి ఒక్కసారి.

సుంద - పో, పో, నీ దొంగవేషాలన్ని? లే, ముందు.

## 9

ఒక్క సంవత్సరము గడచెను. శశిరేఖ సుందరరావు భార్య కాదని యూరివా గ్రహించి వారినొక యింటినుండి యింకొక యింటికి వెళ్ళకొట్టిరి. నౌకర్లు దొరక సహాయమెవరును లేరు. మాటలాడుటకును మనుష్యులైనను లేరు. ఈ కష్టముల సుందరరావు క్రూరత్వ మెక్కువయ్యెను. సంభవించుచున్న యీ కష్టములన్నిటి శశిరేఖ వలననే కలుగుచున్నవని తుదకు అతడు తలచెను. కాని ఆమెను హ మాతడు వదలలేదు. ఆమె సౌందర్యమును చూచిన అతని కతితృష్ణ. ఆమె మన స్వభావమును అర్థము చేసికొనలేక అతడు ఆమెను బాధించుటలో తన అసహా మును చూపుకొనుచుండెను.

తుదకు శశిరేఖకు కూడా ప్రేమ నశింప నారంభించెను. ఇప్పుడా తన నేమన్నను లక్ష్యములేదు. అతడు తనతో దినములకు దినములు మాట్లాడక గడిపిన భయములేదు. కాని ఆమెకు జీవన మేమాత్రమును తృప్తికరము లేకపోయెను. శశిరేఖకు సౌందర్య మాహారము. ప్రేమ ప్రాణము. ప్రేమలే ఆమెకు సమస్తమును శూన్యముగను, అర్థవిహీనముగను కాన్పించును. ప్రే కొరకామె యేమైన సమర్పించును.





ఆమె ప్రేమనంత ప్రేమించుటచే కళారహితమగు జీవితమును గడపుట దుస్సహముగ తలచెను. అతనికి తనపై ప్రేమ లేనపుడు అతని యింట తానెందు కుండవలెను? ప్రేమ దివ్యమగు ప్రేమ, ఆత్మానందకరమగు ప్రేమ వదలి యేల నొక్కదినమైన జీవింపవలెను? అను తలపులు ఆమెను బాధింపజొచ్చెను. ఇతని నుండి వెళ్ళిపోవలెను. కాని యెట్లు? యెక్కడికి? ఎట్లు బతుకుట? స్వతంత్రముగా జీవించుటకు ఆధారము లేదు కదా ? సంఘము తనకే మాత్రమును సహాయము చేయదు కదా?

శశిరేఖ తిరిగి తిరిగి తానేమి చేయగలనా యని ఆలోచించెను. ఏ త్రోవయును కనబడదు. తన నగలమ్మి యెట్లయినను స్వతంత్రముగ జీవింపవలెనని నిశ్చయించు కొనెను. గోవిందపురమునకు పోయిన కృష్ణుని దూరముననుండి చూచుచుండ వచ్చును. అతనికి తన సామీప్యము దుఃఖము కలిగించిన ఇంక నెక్కడికైన పోవచ్చును. అదీగాక తన పుట్టినింటినుండి తనకు రావలసిన యాస్తి కలదు. అది తన స్వతంత్ర జీవనమునకు తోడ్పడవచ్చును. సుందరరావును వదలుట ఆమెకు సంతాప మేమాత్రమును కలిగించుటలేదు. ముందటి తన జీవితమును తలచుకొన్నప్పుడెల్ల ఆమె కానందము కల్గుచుండెను. ఎవరో తనను ప్రేమింతు రనియును, తానును ప్రేమింతుననియు, నామె అనేకసార్లాలోచించుకొనుచుండును. ఇంకను అనేక దేశముల సుందర ప్రదేశముల, ప్రేమతోగూడి సంచారము చేయుచుందుననుకొనుచుండును.

సుందరరావు పొరుగూరికి, ఒక రోగిని చూచుటకు వెళ్ళియుండెను. మరునాడు దయము వరకును రాడు. సాయంత్రమారు గంటలకు రైలు. దానిమీద సుందరరావును వదలి వెళ్ళిపోవుటకు నిశ్చయించుకొని, శశిరేఖ తన వస్తువులను పెట్టెలో నుంచుకొని సుందరరావున కుత్తరము వ్రాసి, సేవకుని చేతికిచ్చి, తొందర ప్రయాణము తగులుటచే వెళ్ళుచున్నానని చెప్పెను. బండిలో పెట్టె నుంచుకొని రైలునకు బయలుదేరెను. ఆరుగంటలు కావచ్చినది.

సుందరరావింటివద్ద కాంభొట్లను నతడు కాపురముండును. అతనికి కోర్టులో చిన్న యుద్యోగము. సుందరరావు వద్దకు మందుకు వచ్చినప్పుడు శశిరేఖను చాలసార్లు చూచియుండును. గాని, ఆమెతో మాట్లాడి యెరుగడు. మొదట చూచినప్పటి నుండియు, శశిరేఖ కతనిపై యసహ్యము. సుందరరావుతో నతనింటికి

రానివ్వవద్దని కూడ చెప్పి యుండెను. ఇప్పుడు కాంభొట్లు తన బండి
రోజుచు పరుగెత్తుకొని వచ్చుచుండు టను చూచెను. అతడు దగ్గరక

కాం - ఎక్కడకో వెడుతున్నారే?

శశి - అవును.

కాం - రైలుకా?

శశి - ఊ.

కాం - పనిమీదనా1?

శశిరేఖ తలయూగించెను. తనతో ననవసరముగ మాట్లాడుచున్న
కోపమును, అతని ముఖమును జూచిన నసహ్యము నెక్కువగుచుండెను.
బండి వెనకనే నడుచుచుండెను.

కాం - ఏం, పంతులుగారు లేనప్పుడెడుతున్నారేం?

శశి - పని తొందర.

కాం - పంతులుగా రేమంటారో!

శశి - నీకెందుకూ?

కాం - ఏ వూరెడుతున్నారు?

శశి - మీకేం పని?

కాం - ఊరికే అడుగుతున్నాను.

శశి - అనవసరంగా అడగక్కర్లేదు.

కాం - పోనీ, రేపు పంతులుగారు వచ్చిన తరువాత వెళ్ళకూడదు
ఇతని మాటలు విచిత్రముగా నుండెను. భయము వేయుచుండెను.

కాం - మీరిప్పుడు వెళ్ళడం బాగుండలేదు.

శశి - ఎవరికి?

కాం - ఎవరికీనీ.

శశి - నాకేం, బాగుండకపోతే?

కాం - నాకనుమానంగా వుంది. మీరు వెళ్ళడానికి వీల్లేదు.

శశి - మీ రెవరాజ్ఞ పెట్టడానికి?



కాం - భర్త వూళ్ళో లేనప్పుడు మీరేమిటో తీసుకువెళ్ళుతోవుంటే చుట్టుప్రక్కల వాళ్ళూరుకుంటారా ? మీరిప్పుడు వెళ్ళడానికి వీల్లేదు.

శశి - నేను స్వతంత్రురాల్ని. మీకుగాని, మీ పంతులుగారికి గాని నన్నాపడానికధికారములేదు. వెళ్ళండి.

కాం - బండివాడా! ఆపరా!

శశి - ఆపకురా, వెళ్ళు.

కాం - ఒరేయ్. నా మాటలు వింటున్నావుకదా? తరువాత తంటాలు వస్తే నీ మీది కొస్తుంది.

శశిరేఖకు యింటికి వెళ్ళడానికి అభ్యంతరములేదు. సుందరరావుతో చెప్పి మరునాడు వెళ్ళవచ్చుననుకొనెను కాని వీడు తన నాపినందులకు ఆమెకు మహా కోపముగా నుండెను. తన పంతమే నెగ్గించుకొనవలెననుకొనెను. బండివాని కెక్కువ దక్షిణిచ్చెదననెను. కాని వాడు భయపడి బండి తోలలేదు. ఇంతలో బండి చుట్టును జనులు మూగిరి. కూలి యిచ్చెదనువెవరైన తన పెట్టెను రైలువద్దకు తెచ్చెదరేమోనని యడిగెను. కాని కాంభొట్లు మాటవిని ఎవరును సహాయము చెయ్యలేదు. ఇంక యింటికి పోవుట కామెకు మనసు కాలేదు. సుందరరావున కవమానముకాదా? అదిగాక వీరందరి ఎదుటను వోడిపోయినటుల యింటికి పోవలెనా? పెట్టెనచటనే వదలి వక్కతెయు రైలు స్టేషనుకు బోయెను. కాంభొట్లును వెంటవెళ్ళెను. కాని రైలు తప్పిపోయినది. ఏమి చేతునాయని ఆలోచించుకొనుచు అచటనే నిలువబడెను. ఇంతలో ఆస్పత్రి నౌకరు పరుగెత్తుకొని వచ్చెను.

"అమ్మా! అదృష్టమే మీరు వెళ్ళలేదు. అయ్యగారి బండి పడినది స్మృతిలేదు. ఇంట్లో పడుకోపెట్టినాము" అని చెప్పెను. శశిరేఖ ఇంక సందేహింపలేదు. ఇంటికి బయలుదేరెను. ఈ స్థితిలో తానతనిని వదలినచో ఎంత దుఃఖించునో! అతనికి దిక్కెవరు? తనను నమ్మి పెండ్లయినను చేసి కొనలేదు కదా ?

ఇంటికి వెళ్ళునప్పటికి సుందరరావుకు స్మృతిలేదు. పెద్ద డాక్టరునకు కబురు చేసియుండిరి. డాక్టరు పరీక్ష చేసిన తరువాత డాక్టరును ఎట్లున్నదని శశిరేఖ అడిగెను.

డాక్ట - మీరీతని భార్యా?

శశిరేఖ కేమి చెప్పుటకును తోచలేదు. తనవంక ఆశ్చర్యముతో చూ
అతని చూపులామె మనస్సు నాందోళన పరచుచుండెను.

డాక్ట - సుందరరావుగారు మిక్కిలి అపాయ స్థితిలో నున్నారు. ఏమీ చెప్ప
కును వీలులేదు. వారము రోజులు గడచినకాని ఆశలేదు. రేయుంబవళ్ళు అ
బహు జాగ్రత్తతో చూస్తో వుండాలి. మీరు చూడగలరా? నేనాయన్ని ఆస్ప
తీసుకొని పోతే బాగుండును. కాని కదిలించడం అపాయకరము. మీరా భా
తీసుకుంటారా? లేకపోతే నేనెవరినన్నా పంపనా?

శశి - నే నసమర్థురాలనని ఎందుకనుకున్నారు .

డాక్ట - కోపము వద్దు. మీకు రైలు తప్పిపోవడంచేత యీ సాయం
మిమ్మల్ని చూసే భాగ్యం నాకు కలిగింది.

శశి - ఉహు, సుందరరావుగారి విషయమై తగిన జాగ్రత్త నేను తీసుకో

డాక్ట - అట్లా అయితే సరే. అతని ప్రాణాలు మీ చేతుల్లో పెడుతున్నా

శశి - మరేమి భయపడనక్కర్లేదు.

డాక్టరు వెళ్ళిపోయెను. శశిరేఖ కతని కంఠము, మాటలూ, ఏవో తెలి
వానివలె నుండెను. ఆమె నౌకర్ల నతని విషయమై యడిగెను. అతనింగ్లం
వెళ్ళివచ్చుటచే ఇంత పెద్ద పని యయ్యెను. అతడు బ్రాహ్మ సమాజమున చేరినా
అతని అసలు నివాస స్థలము గోవిందపురము. పేరు రామారావు.

ఆహా విచిత్రము! తాను పెండ్లికి పూర్వము చిన్నప్పుడు ప్రేమించిన రామా
యితడు!

## 10

పది రోజుల వరకును సుందరరావు ప్రాణాపాయస్థితిలో నుండెను. రేయిం
వళ్ళు ఒక్క నిముషమైన నేమరక శశిరేఖ అతనిని కాచుకొని కూర్చుం
ఎప్పుడాతడు కండ్లు తెరచి చూచినను, ఆమె మృదుహస్తము, సుందర నేత్రము
అతనికి ధైర్యము నిచ్చుచుండెను. ఇంకొకరి నెవ్వరిని దరిజేరనీక ఆమె
స్వయముగ నన్ని సౌఖ్యముల సమకూర్చెను. కాని ఆమె మనసు మాత్ర



స్వస్థత చెందిన తరువాత ఇతడెట్లుండునో కదా? ఎట్లుండిన నేమి, తాను వెళ్ళుటకేమి యాటంకము? డాక్టరు వచ్చినపుడెల్ల అతనిపై తలపులు తిరుగుచుండెను. అతడు తనను గుర్తుపట్టలేదు, అసలు చిన్నప్పటి శశిరేఖనే మరచి యుండును. అతనికి తనను జ్ఞాపకము చెయ్యవలెనా లేదా? అతనికి వివాహమైనదో లేదో? అతని భార్య ఎట్లుండునో? ఎంత పొడుగుగా, బలముగా నుండెను అతడు? ఎంత జ్ఞానవంతముగా, ఉదారముగా, శాంతముగా, సుస్థిరముగా నుండెను అతని ముఖము! ఎంత గౌరవముగా, మృదువుగా నుండె నాతని మాటలు! ఎంత అధికార మాతనికి! సుందరరావు కన్న ఎంతో అత్యుత్తమ పురుషుడుగా కన్పడెను. అతని యందే కళంకమును కానరాదు.

అతడును తానును పసితనమున ఆడుకొనిన ఆటలు, చేసిన స్నేహము, పొందిన సౌఖ్యములు కండ్లకు కట్టినట్లు జ్ఞప్తికి వచ్చుచుండెను. ఒకనాటి సాయంకాలము రామారావామెను ముద్దు పెట్టుకొని "నిన్ను తప్ప ఇంకెవరిని పెళ్ళి చేసికోను. నువ్వు నన్ను చేసుకుంటావా?" అని అడిగియుండెను. సిగ్గుతో "నిన్ను తప్ప ఎవరినీ చేసుకో"నని ఆమె చెప్పెను. అతను ఎండాకాలము, శలవలకు వచ్చినప్పుడు, వూళ్ళో అందరూ, అతని చదువు సంగతి చెప్పుకొని ఆశ్చర్యపడు టయును, అతడు చిన్నవాడయినను అతని తెలివిని బుద్ధిమంతతనాన్ని మెచ్చుకొను టయు జ్ఞాపకముండెను. అతడు రాగానే కొంటెపిల్లకాయలు అతడు వారిని ఎక్కడ తన్నునోయని దాగుకొనుచుండిరి. అతడు ఇంగ్లండు వెళ్ళక పూర్వము తనకోసరము వచ్చి "శశీ, నేను సముద్రము దాటి దూరదేశం వెడుతున్నాను. కాని నిన్నెప్పుడూ మరిచిపోను. ఈ జన్మలో మరిచిపోను. నా ప్రాణమున్నంతవరకు నీవే నా భార్యవు. నేను వచ్చిందాకా నా కోసం పెళ్ళి చేసుకోకుండా వుంటానని వొట్టెయ్యి" అని ఏమీ తెలియని తన చేత వొట్టు వేయించుకొని, తన చేతినున్న చిన్న గాజును జ్ఞాపకార్థము తీసుకుని వెళ్ళుటయు, అప్పుడు జరిగినట్లు తోచెను. కాని తానెంత అతనిని ప్రేమించి పెళ్ళి వద్దని యేడ్చుచున్నను, బలవంతముగా తన నెవడికో పెళ్ళి చేసి యుండిరి. అటు తరువాత తాను అతనిని మరిచి యెన్నాళ్ళో అయినది. ఈ ఆలోచన లిప్పుడెందుకు ?

నెల దినముల తరువాత డాక్టరు రామారావు రోగిని పరీక్షచేసి వెళ్ళిపోవుచు, శశిరేఖతో మాట్లాడెను.

రామ - ఇంక అపాయము లేదు.

శశి - మీరు తీసుకున్న శ్రద్ధకు చాల వందనాలు. ఆయనకి ప్రాణదా
చేశారు.

రామ - నేను కాదు. రాత్రింబవళ్ళు అతని అదృష్ట దేవత నిద్రాహార
లేకుండా అతన్ని కాపాడకపోతే నా మందులేం చేసేవి? ఇంక నేను ప్రతిరో
రానక్క ర్లేదు. అవసరమైతే కబురు పంపండి.

శశిరేఖ కొంచెంసేపు వూరుకుంది. ఒకరివంక ఒకరు చూస్తో నుంచున్నా
శశిరేఖ నిశ్చయం చేసుకుంది.

శశి - డాక్టరుగారూ ! మీ నివాస స్థలము గోవిందపురమా?

రామ - అవును, మీ కెట్లా తెలుసు?

శశి - అక్కడి వాళ్ళెవరన్నా జ్ఞాపకమున్నారా?

రామ - నేనక్కణ్ణించి వచ్చేసి చాలా రోజులయింది. అప్పుడున్న వాళ్ళందరు
జ్ఞాపకమున్నారు.

శశి - అందరూ?

రామ - ఏమి? అడగండి, చెపుతానో లేదో.

శశి - శశిరేఖ అనే పిల్ల జ్ఞాపకం వుందీ?

రామారావు మాట్లాడలేదు. ముఖమును ప్రక్కకు తిప్పుకొనెను. అతని కళ్ళ
నీళ్ళు గిర్రున తిరిగెను.

రామ - జ్ఞాపకం వుంది, ఆమె ఎక్కడుందో మీకు తెలుసునా?

శశి - ఆమె నిప్పుడు చూస్తే మీరు గుర్తు పడతారా?

రామ - ఎక్కడ, ఎంత మందిలోనైనా గుర్తు పడతాను. ఆమె రూపము నా
హృదయంలో శాశ్వతముగా ముద్రింపబడినది.

శశిరేఖ అతడీ ప్రకారము మాట్లాడుననుకొనలేదు. ఏదో చిన్నప్పటి సంగతుల
కొంచెము మాట్లాడవచ్చుననియు, తనవలెనే అతడును తనను మరిచెననియు
అనుకొనెను. అతని ఆవేశమును చూచి భయము కలిగెను. చెప్పవలెనా అక్కరలేదా
అతడు తన నింకను ప్రేమించుచుండెను. తానేనని తెలుపగలదా?



శశి - మీ కామెపై అంత ప్రేమయని యెరగను. తెలిస్తే యింత దుఃఖము
కలిగించే విషయాన్ని ఎత్తివుండను. క్షమించండి.

రామ - క్షమించడానికి ఏమీలేదు. ఒకసారి ప్రేమిస్తే మరిచిపోయే స్వభావం
నాదికాదు. మీరు ఆమె ఎక్కడున్నదో చెపితే చాలా సహాయము చేసినవాళ్ళవుతారు.

శశి - ఎక్కడుందో తెలీదు; చిన్నప్పుడు మీరు, ఆమె స్నేహంగా వుంటే
చూసేదాన్ని గోవిందపురంలో. పోనీ, మీరా వూళ్ళో ఆమె కోసం విచారించలేదూ,
ఏమయిందో ?

రామ - అక్కడి నా స్నేహితుల కుత్తరం వ్రాశాను. కాని ఆమె అక్కడ లేదని
వ్రాశారు. కనక ఇంకేం లాభమని వెళ్ళలేదు. అదిగాక, ఆమెకు పెళ్ళయిందట.
ఇంకా అమర్యాద పని చేసిందని కూడా విన్నాను. కాని నాకు సంగతులు బాగా
తెలీవు.

శశి - నాకు తెలుసును. లోకం అభిప్రాయం ప్రకారం ఆమె అధమ స్థితికి
వచ్చింది. కాని ఆమె మాత్రము తను చేసినపని చాలా అన్యాయమనుకుంటోంది.
సరేకాని, ఇంక ఆమెతో మీకేం పని?

రామ - ఏమీలేదు. ఆమె మొదటి భర్తను నేను. ఆమెకి నేను భర్తను
కాకపోయినా, ఆజన్మాంతమూ ఆమెయే నా భార్య. ఒక్కసారి చూడాలనీ, ఎట్లావుందో
తెలుసుకోవాలనీ, సహాయం చెయ్యడానికి వీలైతే చేసి ఆ దుస్థితిలో నుంచి
తప్పించాలనీ వుంటుంది.

రామారావుకు బొటబొట కన్నీళ్ళు కారెను.

రామ - రేయింబగళ్ళు ఆ మోహం తప్ప ఇంకేమీ స్మరణ లేదు. నా అంత
దురదృష్టవంతు డెక్కడాలేడు. ఒక్కసారి ఆమెను చూస్తే చాలు, ఇంకేమీ అక్కర్లేదు.
నా జన్మ సఫలమౌతుంది. ఈ లోకంలో కాకపోతే వొచ్చే లోకంలో కలుసుకుంటాను.
ఆమె సౌఖ్యము కోసం ప్రతిరోజూ ప్రార్థన చేస్తూ వుంటాను, ఆమె దుస్థితికి నేనే
కారణమేమోనని, ఆమెను దాంట్లోంచి నేను తప్పించగలిగి, నా విధిని చెయ్యకుండా
వున్నానేమోనని విచారం. మీకు ఎప్పుడన్నా ఆమె సంగతి విన్నప్పుడు నాకు
తెలియచేస్తే ఆజన్మాంతము కృతజ్ఞత చూపుతారు.

ఇంక శశిరేఖ ఎట్లు దాచగలదు ?

"రామా, నన్నప్పుడే మరిచిపోయినావా?" అనెను. రామారావు చూచెను. కొంచెము సేపట్లేయుండి చివరకు -

"తల తిరిగి పోతోంది. శశిరేఖ మీరా? మీరేనా? తరవాత వొస్తా చండి" అని వెళ్ళిపోయెను.

శశిరేఖ యీ విచిత్రమగు విషయము నాలోచించుకొనుచు కూర్చు రావును, పరిచర్యను, సమస్తమును మరచెను. ఇంతలో అతనికి కాఫీ వేళ సేవకుడు జ్ఞాపకము చెయ్యగా గది లోనికి పోయెను. సుందరరావు కం చూచుచుండెను.

శశి - కాఫీ సిద్ధమయింది. తేనా?

సుందరరావామె చెయ్యి పట్టుకొనెను.

సుంద - ఇట్లా కూర్చో. వేడిగా వుందే వళ్ళు? జ్వరము వచ్చింది. ఏ పోయినావు? ఇదంతా నా కోసమే? నేను నీకు ఏం చేశానని నాకింత చేశావు? నువ్వు ప్రాణదానం చేశావు నాకు. నిన్ను చూస్తూ, నీ వ్యా బతకడానికనే తలపు లేకపోతే నేను బతక్కపొయ్యేవాణ్ణి, నీ శ్రద్ధవల్లగాని యీ రోగం ఎప్పుడో మింగేసేది నన్ను. నీ సౌఖ్యాన్నీ, సంతోషాన్నీ, ఆరోగ్య కోసం ఇచ్చేశావు. ఇంత దయ, ప్రేమ, ఎప్పుడూ ఎరగను. ఇన్నాళ్ళనుంచి క్రూరంగా చూశాను! నీ ప్రేమను తృణీకరించి నిన్నెంతో ఏడిపించాను అదృష్టదేవతవై, ఏమీ మనస్సులో పెట్టుకోకుండా నన్నుద్ధరించావు నీ ఎట్లా తీర్చుకోను ?

శశి - ఋణం లేదు. ఏమీ లేదు. అట్టే మాట్లాడకండి. ఆయాసం

సుంద - శశీ, నేనా సాయంత్రం జరిగిందంతా విన్నాను. అంత దుకు పడ్డావు? నేను వచ్చేదాకా వుండక పోయినావా?

శశి - ఎవరు చెప్పారు మీకు? ఆ కాంభొట్లేనా? వాడు మళ్ళీ రావడం మొదలు పెట్టాడూ?

సుంద - వాడి సంగతి మన కెందుకులే. నీమీద నాకు కోప ఇంకొకళ్ళయితే ఎప్పుడో వెళ్ళిపొయ్యేవాళ్ళు. నేనేమి సౌఖ్యమిచ్చానని నా వుంటావు? నా రత్నాన్ని, నా ప్రాణాన్ని, పోగొట్టుకొనేవాణ్ణే. నే పడడ రక్షించింది. నిన్ను మళ్ళీ తీసుకొచ్చింది. నాకు, బాధ పడ్డందుకు ఇక



శశిరేఖకు సిగ్గువేసింది. తన తలపులెక్కడ ? ఇతని తలపులెక్కడా ?

సుంద - ఇంక ఎన్నడూ ఆ ప్రకారం నిన్ను చెయ్యను. నా వళ్ళు నేను మరిచాను, క్షమించగలవా? నా జన్మమంతా నీ సేవలో గడిపి, నిన్ను అపరాధం మరిచేట్టు చెయ్యడానికి ప్రయత్నిస్తాను. యింక నన్ను విడిచి పోవాలనుకోవుకదా!

శశిరేఖ మాట్లాడలేదు.

సుంద - నా మీద యింకా నీకు నమ్మకం రాలేదు. పోనీ నాతో చెప్పకండా వెళ్ళిపోనని వాగ్దానం చెయ్యి.

శశి - సరే.

సుంద - అంతేచాలు.

శశిరేఖకు యీ ప్రేమ యేమి సంతోషం కలుగ చెయ్యలేదు. అతనిపై ఆమె ప్రేమ అంతయు నశించినది. తనను గోవిందపురం వెళ్ళనియ్యడు కాబోలు అని దిగులు కలిగినది. సుందరరావుకు శశిరేఖ తన వద్ద నుండి వెళ్ళకలదన్న మాట కలలోనైనా తోచలేదు. తనను వదలిన ఆమెకు దిక్కులేదు గనుక తానెంత బాధపెట్టినను తనను వదలదని అతనికి నిశ్చయముండెను. కాని శశిరేఖ స్వతంత్ర మార్గమును వెదకికొన్న దనుట తోడనే అతని స్వభావమే మారినది. తన చేతిలో నుండి జారిపోవు నట్లుందునప్ప టికి, ఆ మనిషి అమూల్యత్వము జ్ఞాపకమునకు వచ్చినది. అప్పటినుండి అతడు శశిరేఖతో చాల జాగ్రత్తగా మెలగుట నేర్చుకొనెను. మిగుల దయము ప్రేమయు చూపుట తిరిగి నేర్చుకొనెను.

## 11

రెండు నెలలు గడిచినవి. డాక్టరు రామారావు ప్రతి మధ్యాహ్నమును సుందరరావింటికి వచ్చుచుండెను. తన పని ముగించుకొని సుందరరావు సాయంత్రము వచ్చు చుండెను. శశిరేఖకు, రామారావునకును మిక్కిలి స్నేహమని అతడెరుంగును. కాని ఇప్పుడు పూర్వమువలె బంధించుటకతనికి ధైర్యములేదు. శశిరేఖ తనపై నెక్కువ ప్రేమ చూపుటలేదని అతనికి తెలియుచునే యుండెను. కాని తానామె ప్రేమ నెట్లు కోరగలడు? రామారావు శశిరేఖపై మిక్కిలి యభిమానం చూపుచుండెను. అతనికి శశిరేఖ తన కథనంతను చెప్పెను. అతడు మిక్కిలి చింతించెను. కాని శశిరేఖ ఏమియు సిగ్గును కనపరచలేదు. తాను చేసినదంతయు

న్యాయమును ధర్మము అని విశ్వసించుచున్నటుల కనబడెను. తన తల్లిదండ్రులు కృష్ణునకు కలిగించిన దుఃఖమునకై వగవు తెల్పనేకాని, తానధర్మమును చేసి తెలిసినట్లయిన కనబడలేదు. అందుచే రామారావేమియు మాట్లాడ సాహసింపడు కాని ఆమె జీవనం అతనికి అధికమైన విషాదమును కలిగించుచుండెను. కతనిని చూచిన అధికమగు ప్రీతి. అతను ఆమెకు స్నేహమయిన తరువాత భయమును, సందేహమును పోయెను. అతడు లేకున్న యెడల సుందరరావును వదలిపోయి యుండెడిది. కాని ఇది వరకటి అశాంతి పోయి తనను రక్షింపగల సోదరుడొకడు దొరికినట్లుండెను. అతని కొరకెప్పుడును ఎదురు చూచుచుండును. తిరిగి చిన్నప్పటి సంగతులు వారెప్పుడును మాట్లాడలేదు.

మధ్యాహ్నమున సూర్యుడు తోటయందలి ఆకులను తన ముద్దుల వేడిమి తత్తరిల్లునట్లు చేయుచుండెను. గాలియు అలసి చెట్ల క్రింద నీడలో మెల్లగా ఉయ్యా లూగుచుండెను. ఇంక సౌఖ్యములు కోరని విధవలవలె పువ్వులు వడలి చెట్ల క్రింద రాలెను. సంపెంగ చెట్టు క్రింద చాపపై శశిరేఖయు రామారావు కూర్చుండిరి. శశిరేఖ పగడ పువ్వుల దండను పూర్తిచేసి రామారావు చేతికిచ్చె

రామా - నేనొక్కటడగాలనుకుంటున్నాను. నీకు కోపంరాదు గదా?

శశి - అడుగు. నీ మీద నాకు కోపమేమిటి ?

రామ - నీవు బ్రతికే ఇట్లాంటి బ్రతుకు అసహ్యమెయ్యడం లేదూ?

శశి - అసహ్యమేమున్నది?

రామ - నీకు తెలీడం లేదూ నేననేది?

శశి - తెలీడంలేదు.

రామ - సుందర్రావుకీ నీకూ ఏం సంబంధ?

శశి - నీతో చెప్పలేదూ ఏం సంబంధమో?

రామ - చెప్పినావులే. కాని ఇట్లా వుండడం తప్పు కాదూ?

శశి - ఏం తప్పు?

రామ - పెళ్ళికాంది ఇట్లా ఎట్లా అంటే అట్లా వుండడం మంచిదేనా?

శశి - నువ్వు కూడా అందరిమల్లే అంటున్నావే? మీ బ్రహ్మ సమాజం కూడా అందరిమల్లేనా యేమిటి? మూర్ఖం వదిలేశామంటారే?



రామ - అవును. కాని పెళ్ళి చేసుకోంది ఒకణ్ణి విడిచి ఇంకొకడితో విచ్చలవిడిగా వుండొద్దనడం మూర్ఖమేనా?

శశి - ఎందుక్కాదూ? తప్పేమిటి? పెళ్ళికి నాకభ్యంతరం లేదు. కాని చేసుకోనివ్వరుగా?

రామ - అవును. రోజుకొకణ్ణి చేస్తూ వుంటారా ?

శశి - అయితే మా వాళ్ళు చేసినవాడితో వుండాలంటావా, నువ్వనేది? అదిగాక పెళ్ళి అయినా యిష్టం వచ్చినప్పుడు వదలకూడదుటగా? తరవాత యిష్టం లేకపోతే ఏం చెయ్యాలి?

రామ - ముందరే ఆలోచించి చేసుకోవాలి. వాడు యిష్టం లేకుండా వస్తే ఊరికే వుండాలి.

శశి - ఊరికే ఎక్కడ వుండాలి? ఎట్లా బ్రతకాలి?

రామ - నీవు సరిగ్గా వుంటే ఎక్కడన్నా వుండొచ్చు.

శశి - అప్పుడు నన్ను ప్రేమించేందు కెవరుంటారు?

రామ- ఇంక మళ్ళీ ప్రేమేమిటి? అదే కూడదంటున్నాను.

శశి - అయితే ఎక్కడో యిక బతకడమెందుకు?

రామ - ఊరికేనే.

శశి - ఊరికే ఉండే బదులు హాయిగా ప్రేమిస్తో సంతోషంగా బతికితేనే?

రామ - ఇట్లా బతకడం పాపం కదూ?

శశి - అంటారు కాని ఎందుకు పాపమో ఎవరూ చెప్పరు. నాకు తప్పని తోచిందాకా నేనెందుకు నా జీవనం వృధా చేసుకోవాలో తెలీటం లేదు.

ఇంక వాదించి లాభంలేదని రామారావు తెలుసుకొనెను.

రామ - పోనీగాని యీ సుందర్రావువంటి వాడిమీద నీకు ప్రేమ యెట్లా కుదిరిందో నాకు తెలీడంలేదు. వీడి చరిత్ర నీకేమన్నా తెలుసునా?

శశి - నాకు తెలీదు. తెలీనక్కర్లూ లేదు. నా మీద ఆయనకీ ప్రేమ ఉండేది అంతే చాలును.

రామ - నీకు అతనిమీద ప్రేమ లేదన్నావుగదా యిప్పుడు? ఎందుకున్నా వక్కడ?

శశి - ఉండక చేసేదేముంది ?

రామ - పోనీ, నేనొకరి దగ్గరికి పంపుతాను. అక్కడ స్వతంత్రంగా సు జీవించు.

శశి - జీవించి -

రామ - ఏమీలేదు. హాయిగా వుండు.

శశి - ఇక్కడ నేను పడుతున్న కష్టమేముంది? ఒక్కరి కానందమి నేను సౌఖ్యంగా వున్నాను. అక్కడ నాకు పనేముంది? ఏం తోస్తుంది?

రామారావు మాట్లాడక కూర్చునెను. కొంచెము సేపుండి.

రామ - నేనొకటి చెపుతాను. ఎన్నాళ్ళనుంచో చెప్పాలనుకుం నీకిష్టమైతే సరే. లేకపోతే నేను చెప్పలేదనుకో. నీకు తెలీదూ! నీమీద ప్రే పోలేదని? నిన్నిక్కడ చూచినప్పటినుంచీ నాకు నిద్దరలేదు. ఎంత అణ మన్నా అణక్కుండా వుంది. నా మీద నీకేమైనా ప్రేమ వుందా ?

శశి - ఆ విధంగా నేనెప్పుడూ ఆలోచించలేదు. తెలీదు. అయితే మీరు తప్పంటున్నారుగా?

రామ - అదికాదు, నా వుద్దేశ్యం నువ్వు నన్ను పెళ్ళిచేసుకోవాలి

ఇంతకన్న చెడ్డ సమయం రామారావుకు దొరికి వుండేదికాదు. త చెడ్డదన్నందుకు అతనిపై కోపం ఆమెకింకను పోలేదు.

శశి - పెళ్ళీ? ఇప్పుడేం పెళ్ళి?

రామ - ఏం?

శశి - ఇంత పెద్దవాళ్ళకా?

రామ - బ్రాహ్మసమాజంలో తప్పులేదు.

శశి - మీ వాళ్ళందరూ అట్లాంటి చెడ్డదాన్ని చేసుకున్నా వేమన

రామ - అంటే అన్నారులే! కష్టం నాకేగా?

శశి - పోనీ, మరి యిదివరకొక మొగుడు గోవిందపురంలో

రామ - నేను కనుక్కున్నాను. అతడు పోయి మూణ్ణెల్లయింది.



శశి - పోయినాడూ ఆఖరికి పాపం ! ఈ పాటికి వెధవముండని చేసేవాళ్ళే వ్వు. ఈ జుట్టుగిట్టూ గొరిగేవాళ్ళు గావును. అప్పుడు నువ్వు వచ్చి పెళ్ళిచేసు కుంటానని జుట్టు పెంచేవాడివి. ఈనాటికి కొంచెం పెరిగి, నీ తలమల్లే వుండేది నా తలకూడా.

అని బిగ్గరగా నవ్వి చాపమీద పొర్లెను. రామారావునకు కోపము వచ్చెను. తనంత ప్రేమతో పెళ్ళి చేసుకొనమని అడగగా ఈ నవ్వులు అతనికి అర్థము కాలేదు.

రామ - సరేలే. చెప్పు మరి.

శశి - పెళ్ళంటే యేం చేస్తారు? ఊరేగడం అవన్నీ ఉన్నాయా! పీటలమీద ఎవరు కూచుంటారు? సుందర్రావుగారా?

అని తిరిగి బిగ్గరగా నవ్వనారంభించెను. రామారావుకు చాలా కోపము వచ్చెను.

రామ - అవన్నీ లేవు. పదిహేను రోజులు ముందర చెప్పి రిజిస్టరు చేయించు కోవాలి.

శశి - ఏదో కొత్తగా వుంది. చూడవలసిందే. కాని అన్ని పెళ్ళిళ్ళమల్లే యీ లోకంలో ఆ లోకంలో నీదాన్నే కావాలా?

రామ - ఆ. నా ఆత్మ నీ ఆత్మ ఒకటి అవుతాయని అర్థం?

శశి - మరి కాకపోతే?

రామ - నా మీద ప్రేమ నీకు, నీ మీద ప్రేమ నాకు వుంటే ఎందుక్కావూ?

శశి - ఇప్పుడుండి తరువాత పోతే?

రామ - అట్లా ప్రేమ పోకూడదు.

శశి - పోకూడదని నువ్వు చెప్పేదేమిటి? పోతే?

రామ - పోతే ఇంకేముంది? నీ యిష్టం.

శశి - నా యిష్టమేనా? లేకపోతే అందువల్లే యిష్టమున్నా లేకపోయినా పడివుండమంటారా ?

రామ - అంటే మాత్రం ఉంటావా నువ్వు?

శశి - అవును. కాని ముందు అనాలి గావును "నువ్వే నాకు భర్త యెప్పుడూ" అని.

రామ - అవును.

శశి - మరి అబద్ధంకదూ అది? ఎప్పుడూ నువ్వే భర్తగా వుంటా మేమిటి?

రామ - ప్రేమ వుండేటప్పుడు నమ్మకం వుండదూ?

శశి - ఏం నమ్మకం? ఇప్పటికుందని నమ్మకం.

తరవాత సంగతేమో?

రామ - నేను వెడతాను. పొద్దుపోతోంది. నాకు మనసేమీ బా

అని లేచెను.

శశి - మరి ఆఖరికి నా కిష్టమో లేదో వినకుండానే వెడుతున్నా

రామ - అవసరం లేదు.

శశిరేఖ పరుగెత్తుకొని వెళ్ళి చెయ్యి పట్టుకొనెను.

శశి - కోపం వచ్చిందా నా కొంటెతనానికి?

రామ - రాలేదు. నన్ను వెళ్ళనీ,

అని వెళ్ళిపోయెను. శశిరేఖ ఆలోచించుకొనెను. తానెంత మూర్ఖ అతని మనస్సును నొప్పించెను కాబోలు! కాని అతడు పెళ్ళి చేసుకొనమని రీతి ఆశ్చర్యముగా నుండెను. తనను ప్రేమించి యుండెనని తెలియును దినముననే మరచెను. అతని ప్రవర్తన సహోదరుని దానివలె నుండుటే మనస్సున కాతలపే రాలేదు. ప్రేమ వచ్చుట తోడనే తనకు తెలిపి, తనను చూపులచే, మాటలచే తన అనురాగమును బడయుటకు ప్రయత్నించువా ప్రేమనంతను అణచుకొని, నీతికై లేనటుల వర్తించువారి నామె యెరుగ దినముననైనను అతడు తనపై ప్రేమ యేమియును చూపలేదు. అతనిపై ప్రేమ కలదా? ఏమో? కాని ఆ విశాలవక్షమున ఎంత శాంతి కలదు? స్వార్థపరత్వములేని ఎట్టి నిర్మల మగు ముఖమది! అతనిని నమ్మి తన అతని చేతులలో బెట్టిన హాయిగ నిద్రింపవచ్చునుగదా! జీవనము సు గడువగలదు. తన ఇల్లు, తన ధనము, తన బిడ్డలు, తన సంసారము ఎంత శాంతి ! వివాహము వీనినన్నింటిని ఇచ్చును గాబోలు తనకు?



ఆమె స్వభావమామెకు తెలియకనే మారినది. తీవ్రమగు ప్రేమను బాధను గోరు ఆమె యిప్పుడు శాంతిని, సంసారమును గోరుచున్నది. గాఢమగు సుందర రావు అగ్నివంటి ప్రేమ నామెను కాల్చివైచెను. అతనివల్ల పడిన బాధలచే ప్రాణము తత్తరిల్లునట్లు చేసెను.

ఎన్ని దినములు సుందరరావు వద్దనున్న తనకు శాంతి రాదని ఆమె యెరుగును. వయసు ఎదిగిన కొలదిని ఆమె స్వభావమునూ మారుచుండెను. ఇప్పుడింత ప్రేమగా వున్నాడేకాని సుందరరావు, అతనిని నమ్మిన వారెవరు? రేపు తిరిగి ఏ విధముననగునో? కాని రామారావును నమ్మిన ఇంక దుఃఖము, సందేహము, భయము లేవుకదా? పోనీ ఇతనిని వివాహము చేసికొనకూడదా? కాని వివాహము చేసికొన్నవారు నిర్జీవముగ కనబడుచున్నారే! వివాహము చేసికొనుట మంచిదా?

"శశీ"

సుందరరావు వచ్చి కూర్చుండెను.

సుంద - ఏమి టాలోచిస్తున్నావు ఇక్కడ పడుకొని? రామారావు గారింకా రాలేదా యీవాళ?

శశి - వచ్చి వెళ్ళినారప్పుడే. సరేకాని మీ అభిప్రాయం యేమిటి? పెళ్ళి చేసుకోడం మంచిదా, పెళ్ళి చేసుకోకపోవడమా?

సుంద - అది మనుష్యుల్ని పట్టి వుంటుంది. అందంలేనివాళ్ళు వీలైనంత సుందరగా ఎవణ్ణో వకణ్ణి కట్టుకోవడం మంచిది. నీవంటి అందమయినవాళ్ళు చేసుకోవడం సుతరామూ కూడదు.

శశి - వేళాకోళం కాదు. నిజం చెప్పండి. పెళ్ళి అనేది సంఘంలో మంచిదవునా, కాదా ?

సుందరరావు బుద్ధిమీద శశిరేఖకు మిగుల నమ్మకము, జీవనమును గురించి అతనికి స్థిరమయిన అభిప్రాయము లున్నవనియును, అతడు జదివి స్వతంత్రముగా ఆలోచించు వాడనియు ఆమె యెరుగును.

సుంద - అయితే అసలున్న సంగతి చెబుతాను విను. మొదట పురుషుడు స్త్రీని బలహీనురాలిని చేసి స్వాధీనం చేసుకున్నాడు. సృష్టి యందు పురుషుడికి స్త్రీ

కంటె ఎక్కువ శరీరబలం వుండడం చేత స్త్రీని తన సొత్తు చేసుకున్నాడు. తను వెళ్ళిపోతే యీర్ష్య కనుక శాశ్వతంగా తనదాన్ని చేసుకోడానికి పెళ్ళి అనే కనిపెట్టినాడు. పురుషుడు తన వాడవుతాడు కదా యని స్త్రీ కూడా సంతోష వివాహానికి అధికారం ఇచ్చేందుకు ఈశ్వరుణ్ణి కూడా తీసుకువచ్చి పెట్టి అన్ని బానిసత్వాలూ శరీరబలం ఆధిక్యతా లోకంలోంచి పోగానే, యీ బానిస కూడా పోవలసిందే గాని, ఎట్లాగో పోకుండా, మహాబంధమై చుట్టుకుంది

శశీ - ఏమీ?

సుంద - స్వభావసిద్ధంగా వక పురుషుడుగానీ, స్త్రీకాని, ఒక స్త్రీ పురుషుడితోను సంతుష్టి పొందరు. జీవిత మన్ని విషయములలోనూ కోరుతుంది. మార్పే జీవనానికి ప్రాణము. ఈ విషయంలో మాత్రము మానవ స్వభావ మూరుకుంటుందా? ఈ కట్టుబాట్లు ఏర్పరచుకుని మనుష్యులు వదిలించుకోలేక తంటాలు పడుతున్నారు.

శశి - ఈ స్త్రీలందరు వక్క మొగుడితోనే తృప్తి చెంది వుండడం లే

సుంద - వాళ్ళు రహస్యంగా ఎంత ఇబ్బంది పడుతున్నారో ఎవరికేం తె అదీగాక వాళ్ళని బయటకి పోనివ్వక, నిజ స్వభావాల్ని చంపేశారు, ఈ దే

శశి - ఇప్పుడు నష్ట మేమొచ్చింది?

సుంద - కావలసినంత. ఒక్క పాతివ్రత్యమనే అసహజమగు గు కోసం అనేక సహజమయిన సద్గుణాల్ని చంపారు. ధైర్యము, స్వేచ్ఛ, సూ ధీరత్వము, ఉదారము, లోకజ్ఞానము, విద్య, ఆరోగ్యము, చాతుర్యము, మొద గుణాలన్ని పోయినాయి స్త్రీనుండి. ఇప్పుడు స్త్రీలు పురుషుడికి దాస్య బొమ్మలు గాకింకేమిటి. పావు గంటసేపు తెలివిగా మాట్లాడగల ఆడదాన్ని చూ

శశి - ఇంతకూ పెళ్ళి తప్పంటారా?

సుంద - తప్పనను, ఇంతకన్నా స్వేచ్ఛవున్న పెళ్లిళ్ళుండాలి. ఇష్టము నప్పుడు వకళ్ళని వకళ్ళు వదిలే స్వేచ్ఛ వుండాలి.

శశి - ఇప్పుడు మాత్ర కట్టివేస్తున్నారా? ఒకళ్ళని వొకళ్ళు వదిలేస్తే చెయ్యగలరు?



సుంద - కట్టివెయ్యకపోతే సరా? సంఘం పొడిచి చంపుతుందనే భయము లేదూ? అందుకనే పురుషుడు ఏం చేసినా యింట్లోనే పడి వుంటారు, స్త్రీలు, పేరు ప్రతిష్ఠలు పోతాయంటే ప్రాణం పోయినట్టే వీళ్ళకి.

శశిరేఖ ఆలోచనలో పడింది. సుందరరావు అట్లే చాలాసేపు కూర్చున్నాడు. చిమ్మ చీకట్లు కమ్మినవి. శశిరేఖ సుందరరావును మరిచిపోయినది. మెల్లగా వొక్కొక్క చుక్కే బయటకు వచ్చి ఆకులలో నుండి తొంగి చూచినది.

పైన విచ్చిన సంపెంగ పువ్వుల వాసన అలముకొనెను. సుందరరావు శశిరేఖను దగ్గరకు తీసుకుని కౌగిలించుకొనెను.

సుంద - శశీ, ఏమిటాలోచిస్తున్నావు?

శశి - ఏదో జీవనము గురించి.

సుంద - అంత మహా ఆలోచనేముంది?

శశి - జీవనము నెవరర్థం చేసుకోగలరు?

సుంద - ఆ ఆలోచనల్లో నే నెక్కడైనా వున్నానా?

శశి - అట్లాంటి సంగతులు కాదు నేనాలోచిస్తోంది?

సుంద - నన్ను ముద్దు పెట్టుకొనెన్నాళ్ళయింది?

శశి - పెట్టుకోమన్నారా?

అని చెయ్యిని తీసికొని ముద్దు పెట్టుకొనెను!

సుంద - అంతే?

శశిరేఖ లేచి బుగ్గ మీద ముద్దు పెట్టుకొనెను.

సుంద - ఎప్పుడూ ఇంతేనా? పూర్వం మల్లే ప్రేమ ఎప్పుడన్నా వస్తుందా?

శశి - ఏమో?

సుంద - మించిపోయింది. నా దురదృష్టము.

## 12

రామారావు మనసు చాలా చిన్నబోయెను. శశిరేఖ దుర్వర్తనమును, పూర్వ చరిత్రను అంతను మరచి ఆమెపై ప్రేమను దురువలేక ఆమెను వివాహమాడదల

చెను. కాని ఆమె తననట్లు పరిహాసము చేయుటచే అతనికెంతో విచారం క
ఆమె మనసు కూడ ఇట్టి దురూహలకు లోనైనదే? ఇక ఎక్కడి ఆశ
వివాహ మాడినను ఆమె నైజము మానునా? కాని ఆమె యందెంతటి
కలదు! ఎంతటి నిష్కపటము, ఎంత ప్రేమ, ఎంత స్నేహం? బాల్యమునందే
తాను వివాహమాడినచో అట్టి స్త్రీతో తానెంతటి సౌఖ్యము ననుభవించెడ
ఈ హిందూ సంఘ మామె నట్టి స్థితికి తీసుకువచ్చెను గదా? ఆ బాల్య
ఆమె వద్దనుచుండగా ఎవనికో కట్టిపెట్టకపోయిన తన కొరకామె కా
యుండెడిదే కదా? రెండు జీవితములనిట్లు పాడొనరించినదీ సంఘా
ఇంక ఆమెను అడిగిన లాభంలేదు. పవిత్రములును, ఈశ్వరభక్తి యుత
అగు తన తలపు లెక్కడ! ఆమె యూహ లెక్కడ? వివాహము చేసికొన్నను ఇం
బ్రతుకు? తన్ను వదిలి ఎప్పుడో వెళ్ళి పోవును. ఇంక నామెతో నింత పరి
మాత్ర మెందుకు? దినదినమును ఆశయను మహా అగ్నిచే దహింపబడు
ఇంక నామెను చూచుట కూడా మానవలెను. మరచి పోవుటకే ప్రయత్నింప

శశిరేఖను చూచి నెల దినములయ్యెను. నెలదినము లుండలేదా?
మాత్రమామె స్నేహమెందుకు? ఆమె కూడ తనను మరచియే యుండున
అన్ని సంవత్సరములనుండి తనకు స్నేహమయిన గాజును ముద్దిడుకొని క
తునకలు తునకలు కొట్టి పారవేసెను. ఇంతలో ఒక వుత్తరము వచ్చెను.

రామా,

ఇన్నాళ్లు వచ్చెదవని ఎదురు చూచుచుంటిని. నీవు రాకున్న నే నుండ
ఎప్పుడు నిన్నే తలచుకొనుచున్నాను. బుద్ధిలేక నీకు కోపము తెప్పించినంద
క్షమించు. ఒక్కసారి వచ్చి చూచి పొమ్ము.

నిన్నెల్లప్పుడును తలచు

శశిరేఖ

మధ్యాహ్నము ఎప్పటివేళకు రామారావు వెళ్ళెను.

శశి - ఏదీ ముఖం చూపించు. నెల్లాళ్ళవరకు చూడనంత కోప
నా మీద?

రామ - సరేలే, ఎందుకు రమ్మన్నావు?



శశి - రావడానికే. ఏం తోచడం లేదు, రమ్మన్నాను. తప్పా?

రామ - నేనింక రాకూడదనుకున్నాను.

శశి - నేనేం చేశాను?

రామ - ఏం చెయ్యలేదు. కానీ నాకు కష్టంగా ఉంటుంది రావడం?

శశి - నాకు తెలీడంలేదు. నాకు చెప్పవూ నీ మనసులో ఉన్నది.

రామ - చెపితినికాదూ, ఇంకెందుకు మళ్ళీని?

శశి - క్షమించు. నిజంగా నాకర్థము కాలేదు. నీకు కష్టమయితే రానక్కరలేదు. కాని ఎందుకు రావో చెప్పు.

రామ - శశీ నీకు తెలీదూ నీమీద ప్రేమ నాకు పోలేదని? పోదు కూడానూ? నీకు నామీద ప్రేమ లేకపోయెను. ఇంక వచ్చి నిన్ననుదినం చూస్తూ వుంటే నాకు మనసు బాగుండదు.

శశి - నీ మీద నాకు ప్రేమ లేదన్నానా నేను? నా జవాబు వినకుండా వెళ్ళిపోలేదూ?

రామ - ఉంటేనేం లేకపోతేనేం? అట్లాంటి ఉద్దేశమున్న తరువాత.

శశి - ఎట్లాంటి ఉద్దేశం?

రామ - ప్రేమ శాశ్వతంగా వుండదని.

శశి - అవును, ఎప్పుడూ వుంటుందని ఎవరన్నా చెప్పగలరా? అట్లా చెప్పేవాళ్ళు వాళ్ల మనస్సు వాళ్ళెరక్కుండా అబద్ధాలు చెప్పుతున్నారు. పోనీ నువ్వు చెప్పగలవా? నా మీద ప్రేమ ఎన్నడూ పోదని?

రామ - ఇన్నేళ్ళు అట్లాగే వున్నది. ఇంక వుండదా?

శశి - ఏమో నేనేమి చేసినా నా మీద ప్రేమ పోదా? నా మీద కోపము రాదా? పోదని నువ్వు ఇప్పుడు అన్నా పోకూడదా? పోనీ, నీ వంటివాళ్ళకి ఎవరికో అట్లా వుంటుంది. కాని, అందరికి ఒక్కరి మీదనే అట్లా నిలుస్తుందా? మనుష్య స్వభావము చంచలము.

రామ - అవునులే, అందుకే పెళ్ళి అనేది పెట్టినారు.

శశి - కాని మనస్సు సరిగ్గా లేకపోతే పెళ్ళేమి చేస్తుంది?

రామ - పెళ్ళి చంచలత్వాన్ని కొంతవరకు కుదుటపరుస్తుంది. ఎట్లావున్నా శాశ్వతంగా ప్రేమ ఉండాలనే ఉద్దేశ్యంతో వాగ్దానాలు చేసుకుంటే స్త్రీ పురుషులకు కలిసి ఉండడానికి అర్హతలేదు.

శశి - పోనీ, దానికేంగాని, ఇంతకూ నన్ను నువ్వు పెళ్ళిచేసుకోమం

రామ - అనడంలేదు.

శశి - మొన్న అడిగినది నేననుకొన్నట్లు వేశాకోళమే అయితే నేను ఇంక కోపమెందుకూ?

రామ - వేళాకోళ మెందుకనుకున్నావూ?

శశి - అంత హఠాత్తుగా, ఏమీ తెలీకుండా అడిగితే ఏమనుకోను నా మీద ప్రేమ ఉందనే అనుకోలేదు నేను.

రామ - ఉందని చెప్పలేదా?

శశి - చెప్పినావు కాని, ఎందుకో ఉందనిపించలేదు నాకు.

రామ - నీవు పరాయివాడి దానవయితే నీమీద నేనెట్లా ప్రేమ చూ

శశి - నేను పరాయివాళ్ళ దానినా?

రామ - కాక ఇంకేమిటి?

శశి - సుందరరావుగారిమీద ప్రేమ నాకు లేదని చెప్పలేదూ?

రామ - అయితే?

శశి - నే నతని దాన్ని ఎట్లా అవుతాను?

రామ - అతని ఇంట్లో లేవూ?

శశి - ఇంకేం పనిలేక ఉన్నాను. వచ్చివెయ్యమంటావా?

రామ - నేనేమీ అనటంలేదు.

శశి - మరి ఏం చేస్తే, నాతో స్నేహంగా ఉంటావు? మీ బ్రహ్మ నాకేమీ అర్థం కావడములేదు.

రామ - ఇంతకూ నామీద నీకు ప్రేమ ఉన్నదా? లేదా? ఒకటే

శశి - నిజంగా ఉంది. మొదట తెలీలేదు. కాని నీవు చెప్పిన తరు

అని రామారావు దగ్గిరగా కూర్చొని చేయి పట్టుకొనెను.



రామ - నన్ను ముట్టుకోవద్దు.

శశి - ఎందుకు?

రామ- ఇంకోరిదానవు..

శశి - నా మాటల మీద నీకు నమ్మకంలేదు. నాకు సుందరరావుగారి మీద ఏమీ ప్రేమలేదు. నువ్వు నా మీద ప్రేమ ఉన్నదని చెప్పిన తరువాత నిజంగా నీ మీద ప్రేమ వచ్చింది. ఇన్నాళ్ళూ నిన్నే తలచుకుంటున్నాను. అతని చేతిని తీసుకొని గట్టిగా ముద్దు పెట్టుకొన్నది. అతడు చెయ్యి లాగుకొనెను.

రామ - అది నిజమే, కాని నన్ను పెళ్ళి చేసుకునేవరకు నాదానివెట్లా అవుతావు?

శశి - నీ మీదనేగా నా ప్రేమ? పెళ్ళి నీ యిష్టం ఇప్పుడు చేసుకో నేను నీదాన్ని కాదూ?

రామ - మరి యింక నువ్వు సుందరరావుతో స్నేహముగా పూర్వమువలె ఉండకూడదు.

శశి - ఉండను.

రామ - అతని దగ్గిర నుంచి వొచ్చెయ్యాలి.

శశి - మరి ఇప్పుడు రానా? పద. మరిచిపోయినా. ఆయునతో చెప్తానన్నాను. ఇవాళ చెప్పి రేపు వస్తాను. సరేనా.

రామ - సరే, మరి నువ్వు పెళ్ళి అయిన తరువాత వదలి వెళ్ళకూడదు.

శశి - రామూ, నన్ను నువ్వు అర్థం చేసుకోవటంలేదు, నిన్ను వదలడం నాకు ఇష్టమనుకున్నావా నా మాటలని బట్టి? ఎప్పుడూ నిన్నే సంతోషపెట్టడానికి ఈ దేహం, ఈ జీవితం ఇచ్చేస్తాను. ఒకవేళ ప్రేమ పోతుందేమో అన్నాను కాని, నీ మీద నాకు పోతుందా? ఇట్లా చూడు, నా కళ్ళల్లో అబద్ధం కనబడుతోందేమో?

అని రామారావు కంఠమును పట్టిలాగి అతని ముఖమును తన ముఖము వైపు త్రిప్పుకొనెను. ఇంక రామారావాగలేక పోయెను. ఆ మెరయు కండ్లు, ఆ మెత్తని తడి ఎర్రని పెదవులు, మృదుదేహము చూచి అతడు వడలు మరచెను. ఆమెను చెంపపై ముద్దు పెట్టుకొనెను.

రామ - శశిరేఖా, ఈ నిముషము నుండి ఈశ్వరుని ముందు నువ్వు నాదానివి.

శశిరేఖ లోపలికి వెళ్ళెను. ఆమె యందొక నూతన యుత్సాహమంకు
లోకమంతయు సౌందర్య పూరితముగ, ఆనందమయముగ కన్పట్టెను.

ఆ యిల్లు, తోట, పటములు, బల్లలు అన్నియును క్రొత్త రంగును
దేహమందు రక్తము పొంగి, ప్రవహించుచుండెను. నూతనోత్సాహ
ఒకచోట నిలువనీయుట లేదు. ఎంతో జాగ్రత్తతో దుస్తులు వేసి మిగుల
కనబడు చుండెను. ఆ రాత్రి సుందరరావాలస్యముగా వొచ్చినాడు. ఆమె
నేర్చుకొన్న కొంచెమూ వాయించుటకు రాక బాధపడుచున్నది. సుంద
చూచి ఫిడేలు అవతల పారవేసి "ఈ జన్మములో నాకు రాదు. ఎందుకు
మీరు వాయించండి వింటాను" అన్నది. ఆమె ఇష్టము అతనికి ఆజ్ఞ
వెంటనే వాయించెను.

శశి - చాలా బాగున్నది. ఎట్లా నేర్చుకున్నారు ఇట్లా? వెన్నెల
వచ్చింది కొంచెముసేపు తిరుగుతాను.

సుంద - నిద్ర వస్తోంది. రావూ?

శశి - ఈవాళ నేనిక్కడ నిద్రపోతాను. నా పక్క ఇదిగో.

సుంద - అదేమిటి?

శశి - ఏం లేదు. చెపుతాను రండి.

ఇద్దరూ వెన్నెలలోకి వెళ్ళిరి.

శశి - రామారావుగారు తనని పెళ్ళి చేసుకోమని అడిగినారు నన్ను

సుంద - పెళ్ళి చేసుకోమనా?

శశి - అవును.

సుంద - నువ్వేమన్నావు?

శశి - చేసుకొంటానన్నాను.

సుంద - అతని మీద నీకు ప్రేమ ఉన్నదా?

శశి - ఉన్నది.

సుంద - నా మీద కంటేనా?

శశి - ఆ.

సుంద - ఎప్పుడు?



శశి - రేపో, ఎల్లుండో వెడతాను.

సుంద - ఎక్కడికి?

శశి - నాకు తెలీదు. రామారావుగారు ఎక్కడికి తీసుకువెడితే అక్కడికి.

సుంద - నిశ్చయించుకొన్నావా? నేనేమి చెప్పినా లాభం లేదా ?

శశి - లేదు.

సుందరరావు మాట్లాడక లోపలికి పోయెను. మరునాడు మధ్యాహ్నము రామారావు వచ్చెను.

రామ - సుందరరావుతో చెప్పినావా ?

శశి - చెప్పినాను.

రామ - ఎప్పుడు వస్తావు ?

శశి - నీ యిష్టము.

రామ - మన పెళ్ళి విషయమై ప్రకటించమని వ్రాసినాను. ఇల్లు మాట్లాడినాను. నీవు ఈ పదిహేను, ఇరవయి రోజులూ ఉండడానికి.

శశి - వేరే ఇల్లెందుకు?

రామ - నువ్వు వుండడానికి.

శశి - మీ ఇంట్లోనే ఉంటాను అందాకాను.

రామ - అది మంచిదికాదు. ప్రజలు తప్పు అభిప్రాయపడుతారు.

శశి - వాళ్ళు ఏ అభిప్రాయపడితేనేం? కాని అసలు తప్పేమిటి?

రామ - అసలు తప్పులేదు. కాని అది మంచిది కాదు.

శశి - నాకర్థము కావటంలేదు. నన్ను ఒక్కదాన్ని వేరే ఎందుకేం ఉంచడం?

రామ - పోనీ, నా యిష్టమని వప్పుకోరాదూ?

శశి - నాకు ఒక్కదాన్నీ వుండడం బాగుండదు. ఏదో భయం వేస్తుంది. నన్ను మీ యింటికే తీసుకు వెళ్ళరాదూ?

రామ - అది ధర్మ విరుద్ధము. ఇన్నాళ్ళు ఇతని ఇంట్లోవుండి ఇప్పుడు నా యింటికి వస్తే ఏమంటారు?

శశి - మీ ధర్మాలు నాకు బోధపడడంలేదు. నా మాట విని మీ యుక్తి ఉండనియ్యి. నేను వంటరిగా బతకలేను. నిన్ను చూస్తో ఉండేట్టు దగ్గరే ఉ నీవు ఎట్లా ఉండమంటే అట్లా వుంటాను. ఈ కోర్కి చెల్లించవూ? ఇంతేనా ప్ర

రామ - నాకిష్టము లేదు. విరుద్ధాభిప్రాయాలు బయలుదేరుతాయి.

శశి - ప్రజల అభిప్రాయాలంటే నీకంత భయమేంటి? మళ్ళీ లక్ష్యమూ లేదంటావు. బ్రహ్మసమాజము, స్వేచ్ఛ అంటావు. పోనీ, చెప్పినా ఇష్టం.

రామ - మరి యిప్పుడు వస్తావా?

శశి - అంతా సిద్ధంగా ఉంది.

రామారావు బయటకు వెళ్ళెను. శశిరేఖ సామాను సర్దుచుండెను. ఇం కాంభొట్లు వచ్చెను.

కాం - మళ్ళీ ఎక్కడికో ప్రయాణమవుతున్నారే?

శశి - మిమ్మల్ని యింట్లో కెవరు రమ్మన్నారు?

కాం - మళ్ళీ ఎక్కడికో వెడుతున్నారు. సుందరరావు లేనప్పుడు ఆ వచ్చిందాకా వెళ్ళడానికి వీల్లేదు.

శశి - మీరెవరు చెప్పడానికి, ముందు బయటికి నడవండి.

రామారావు బయటనుండి యీ మాటలు వినుచునే యుండెను.

కాం - చేసుకొన్న పెనిమిటి దగ్గరనుంచి రెండోమాటు మళ్ళీ లేచిపో వొద్దంటే నువ్వెవరంటావేం?

శశి - నువ్వు బయటికి వెడతావా లేదా?

కాం - ఈ ఆటలు నా దగ్గర కాదు సాగేది. ఇక్కణ్ణుంచి కదులు చెప్తా మరీ, మించిపోతోంది వ్యాపారం. మతం, కులం, పేరూ, ప్రతిష్టా ఏమీలేకు సంగతి చూసుకుంటే నీకు సిగ్గెయ్యటం లేదూ ?

అటు తరువాత కాంభొట్లు మాటాడలేదు. వెనకనుంచి ఎవరో మెడపట్టి గిరుక్కున తిప్పినారు. తిరిగి చూచునప్పటికి రామారావు. అంత పెద్ద స్వరూప



కండ్లెర్రబారి, ముఖము తీండ్రించి, చేతిలో గుర్రపు బండివాని కొరడా పట్టుకొని యుచున్నప్పటికి, కాంభొట్లు ప్రాణములు నిలువునను పోయెను.

రామ - నువ్వెవరు?

కాం - నే....ను....కాం.....భొ........ట్లు,

రామ - ఇక్కడేం చేస్తున్నావు ?

కాం - ఏదో.....అను....మానం....తోచి....

రామ - నీ కెందుకు ?

కాం - ఏం..... లేదు......సుందర...

రామ - సుందర్రావుగారు నిన్ను ఇవన్నీ చూడమన్నారా .

కాం - లే.....దు.....కాని

వీని సంగతి రామారా విదివరకే విని యుండెను.

రామ - అయితే ఎందుకొచ్చా విక్కడికి ?

కాం - సంఘం.......పాడు.....అవు.....తోందని......

ఫెళ్ళుమని కొరడాదెబ్బ మోగెను. పావుగంట వరకు అదే దెబ్బల చప్పుడు. చివరకు కాలుతో వానిని వీధిలోనికి తన్ని "నీకక్కరలేని వ్యవహారాల్లో జోక్యం కలుగ చేసుకుంటే నీ సంఘానికీ నీకూ కూడా ఇంతే" అని గెంటెను. కాంభొట్లు పదిహేను దినముల వరకును బయటకు రాలేదు.

శశిరేఖ అద్భుతముగా చూచెను. ఎంత కోపము! ఎంత రోషము! ఎంత బలము! అదంతయు తనను అతడు నిర్లక్ష్యము చేసినందుకే? శశిరేఖ వచ్చి రామారావును కౌగలించుకొనెను.

శశి - అబ్బా ! ఎంత కోపం ఆ మొహంలో ? నా మీద అంత కోపం వస్తే నేనుండలేను. ఏదీ ఆ చెయ్యి ? ఎంతలావు ఒక్క గుద్దుకి చచ్చిపోతాను నన్ను చంపకేం.

రామ - ఛీ, వూరుకో, ఇట్లాటి మాటలంటావు !

...........................

సాయంత్రము సుందరరావు వచ్చునప్పటికి గృహము శూన్యమయియుండెను.

# 13

ప్రతి సాయంత్ర మారుగంటలకు రామారావు వచ్చి శశిరేఖను నది ఒ
షికారు తీసుకొని వెళ్ళుచుండెను. వారము దినములు గడచినవి. ఒకనాటి సా
కాలము శశిరేఖయు రామారావును నది వద్దన ఎత్తయిన రాయిపై కూ
యుండిరి. పూర్ణచంద్రుని కిరణముల క్రింద వరదలలో నున్న ఆ నది
పొంగుచుండెను. నీళ్ళపై గాలి శ్రుతివైచుచు వీచుచుండెను. నదిపై చంద్ర కి
ములుపడి తళతళ మెరయుచుండెను. ఆవలిగట్టు నుండి నెమలి కూసెను.
నక్కలు పరువెత్తు చుండెను. శశిరేఖ రామారావు దగ్గరగా జరిగినది.

రామ - చలి వేస్తోందా?

శశి - కొంచెంగా.

రామ - పొద్దుపోయింది. వెడదాము.

శశి - అప్పుడే? ఇట్లాంటి రాత్రా? వద్దు, ఎంత బావుంది? అబ్బా!
బావుంది! నీకు బావుండలేదూ?

రామ - భూమిమీద ఉన్నామో, స్వర్గంలో ఉన్నామో సందేహంగా

శశి - ఇదివరకెప్పుడూ ఇంత అందమయిన చోటికి వెళ్ళలేదూ?

రామ - ఇంతకంటే అందమైన చోట్లు చూశాను. స్కాట్లండులో కొండల
చెరువుల వద్దన, అల్ప్సు హిమవచ్ఛిఖరంపైన, నేపిల్సు నగరమున
రోడ్లదగ్గిర, ఇంతకన్న "అందమైన ప్రదేశాల్ని చూశాను కాని ఆ అందాన్ని
చేసి అర్థమిచ్చే వారు ఎవరూ లేకపోయినారు ?

శశి - నీ స్నేహితులెవరూ లేరూ?

రామ - ఉన్నారు కాని, ఇంత అందమయినవాళ్ళూ, నా మీద ఇంత
ఉన్నవాళ్ళూ లేరు.

అని ఆమె చెయ్యి పట్టుకొనెను.

శశి - మరి ఇంగ్లండులో స్త్రీలు స్వేచ్ఛగా వుంటే వాళ్ళు రారు
వాళ్ళనెవళ్ళనీ ప్రేమించలేదూ నువ్వు?

రామ - ఉండేవాళ్ళు. నా తోటి ఆడ డాక్టర్లు ఎంతో చనువుగా వుండే
కాని హృదయంలో మండుతూ ఉండే రూపముంటే వాళ్ళ స్నేహమేమి రుచి



శశి - ఏం? వాళ్ళతో స్నేహంగా వుండక పోయినావూ? నేను లేనుగా అప్పుడు? ఆ ఆనందం మాత్రం ఎందుకు పోగొట్టుకున్నావో తెలీడం లేదు.

రామ - నా స్వభావం అట్లాంటిది, కాదు.

శశి - నన్ను తప్ప ఎవ్వరినీ ప్రేమించే స్వభావం కాదుగావును!

రామ - అవును.

శశి - చాలా బాగుంది? ఆహా యీ గాలి యెంత బాగుంది! ఆ నీళ్ళ అలలు చూడు. ఎంత ఆనందంగా వుంటాయో!

రామ - ఒకదానిపైన ఒకదానికి ప్రేమలాగు. కౌగలించుకుంటున్నట్టుం టాయి. లోకమంతా ప్రేమమయం! ఈశ్వరుడి ప్రేమ యిన్ని రూపాల్ని పొందుతోంది.

శశి - కాని యీశ్వర భక్తులు ప్రేమ ననుభవించరేం?

రామ - వాళ్ళ కీశ్వర ప్రేమ చాలును.

శశి - ఇట్లాంటి ఆనందం అనుభవించే ప్రేమే ప్రేమ. ఇంకేం కావాలి చెప్పు? చుట్టూ వెన్నెల, చల్లని గాలి, ముందు యీ నీళ్ళు, ప్రక్కన నీవు! ఇట్లాగే నా జన్మమంతా వుండమన్నా వుంటాను.

రామ - నిజంగానే వుంటావా? మరి యింకేం మార్పు కావాలనిపించదు కదా ?

శశిరేఖ అతని రొమ్ముపై తలపెట్టుకొనెను.

శశి - ఇక్కడ యీ మహా వక్షస్థలముమీద తల పెట్టుకుంటే ఇంక భయం, సందేహం, వుండదుకదా? యింకనేం కావాలి?

రామ - (ఆమె తలను దువ్వుచు) ఎంతకాలానికి కనుక్కున్నాను నిన్ను? ఇట్లాంటి సౌఖ్యం దొరుకుతుందనుకోలేదు.

శశి - ఎక్కణ్ణించి వచ్చావు నాకోసం? సముద్రాలు దాటి, దేశాలు దాటి, వెతుక్కుంటో, కథలోని రాజు కొడుకులాగ వచ్చావా? ఇదంతా కలలాగే వుంది.

రామ - ఆహా ! ఎట్లాంటి నిమిషాలివి ! ఇంత హాయిగా దేవతలన్నా ఉంటారో లేదో?

శశి - ఈ రాత్రి అసలు ఇంటికి వెళ్ళొద్దు.

రామ - సరేలే.

శశి - నాకు వంటరిగా వుంటుంది. ఏదో భయం వేస్తోంది. ఇక యింటికి వెళ్ళను. నీ యింటికి తీసుకెళ్ళవూ ?

రామ - వద్దు.

శశి - నా మాట వినవూ ? నాకెంత కష్టంగా ఉందో తెలిస్తే ఇట్లా అంట నిజంగా చెప్తూతున్నా. రానీవూ? బతిమాలుకుంటా.

రామ - అట్లా బతిమాలకు. వొద్దు. నా సంగతి నీకు తెలీదు.

శశి - (అతని గడ్డము పట్టుకొని) నా కన్నానా నీకు ప్రజలు? మొ వాళ్ళకేం తెలుసు? రానీవూ ? రానీవూ ? ఒంటరిగా ఏం తోచదు.

రామ - ఇంక పదిరోజులేగా? నా మాట విని అక్కడే వుండు.

అని లేచి దూరముగా కూర్చుండెను.

శశి - ఎందుకు దూరంగా వెళ్ళావు? కోపమా?

రామ - కాదు. అట్లా బాగుండలేదు.

శశి - ఏం. నే దగ్గిరుంటే బావుండలేదూ?

రామ - ఉండవలసిన దానికంటే బాగుంది. ఇక్కడే వుండనీ!

శశిరేఖకు అతని మాటలు అర్థము కాలేదు. తానతని దగ్గరకు వెళ్ళి చే కూర్చొండెను.

శశి - ఇక్కడ కూడా ఒంటరిగా వదుల్తావా?

రామ - పెళ్ళయ్యేదాకానేగా యీ వంటరితనం!

శశి - అందాకా యీ రోజుల సంతోషం మాత్రం ఎందుకు వృధా చెయ్య

నాకు చలిగా వుంది దగ్గిర కూచుంటాను.

ఇట్టి సౌఖ్యము ననుభవించనివారికి శశిరేఖ యీ సమయముల మహదానందమర్థముకాదు. రామారావు ఎవరు వత్తురో, ఎవరు చూతురో, భయములో మునిగియుండెను. కాని శశిరేఖ అమితానందమున సోల చుండెను. పూర్ణముగ విచ్చిన కలువవంటి ఆమె ముఖమును ఆ కాంతియు మెరయు ఆమె కన్నులను, గాలినంతయును త్రావుచున్నటులనుండు ఆ పె



మమును చూచి, ఆ చూపులను, ఆ వాక్కులను, ఆ ప్రేమను ఆతదాశ్చర్యముతో గ్రోలుచుండెను. పూవు నుండి పూవునకు బోయి తేనెగ్రోలు తేనెటీగవలె ఆనంద పెచటనున్న ఆమె అనుభవింప గోరును. నీతి, దుర్నీతి అను పదముగామె కర్థములేని మాటలు.

... .... ... ... ... ... .... .... ....

మరునాడు సాయంత్రము ఆరు గంటలకు శశిరేఖ తన గదిలో కూర్చుని యుండెను. ఇంకా రామారావు రాలేదు. ఎందుకింత ఆలస్యమయినది? వృధాగ సాయంకాలము గడచిపోవుచున్నది. రోజంతయు నేమియుతోచక ఆ గదిలోనే పడి యుండెనుకదా? ఇంకిప్పుడైనను రాకూడదూ? ఎందుకింత ఆలస్యము? తన కతడెప్పుడు వచ్చునా యని యుండెనే, తనపై అతని ప్రేమయున్న రాడా? అదిగాక తనిక్కడెందు కుంచవలెను? తన ఇంటిలోనే వుండనీయరాదా? ఇంత పిరికితనమా! ఇంకముందు ఎవరైన ఏమయిన ననినచో తన్ను వదలివేయునేమో? ఇట్టివాడు తనను గురించి రేపటి నుండి లోకము పలుకు నిందా వాక్యములను లక్ష్యపెట్టడా? తనకన్న లోకాభిప్రాయము మీదనేనా ప్రేమ? ఇంతకు తనపై అతనికి ప్రేమ వున్నదా? అతడు తనకంత దూరదూరముగా ఎందుకుండెను? ప్రేమ కలవాడైన ప్రేమ చూపడా? ఉన్నదని చెప్పును. అన్నియు పెండ్లి అయిన తరువాత అనును. కాని ప్రేమయే నిజముగా నున్నచో తన్నెడ బాసి ఇట్లుండగలడా? లేకపోయిన తానిట్టి చెడు జీవితము గడుపుచున్నానని, జాలి తలచి ఈ విధముగా తన్నుద్ధరింప తలచెనేమో? ఒక పాపపు జీవితమును పవిత్రవం తము చేయుచున్నానని కాబోలతని తలపు! ఈ వివాహమను మహా స్వార్థత్యాగమును చేయుచున్నాడు కాబోలు తన్నుద్ధరించుటకు! ఈ తలపుతో శశిరేఖకు కోపము కలిగెను.

తనపై జాలి ఎందుకు? జాలివలననా ఈ పెండ్లి? దానికి తాను లోబడుటా? అతడు వచ్చుట తోడనే అడగవలెను. నిజము చెప్పించవలెను.

ఆరున్నర కొట్టినది. దీపము వెలిగించలేదు. చీకట్లలముకొనుచుండెను. ఇంకను రాలేదు. ఇదేనా ప్రేమ? అదుగో అడుగుల చప్పుడు. వెంటనే కోపమంతయు మరచెను. అతను తలుపు తెరచి లోపలకు వచ్చి తలుపు గడియ వేసెను. శశిరేఖ అతన్ని కౌగిలించుకొని "చివరకు వచ్చినావా" అనెను.

"నా కోసం ఎదురు చూస్తున్నావా. శశీ"

ఎవరది? సుందరరావు! శశిరేఖ వళ్ళు జల్లుమనెను. అతనిని కొ
దూరముగ పోయెను.

సుంద - ఎందుకట్లా దూరంగా వెడతావు? నీతో మాట్లాడాలని వ
శశి - ఏం మాట్లాడ్డానికి?

సుంద - చెపుతానురా ఇట్లా కూచో.

శశి - దీపం వెలిగిస్తాను.

సుంద - అక్కర్లేదు. దగ్గిరగా రా. మాట్లాడుతాను. మొహం ఏదీ చూ
ఎందుకంత భయపడతావు? నేనేగా? రెండు రోజుల్లో ఇంత కొత్తా!

శశి - నన్ను ముట్టుకోవద్దు. దూరంగా వుండండి.

సుంద - ఉహూ! ఇంతలో పాతివ్రత్యం వచ్చింది కాబోలు? నన్ను పిచ్చి
చేసి వెడదామనుకున్నావా? అంత సులభంగా వదిలేవాణ్ణి కాను నేను. ఇంటికి

శశి - ఇదేమిటి? నేను రాను. మీరెవరు నన్ను రమ్మనడానికి.

సుంద - నే నెవరినా? మూడేళ్ళు నా దగ్గరుండి, నన్ను నా వళ్ళు మ
ఎవరో ఒక రీవాళ నిన్ను పెళ్ళి చేసుకుంటామన్నారని, ఇట్లా వెడతావా? వ
నేను వప్పుకోను.

శశి - ఒప్పుకోక ఏం చేస్తారు?

సుంద - ఏం చేస్తానా?

శశి - అవును. మీ పెత్తనం ఏమిటి?

సుంద - ఆఖరిసారి అడుగుతున్నాను. వస్తావా రావా?

శశి - రాను.

శశిరేఖకు భయము వేయుచుండెను. ఇంకను రామారావు రాడేమి? సుం
రావు మిక్కిలి కోపముతో మాట్లాడుచుండెను. చీకటిలో అతని ముఖము కన
లేదు గాని అతని వడలు వణకుచున్నట్లుండెను. ఊపిరి వడిగా వచ్చుచుం
మాటలలో రోషము కాన్పించుచుండెను.

సుంద - ఇంకొకడు నిన్ను ముట్టుకుంటాడనే సంగతి తలుచుకొని
బతగ్గలనా? ఈవాళ నా మనస్సు మనస్సుగాలేదు. నా మాట విను. ఏం చే
చేస్తాను. వస్తావా రావా?



శశి - నేను బెదురుతా ననుకున్నారా? ఏం చేస్తారో చెయ్యండి. నేను
రాను.

శశిరేఖ లేచి నిలుచుచుండెను. సుందరరావు లేచి తటాలున చీకటిలో
ఆమెను గట్టిగా కౌగిలించుకొనెను. శశిరేఖ పెనుగులాడుచుండెను.

సుంద - రావూ? నా ప్రేమ మరచిపోయినావూ? రావూ?

శశి - రానంటే?

సుంద - రావూ? రాకపోతే చంపేస్తా నిన్ను. ఇక్కడ మాత్రం వదలిపెట్టను.

శశి - భయమూ? చంపండి. కాని వస్తానన్నమాట అబద్ధం. నేను
భయపడేదాన్ని కాదని ఇంకా తెలీలేదూ?

సుంద - ఏదీ ఆ మొహం చూణ్ణీ ఒక్కసారి. ఆఖరుసారి ముద్దుపెట్టుకో.
ఓహో యీ కంఠము! ఎన్నిసార్లు ముద్దుపెట్టుకున్నాను దీన్ని! ఎంత అందంగా
వుంది! యెంత నలిపినా యింకా అందం యెక్కువ అయ్యేది. ఏదీ? ఆ వక్షమును
ఒకసారి కళ్ళతో చూడనీ, చేతులు తియ్యి, ఆఖరుసారి.... యింకొకళ్ళ
కిక్కడనిస్తానా? ఆ కృష్ణుడు తాకినందుకే వాడు బతకకూడదనుకున్నాను.
ఏదీ....యెంత బావుందో, కదలకు.....ఒక్కసారి అదుముకోనీ.........ఆఖరుసారి,
శశీ నా శశీ నా ముద్దుల శశీ, నా ఐశ్వర్యం! నా ప్రాణము, నా మృత్యువు, నా
ఉద్యం. దా శశీ, చూడనీ తీసెయ్యి ఆఖరుసారి. ఇంక మనుష్యుడి కళ్ళపడవు.
చేతులే తాకవు యిక్కడ యింక అగ్నికే ప్రాప్తి, ఆఖరుసారి పడుకోబెట్టి ముద్దులు
పెట్టుకొని, నా చేతులతోనే నిప్పు వెలిగిస్తాను........తరువాత నేనేమైపోతేనేం?
.....ఏదీ........

సుందరరావు వూపిరి అతి త్వరితముగా వేడిగా ఆమె వొళ్ళంతయూ తాకు
చున్నది. వడలు వొణుకుచున్నది. వేడిగానున్నది. శశిరేఖకు భయముతో యేమి
యును తోచుటలేదు. పెనుగులాడెను. కాని అతడు బలవంతుడు. అరిచెను.
అతని చేతులు ఆమె కంఠమును బిగించెను. భయము కనబరచుటకు యిష్టములేదు.
రామారావు రాకూడదా? రాడేమి? తననిట్లు ఆపదలకు, కాఠిన్యమునకు వప్పచెప్పి,
తానెంత ప్రార్థించినను, కరుణ చూపని ఆ రామారావునకు తనమీద యేమి ప్రేమ?
తను జీవించి మాత్రమేమి ప్రయోజనమో? తానెవరిని ప్రేమించెనో ఆ పురుషులకు
స్వార్థపరత్వ మెక్కువ.

సుంద – యీ కంఠము, యీ చిన్న కంఠము, యీ ముద్దు కంఠ

కంఠమును వొత్తుచున్నాడు. కళ్ళు తిరుగుచున్నవి. చీకటిలో చీకటి బిగించుకొని పోవుచున్నవి. సుందరరావు ఆమె కంఠము కొంచెము "యిప్పుడైనా వొప్పుకోవూ?"

శశి – "ఛీ! రాను పో" అని బిగ్గరగా అరిచినది.

సుందరరావు మళ్ళీ ఆమె కంఠమును గట్టిగా బిగించి, తన పెదవు ఆమె పెదవులను మూసెను.

"శశి, శశీ, వొప్పుకో, నిన్ను చంపలేను, యీ హృదయం ఆగుతు శశీ.......

వూపిరాడుటలేదు. బాధ, చీకటి మైకము.

..............................

శశిరేఖ కన్నులు విప్పి చూచునప్పటికి సుందరరావు చాలా దుఃఖ భయముతో తనవంక చూచుచుండెను. దీపము వెలుగుచున్నది.

సుంద – నా శశీ, శశీ, బతికివున్నావా? నిన్నేమీ చెయ్యలేను. ఇంత వుంటావనుకోలేదు. రోషము నా మనస్సును నాదికాకుండా చేసింది. నన్ను క్ష గలవా? చంపెయ్యి. ఆ చేతులతోనే చంపెయ్యి. శశీ, నా దుఃఖము నీ కావటంలేదు. ఇంటికివెళ్ళి చూసేటప్పటికి నువ్వు లేవు. ఇంక ఎందుకు బ్రతు అనిపించింది. ఆ రాత్రే విషము త్రాగినాను. స్మృతి తప్పినది. నిన్నటి జబ్బుగానే వున్నాను. బ్రతుకుతాననికూడా అనుకోలేదు. రామారావుగారే చ్చారు. ఆయనే బ్రతికించారు. నా శశిని లాక్కొని నన్ను బ్రతికించడమెం నా ప్రాణమే పోయిన తరవాత నే నెందుకు బ్రతికి? శశీ! ఇవాళే యింటికి నువ్వులేనిది బతకలేక నీ కోసం వచ్చాను. నా మీద జాలిలేదూ? రామారావు పోనీ నీ యిష్టము వచ్చినట్లుండు, కాని నా యింట్లో వుండు. అంతేచా

శశి – ఛీ! నే నట్లాంటి పని చెయ్యనని మీకింకా తెలీలేదూ?

సుంద – నా బాధ అట్లా అనిపిస్తోంది. నన్ను వదిలిపెడతావా! చంప రాదూ అంతకంటె? బుద్ధిహీనుణ్ణయి నీ ప్రేమను, అమూల్యమైన ప్రే



చేతులారా చంపుకున్నాను. నా దురదృష్టమెవడికీలేదు. నన్ను ప్రేమించవద్దులే. నీ మొహం కనబడనీ చాలు. నన్ను వదలకు, శశీ, నేను బతకలేను.

శశి – మరేమి చెయ్యమంటారు? అప్పుడెందు కూరుకున్నారు? ఆయనకి వాగ్దత్తం ఇవ్వలేదూ నేనూ?

సుంద – మరి నన్నేం చెయ్యదలచుకున్నావు? నిన్నింట్లో వంటరిగా విడిచిన వాడికి ఆయనకి నీ మీద ప్రేమ యేమిటి? ఎందరు దొరసానులైనారో! ఈ రోజుకి నువ్వు దొరికినా వాయనికి,

శశి – ఆయన్నేమీ అనవద్దు. ఆయన సంగతి నాకు తెలుసును. మొన్ననే యీ మాటలు చెప్పకపోయినారూ? ఉండేదాన్నేమో? నేను మీ కక్కర్లేదు కదా?– నేను వెడితేనే మీకు సంతోషంగా వుంటుందనుకున్నాను.

సుంద – నిజంగా నన్నిట్లా వదుల్తావనుకోలేదు. నిజంగా ప్రేమవుంటే నిన్నిట్లా విడిచి వుంటాడూ? నేనేదో చెడ్డవాణ్ణని నా నుండి నిన్ను తప్పిద్దామనే ఆయన వూహ. వాళ్ళనెరగవుగానీ ఇంకా నువ్వు. లోక మరమ్మత్తుగాళ్ళు వాళ్ళు.

శశి – మఱి ఇంక ఆయన్ని ఎట్లా చూడను?

సుంద – ఆయన్ని చూడనేవద్దు. ఈ రాత్రే చెన్నపట్నం వెళదాము. నాకు పెళ్ళొద్దు ఏమీవద్దు. నీ సేవచేస్తూ పడివుంటాను. నీకు ఏ బెంగా వుండదు. కావలిస్తే నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను. నా డబ్బంతా నీకే రాసిస్తాను.

శశి – అవి నాకేం అక్కర్లేదు. మీ మీద నాకు ప్రేమలేదు.

సుంద – నన్ను నువ్వు ప్రేమించనక్కఱలేదు. అడగనే అడగను. నీ యిష్టం. నా దగ్గిర వుండు చాలు.

శశి – ఆయన్ని మోసపుచ్చటం ధర్మమేనా?

సుంద – నా సంగతి విచారించావా? నిన్న వచ్చిన ఆయన్ని వదలడమే ధర్మం కాకపోతే మూడేళ్ళనించీ భార్యకంటే ఎక్కువగావుండి నా జీవితమంతా తీసుకొని నన్ను వదలడం యిప్పుడు ధర్మమేనా?

శశిరేఖ ఆలోచించుచుండెను. సుందరరావామె నడుముపై చెయ్యి వేసి దగ్గరకు తీసుకొనెను.

శశి – నేను రాను వదలండి. నన్ను ముట్టుకోకండి. మిమ్మల్ని నమ్మిం
మీతో వుండడం అసహ్యము.

. సుంద – ఇంక నిన్నేమన్నా చేస్తే వెళ్ళిపో, అంతా మరిచిపోయినావా?
పోగొట్టుకుంటాను నిన్ను తలచుకుంటో. నిన్ను ప్రేమించినందుకు ఫలితమా

అతని కండ్లనుండి ఆమెపై వేడినీళ్ళు పడెను.

సుంద – శశీ! నన్ను వదులుతావా? మనము గడపిన కష్ట సుఖాలు
చావా? మన్ని అవి, శాశ్వతంగా కట్టి వెయ్యలేదూ? ఈ దౌర్భాగ్యుణ్ణి చంపు
రైలు టైమయింది. వస్తేరా లేకపోతే యిక్కడే చచ్చిపోతాను. నీ యిష్టం త్వరగా

శశిరేఖ కండ్ల వెంబడి నీరు కారుచుండెను. అతడు ఆమె పాదము
పట్టుకొని ముద్దు పెట్టుకొని తన కన్నీళ్ళతో తడిపెను.

సుంద – రా! రా! నీకు కష్టము కలిగిస్తే వెళ్ళిపో, వస్తావుకదూ?
సిద్ధంగా వుంది.

శశిరేఖ అతని మెడపై చెయ్యివేసెను.

..................................................................................

ఆ సాయంత్రమే రామారావు ఇంటివద్ద ఆలోచించుకొనుచు కూ
యుండెను. ఇదేమిటీ? తనకే అంత బలహీనమా? పెండ్లిగాకముందే
కాంక్షలా? పరస్త్రీనా అంత ప్రేమతో రాత్రి తాకుట? వివాహము కానిది
తన సోదరి. ఛీ! ఛీ! ఎట్టి దుర్మార్గము! శశిరేఖను చూచిన తోడనే తన మ
ప్రలోభమునకు లోనగు చుండెను. ఆమెనంత తరుచుగా చూడగూడదు.
మూడురోజుల వరకామె యింటికి పోలేదు. రెండవనాటికి సుందరరావు రాజీనా
వచ్చెను. పాపమాతడు విచారముచే పనిమానుకొనెను గాబోలు! అతనికి
బాధ కల్గించెనోకదా! మూడవవాడు శశిరేఖ నుండి వుత్తరము వచ్చెను.

క్షమించు. సుందరరావును వదలలేను. నీకు వ్రాయుటకు సిగ్గుచు
నన్ను మరచిపో.





# 14

పట్టమున శశిరేఖయు సుందరరావును ఆరునెలలు గడిపిరి. సుందరరావు
కు ప్రతి సౌఖ్యమును కలిగించుచు ఆమె ఆనందమునే తన ఆనందముగా
కొని మిక్కిలి ప్రేమతో ప్రవర్తించెను. శశిరేఖకీతనిపై ప్రేమలేదు. కాని,
తవరకు భరించి యూరకుండెను. ఒక పెద్ద యింట నివాసమును, గుర్రపు
షికార్లును, నాటకములు దినమంతయు నాక్రమించుకొనుచుండెను. ఆనం
నెచటనైన పొందగల శశిరేఖకు ఇదంతయు నొక కలవలె జరిగిపోయెను.

కాని కొద్ది దినములలో సుందరరావు పూర్వపు క్రూరత్వ మారంభించెను.
కన్న నెక్కువగ ఆమెను బాధపెట్టుచుండెను. ఈ కష్టములలో ఈ బాధలో
కు ఏ మాత్రము నతనితో నుండుట కిష్టములేదు. రామారావును వదలి
నమ్మి ఎందుకు వచ్చితినా యను మహా విచార మామెను చుట్టుకొనెను.

పురుషునికి, ప్రేమ "ఆట"గాని స్త్రీకి ప్రేమయే జీవనము. ప్రేమించెనా స్త్రీ
ంచువానికిని తనకును శాశ్వతమగు బంధనము కలదని తలచును.
ములేని పురుషుని స్త్రీ తిరస్కరింపవచ్చును. కాని, తనను ప్రేమించినందులకై
యెడ ప్రేమచూపక మానదు. పురుషుని స్వభావమట్టిదికాదు. తన యిష్టము
పూర్వమునంతను మరచిపోవును. స్త్రీ యొకని ప్రేమించుచు యింకొకనితో
ము గడపగలదు. కాని. పురుషుడట్లు సులభముగ చేయజాలడు. లోక మీ
ముగ నమర్చ బడక పోయినచో సృష్టికే యాటంకము రాగలదు. సుందరరావెంత
డైనను తానింకొకని ప్రేమించుచున్నను, శశిరేఖ అతనిపై తనకు బాధ్యత
నమ్మి అతనిని వదలలేకపోయెను. పురుషుడు దాతయగుటచే యనేకులకిచ్చి
. స్త్రీ గ్రహించుటచే తనకు ప్రేమదాన మొనరించినవారి నెన్నడును
దు. అందువలననే సుందరరావు పిలచినప్పుడు ఆమె రానలేకపోయెను.

రామారావును తిరిగి తనను తీసికొమ్మని ప్రార్థించుట కామె మనసు పోయెను,
సిగ్గయ్యెను. ఏమని తిరిగి యడుగగలదు ? ఈ సుందరరావు వద్దనుండి
పోవలయుననుకొనెను. కాని ఒక్క కాసైనలేక ఆ మహాపట్టణమున ఎచటకు
గలదు? సుందరరావుననేకసార్లు తన నెచటకైనా పంపివేయమని బ్రతిమాలు

కొనెను. అతడు ప్రత్యుత్తరమైన నియ్యలేదు. అతని కోపమును భరించు...
దొరుకుదురు ఆమెకాక?

సుందరరావు మోహము పరమ నీచముగ మారుచుండెను. పతి... కామెను బానిసగా జేసికొనజూచెను. అంతకన్న ఆమెను అగౌరవించు మా... యును లేదు. తన అభిమానముననే నిర్మలత్వముచే కోల్పోయితిననుకొని... క్రూరత్వము చూపినను లేనిది, యిప్పుడతనిపై తిరుగపడెను. అసలు... అతనితో శరీర సంపర్కమునకే ఆమె వప్పుకొనలేదు. సుందరరావు కది సరి... ఆమె తనను తిరస్కరించుటతోడనే అతడు కోపమును భరింపలేదు. ఆమెకి... ఇప్పుడు దిక్కులేదని అతనికి ధైర్యమేర్పడినది.

వీధి దగ్గరగా నున్న గదిలో చిన్న దీపము వెల్గుచుండెను. ఆ గది... శశిరేఖ కూర్చుని యుండెను. తిరిగి పూర్వపు జీవనము మొదలయ్యెను. రా... తయు ప్రేమలేక, ఒక్కమాట మాట్లాడువారులేక, తన అందమును చూచి సంతో... వారు లేక, పూర్వపు సౌఖ్యముల తలచుకొని తలచుకొని యేడ్చుటయును, ... రావు హృదయ ఛేదకములగు మాటలను విని, లోలోపల కుళ్లుటయు, దిన... జరుగు చుండెను. ఆనందములేదు, ప్రేమలేదు, జీవితమున కంటూ... యుద్దేశ్యమును లేదు. ఆమెను మహా అశాంతి ఆవరించెను. ఇట్లు బ్రతుకుట... ఎట్లు బ్రతుకుటయైనను యుత్తమమే. ఒక్కగంట వడలు తెలియని ప్రేమి... ఏమైనను ఇయ్యవచ్చునుగదా! తన సౌందర్యమును గాంచి వివశుడగు పురుషు... కోరినను యివ్వదా! రోడ్డుమీద వచ్చుచు పోవుచుండువారిని, మోటారు ట్రాము... చూచియు, సంతోషించుచు నవ్వు చుండు వారియానందమున తన దుఃఖ... మరిచియు, ఆమె దినమెల్లను గడపు చుండెను.

నాల్గు దినముల నుండి నిద్రలేదు. అశాంతి యెక్కువయ్యెను. సుందరరా... నకారణముగ బాధించుచుండెను. అతని ధనమై పోజొచ్చెను. ఏదో అ... శరీరములో రోగము. మందుకండ్లతో, అలసిన దేహముతో, దిగులుపడిన ము... నామె కూర్చుని యుండెను. సుందరరావు మంచముపై పరుండియుండె

శశి - ఎందుకు భోజనం లేందే సాయంత్రమే నిద్రపోతారు? అట్లా ఎ... దీపాలకింద తిరుగుదాము రారాదూ?

సుంద - అదే పని నాకు, నిద్ర వస్తోవుంటే,



శశి - నాకేం తోచటంలేదు. ఇట్లారారూ?

సుంద - తోచకపోతే వురేసుకో, నన్ను మాట్లాడించకు.

శశి - పోనీలెండి. నేనే వెళతాను.

సుంద - ఎక్కడికి?

శశి - కొంచెంసేపు బయట తిరిగి వస్తాను.

సుంద - చీకటిపడ్డాక ఇప్పుడు బయట తిరగడమేమిటి? వెళ్ళొద్దు.

శశి - పరవాలేదు.

సుంద - పరవాలేదేంటి? వెళ్ళొద్దంటూ వుంటే.

శశి - మీరేమీ సంతోషపెట్టరు సరేకదా, నేనైనా కొంచెం సంతోషిద్దామంటే ఎందుకిట్లా అడ్డు పెడతారు?

సుంద - సంతోషం! నీకన్నీ వీధుల్లో తిరిగే సంతోషాలు కావల్సి వస్తున్నాయి. ఇంకా పొగరు తగ్గలేదు. పని పట్టిస్తా నుండు.

శశి - మీరెవరు నన్నడ్డ పెట్టడానికి?

సుందరరావు చివాలున లేచెను.

సుంద - నేనెవరినా? తెలిపించనా ఎవరినో? దిక్కులేని దౌర్భాగ్యురాలికి తిండి కూడు పడేస్తోవుంటే? నేనెవరినంటావా? ఇక్కడుండవద్దు. పో, ఎవడు పెడతాడో చూడండి.

శశి - పోనీలెండీ, పెట్టకపోతే భయమా? ఇంక మీ యింట్లో భోజనము చేసినప్పుడనండి.

సుంద - రామారావు నీ కోసం సిద్ధంగా వున్నాడని గావును నీ ధైర్యం. ఆనాడే రాజీనామా యిచ్చి పోయినాడు, గుండె పగిలి. సంతోషించు.

ఆమెకు కష్టము కలిగించి ఆమె ముఖములో దుఃఖమును చూడడము అతని కింతో యిష్టము. శశిరేఖ మాట్లాడలేదు. ఆయాసముతో సుందరరావు ప్రక్కపైపరుండి నిద్రపోయెను. శశిరేఖ అట్లే గూట్లో కూర్చునియుండెను. ఆహా! చివరకు యీ స్థితి వచ్చినదా? ధీరుడగు రామారావు హృదయము పగిల్చి తెచ్చుకొన్న సౌఖ్యము ఇదా? ఈ వేదనను అనుభవించుచు ఎన్నాళ్ళిట్లు బ్రతకవలెను! ఈ క్రూరత్వములో, యీ అంధకారములో నెన్నాళ్ళు? తన జీవితము యవ్వనమునింక పాడుచేసి కొనకూడదు.

పూర్వపు చరిత్ర యంతము జ్ఞప్తికి వచ్చెను. ఇంక నిచ్చట నిల్చుట
పెద్ద అశాంతి హృదయమున మందుచుండెను. ఏవో ఆవేశములు పొడచు
సుందరరావు తనను వెళ్ళిపొమ్మన్న మాటలు చెవుల ధ్వనించుచుండెను.
అతనివద్ద నుండుటా! పోవలెను. కాని ఎక్కడకు? ఈ మహా పట్టణమున
పోవుట? తన నగలనతడెక్కడో బ్యాంకిలో పెట్టి యుండెను. ఏమైనను
ఒక్క నిముషము నిలువకూడదు. ఏ బాధలు కలిగినను సరే, ఎట్టి
తటస్థించినను సరే, అభిమానములే తనకు? అతని కరుణపై
యుండుటా? ఇతనికి తనకు నింక యేమి సంబంధము!

సుందరరావు కళ్ళు తెరచి–"యిట్లారా" అనెను.

"ఎందుకు?"

"యెందుకేమిటి, రమ్మంటే"

"రాను. యెన్నిసార్లు చెప్పాలి?"

"వొస్తావా? రప్పించాలా!"

"రాను"

సుందరరావు లేచి ఆమెను పట్టుకుని లాగెను. ఆమె పెనుగు
అతనివద్ద సారాయికంపు కొట్టుచున్నది. ఆమెను బలవంతముగ లాగుకొని
మంచమున కడ్డముగ పడవేసి, ఆమె పెనుగుటచే విసుగుతో కామముతో
కరిచెను. ఆమె రోతపడి, బాధపడి, అతనిని ముఖముపై గుద్ది, కింద
లేచి తలుపు దగ్గరకు వెళ్ళి నిలుచున్నది.

ఎదురుగనున్న షాపులో గుత్తులు గుత్తులుగ ఎలక్ట్రికు దీపములు
చున్నవి. రంగు రంగుల చీరెలు? పట్టుబట్టలు, జరీలు మెరయుచున్నవి
రంగులు, నదినీరు, వెన్నెల, పువ్వులు, ప్రేమ, చల్లనిగాలి జ్ఞప్తికి తెచ్చినవి
ముల క్రింది సామాన్య మానవులు దేవతలవలె కనబడుచుండిరి. వీధి యంత
ప్రజలతో కిటకిటలాడుచుండెను. ఇందరు ప్రజలు ఏయే పనులుమీద పోవు
ఏయే ఆశలో వారివి! ఏయే ఆశయములో? యింటికి పోయిన
సౌఖ్యపడువారు కొందరు, అచ్చటను సౌఖ్యములేని వారు కొందరు....

ఇంతలో రెండు పెద్ద మోటార్లు చప్పుడు చేసికొనుచు మిరుమిట్లు గొ
దీపములతో ఆ షాపు ముందాగెను. దానిలో నుండి దిగి స్త్రీ పురుషులు ఆ



గలును, పిల్లలును. నవ్వుకొనుచు షాపులోనికి బోయిరి. శశిరేఖయు వీధిలోనికి వచ్చెను. మెల్లగబోయి మోటార్ల దగ్గరగ నిలువబడి దీపముల వంక ఆ షాపులోకి వెళ్ళిన వారివంక చూచుచుండెను. వారి వారి నవ్వులలో ఆ పిల్లల కేకలలో, వారి ఆనందములో అందమగు దుస్తులలో ఆమె తన దుఃఖమును పూర్ణముగ మరచెను. ఇతరుల దుఃఖమును జూచి కన్నీళ్ళు కార్చుట ప్రతివారికిని చేతనగును. కాని, ఇతరుల సౌఖ్యమును చూచి, దుఃఖమును మరచుట, శశిరేఖ వంటి యున్నత హృదయులకు గాక ఎవరికినీ సహజము కాదు. కన్నీళ్ళతో యింకను తడిగానున్న ఆమె ముఖము వికసించెను. నల్లని ఆ నేత్రములు దీపపు కాంతిలోపడి తళతళలాడుచుండెను. ఎర్రని పెదవులు కొంచెము తెరచి, ఎత్తిన కంఠముతో ఆమె బాలిక పొందు సంతోషము పొంది పరధ్యానముతో చీకటిలోకి వెళ్ళిపోయినది.

## 15

శశిరేఖకు తానెంత దూరము యెటువైపు వెళ్ళినదీ తెలీదు. ఆగునప్పటికి కాళ్ళు వొణుకుచుండెను. రోడ్డు ప్రక్కన చీకట్లో వొదిగి కూర్చున్నది. యింకేమి చెయ్యవలెను? తన గతి యేమి కావలెను? వాన కురియుట ప్రారంభించినది. చలి. లేవలేక ఆ తడిలోనే పరుండినది. రెండు గంటలకి పోలీసు గావును ఆమెను అక్కడనుండి లేచిపొమ్మనెను. కాళ్ళీడ్చుకొనుచు నడక సాగించినది. జ్వరమూ, చలీ యెక్కువైనవి. చివరికి యింక నడవలేక ఒక అరుగుపై పడుకొనెను. యింక లేవలేదు. కరుణతో నిద్ర ఆమె కన్నులను మూసినది. తెల్లవారి నౌకరొకతె వొచ్చి ఆమెను లేచిపొమ్మనెను. ఆమె లేచి అరుగుకింద కూచ్చున్నది. లేచుటకు శక్తిలేదు. లేవపోయిన కాళ్ళు వొణుకుచున్నవి. ఆకలిలేదు. కాని దాహమగు చున్నది. యెవరి నడిగినను నీళ్ళియ్యరు. ఆ యింటివారిని యీమె కులమును సందేహించి నీళ్ళియ్య లేదు. ఆమె ఆ యింటివారిని అడుగుటను విని, పాకిమనిషి కూళాయివద్దకు పోయి, నీరు తెచ్చి యిచ్చెను. కాని శశిరేఖకు ఆ నీళ్ళు తాగుటకు యిష్టములేక, కన్నీళ్ళతో వద్దని చెప్పెను,

అభిమాన మత్యధికము. ధైర్యము పోలేదు. అటు పోవుచుండిన పురుషుడొక డామెను చూచెను.

"ఇక్కడ పడుకున్నావు నువ్వెవ్వరు? నీ యిల్లెక్కడ? నీ కెవ్వరును లేరా?" అని యడిగెను.

శశిరేఖ ప్రత్యుత్తరము చెప్పలేదు.

"నీకు పెండ్లి కాలేదా? భర్తలేదా?"

శశిరేఖ తల యూగించెను.

"భర్తలేని వారికి కావలసినదే శాస్తి. ఇట్టి వారిని జాలి తలవకూ[illegible] పోయెను.

లంకణముతో జ్వరమడగినది. శశిరేఖ లేచి కూర్చుండెను [illegible] సూర్యుడు దుమ్ములో నుండి ఆమె ముఖమున ప్రకాశించుచుండెను. [illegible] ఆమె నడవ నారంభించెను. ఎక్కడకో, ఎందుకో ఆమెకు తెలియదు. చీకటి [illegible] దీపములు వెల్గించిరి. ఎదురువచ్చువారు ఆ వంక నడిచి, వెనుక తిరి[illegible] వైపు చూచుచున్నట్లా మెకు తెలియుచుండెను. లోకమంతయు నామెనే చూచు[illegible] ట్లుండెను. ముఖము వంచుకొని త్రోవకు ప్రక్కగా నడువ మొదలుపెట్టెను. [illegible] జనము తగ్గినచోట, ఆమె ఆయాసము తీర్చుకొనుటకాగెను. నలుగురు న[illegible] పోవు పురుషులు ఆమెను చూచి ఆగిరి.

"చూడరోయ్."

"ఎవరమ్మా నువ్వు?"

"బెదురు లేదోయ్."

ఒకడామెను దగ్గరగా రాసుకొని పోయెను. ఇంకొకడు చేయికి [illegible] తగిల్చెను. సిగ్గు పీకుచుండ ధైర్యము కరిగిపోవుచుండ ఆమె వడి వడిగా [illegible] కాని వారామె కడ్డము వచ్చిరి. ఒకడు వెనుకకు భుజముపై చెయ్యివై[illegible] నేదో చెప్పెను. ఆమె అతని ముఖము నొక్కచరపుచరచి ముందుకు పో[illegible] తక్కినవారు నవ్వి ఆమెకు అడ్డముగా వచ్చినిల్చిరి. ఒకడు వెనుక నుండి [illegible] ఇంకొకనిపై త్రోసెను. కోపము కండ్లనుండి మండిపడుచుండగా, చేతులు [illegible] ఆమె వారికెదురుగ నిల్చునెను. ఆ ఎర్రని ముఖమును, కండ్లను, ధైర్య[illegible] రోషమును చూచి వారు వెనుకకు తగ్గిరి. "మా వెంటరా" అని ఒకడనెను. ఇం[illegible] చీర చెరగును లాగెను. అలసియున్న శశిరేఖకు ధైర్యము చాలలేదు. [illegible] కన్నీళ్ళు కారెను. కాళ్ళు వడకెను. నీరసముచే నిలువలేకపోయెను. [illegible] కొంతకాలము నుండి ఆ ప్రక్కయింటి నీడలోనుండి చూచుచున్న ఒక పు[illegible] యీ గుంపును సమీపించెను. అతనిని చూచి, వారేమియు నెరుంగని వా[illegible]



దూరమున నిలువబడి యింకొకవైపు చూచుచుండిరి. అతడు పొడుగునా బలముగా నుండెను. ఆయన గడ్డము అప్పుడే నెరయుచుండెను. కండ్లకు సులోచనములు గలవు. నలువదియేండ్లు దాటియుండును. అతడు శశిరేఖను సమీపించెను. నిదానించి ఆమెను చూచెను. శశిరేఖయు అతని ముఖమువైపు చూచెను. అతడు తన ముఖమునుగాక, కండ్లలో నుండి ఆత్మలోనికి చూచుచున్నట్లుండెను. విశ్వాసము, శాంతి, ధైర్యము, ఆయన కళ్ళనుండి ఆమెలోకి వచ్చుచున్నట్లుండెను.

"అమ్మా, నా వెంటరా."

శశిరేఖ ఏమీయును ప్రశ్నింపలేదు. ప్రశ్నింప నవసరము లేదని యెరుంగును. అల్పులు మహాత్ముల గుర్తింపలేరు గాని, ఉదార స్వభావులు చూచుటతోడనే తమ బంధువుల నెరుంగగలరు. ఒక అరమైలు నడచి, ప్రజలెక్కువగా లేని వీధిలో, ఒక చిన్న యింటిలోనికి తీసుకొనిపోయి దీపము వెల్గించెను. ఆమె కాకాలిగా నున్నదని గ్రహించి లోపలికిపోయి ఒక రొట్టెను పళ్ళెములో నుంచి తీసుకొనివచ్చి యిచ్చెను. భోజనమైన తరువాత శశిరేఖ ఆయన తన విషయమై మాట్లాడునను కొనెను. కాని ఆయన చదువుకొనుచు కూర్చుండెను. "నిద్రవచ్చుచున్న ఆ గదిలో నిద్రింపవచ్చు" అనెను. శశిరేఖ కాశ్చర్యము గలిగెను.

శశి - నేనెవరో మీరడుగ లేదే?

పురు - ఎవరైతేనేమి?

శశి - నాకు భర్తలేదు. అది తెలిసి మధ్యాహ్నము జాలిపడి వచ్చి, ఒక ఆయన భయపడి వెళ్ళిపోయినాడు. మీరెమీ అడుగకుండా తీసుకొని వచ్చినారు. తరువాత విచారిస్తారు.

పురు - విచారింపను. అమ్మాయీ, తలపులతో బాధపడకు. నీకు విశ్రాంతి కావాలి. పడుకో.

శశి - మరి మీకు సందేహము లేదూ?

పురు - నా కేమీ లేదు. నీకు సహాయము చేయగలిగినాను. అంతే చాలు.

శశి - నాకీ సహాయం చేసినందుకు మీకేం కృతజ్ఞత చూపాలో నాకు తెలియటం లేదు.

పురు - నాకు కాదు. ఈశ్వరుడికి చూపు. ఆయన దయ లేకపోతే ఈ కొంచెము సహాయము చేసే శక్తి నాకెట్లా వచ్చేది?

గదియంతయు పరిశుభ్రముగనుండెను. ఒక బల్లపై కాగితములు రెండు మూడు కుర్చీలు, ఒక అలమారులో పది పుస్తకములు, ఒక మూల తాంబూర, ఒక చిలుక కొయ్యపై రెండు చొక్కాలు, పంచలు, ఇంతే సామా

శశి - మీరెక్కడ పడుకుంటారు?

పురు - ఇక్కడే, ఆ చాప మీద.

శశి - మీ గది తీసుకొంటున్నాను కాబోలు!

పురు - లేదు, ఎప్పుడూ నేనిక్కడే నిద్రపోవడం.

శశి - నాపైన నిష్కారణముగా యిట్లాంటి దయ చూపినవారిని నేనెు

పురు - అమ్మా, యీశ్వరుడు కృపామయుడు. అతని దయను తలచి మనము చూపే దయ సిగ్గుతో మాయమవుతుంది.

శశి - అట్లాగా ?

ఈయనను చూసినప్పటి నుండియు ఆమె హృదయమున నెన్నడెరు ఆందోళన మొకటి అంకురించెను. తాను వేనినంత అమూల్యముగ నుంచికొ అట్టి తలపులన్నియును, తన అహంభావమంతయును మంచువలె కరి చున్నట్లు తోచుచుండెను.

శశిరేఖ పరుండెను. చాలసేపటివరకు తనకు వాటిల్లిన యీ యా గురించి ఆలోచించుకొనెను. ఇక్కడ ఎంతకాల ముండగలదు? ఎక్కడికి పోగల ఈ మహాత్ముని సహాయముచే గోవిందపురము చేరవలెననియు, నచ్చటను పనిచే జీవించవచ్చుననియు ననుకొనెను. చివరకు నిదురపట్టెను. ఆమెకొ వచ్చెను. ఆకలిచే, దప్పిచే ఆ రోడ్డు పక్కనేపడి ఆమె మృతిచెందెను. ఆమె దేవలోకమునకు పోయెను. అచట దేవతలు గానము చేయుచుండిరి. ఆహా ఏ గానము? లోకములో తానెన్నడును విని యుండలేదు. శాంతినిచ్చి ఊయలయు ఊగుచున్నట్లుండెను. తటాలున మెలుకువ వచ్చెను. ఇంకను ఆ సంగీ వినవచ్చుచునేయుండెను. ఆమెకు రాత్రి జరిగిన సంగతులొక్కటొక్కటే జ్ఞాప నకు వచ్చినవి. తెల్లవారకట్ట యయియుండెను. కిటికీలో నుండి వేగుచుక్క కన్పి చున్నది. దేవతలుకారు. పక్కగదిలో నెవరో పాడుచుండిరి. ఆహా యేమి తంబుర మ్రోగుచుండెను. దాని శ్రుతికి కలిపి పాట పాడబడుచుండెను. స



జ్ఞానము విస్తారముగ లేదుగాని ఏమి మాధుర్యమాస్వరములలో! తనను రక్షించిన పురుషుని కంఠమే కాబోలును! ఏమి మార్దవము, ఏమి ప్రేమ, ఏమి కృప! ఆ పాటలను వినబడుటలేదు. భాషయైనను తన భాషయో కాదో తెలియుటలేదు. కాని ఆ రాగము చాలును, కంఠము చాలును, హృదయము కరిగిపోయెను. జీవన మంతయు తిరిగి గడచుచున్నట్లుండెను. ఏమిటీ ఆవేశము? ఏమిటీ మహా ఆందోళనము? ఎందుకో తెలియక శశిరేఖ వెక్కి వెక్కి యేడ్వదొడగెను. కన్నీళ్ళలో నుండి ఆమె జీవితము నందలి మలినత్వమంతయు, భారమంతయు, కఠినత్వ మంతయు, కడగబడుచున్న ట్లుండెను.

ఎంత యేడ్చినదో తెలియదు. ఆయన పాడుచున్నంత కాలమామె యేడ్చుచునే యుండెను. తిరిగి యెప్పుడో నిద్రపట్టెను. "అమ్మా" యని ఎవరో తలుపు తట్టిరి. శశిరేఖ లేచి చూచునప్పటికి, కిటికీనుండి ఎండ బాగుగ వచ్చుచుండెను. ఆమె లేచి తలుపు తీయుచున్నప్పటికి, అదివరకప్పుడే స్నానముచేసి, పరిశుభ్రముగా నుండిన ఆయన ముఖము నవ్వుచూ కాన్పించెను. చేతిలో నున్న నొక కొత్త చీరెయు, ఇంకను కొన్ని దుస్తులను ఆమెకిచ్చి.

"అమ్మా అటువైపు గదిలోనికి బోయి స్నానము చేయవచ్చును. నేను బయటకు పోయి వచ్చెదను.

ఆమె ఆశ్చర్యముతో ప్రత్యుత్తరము చెప్పుటకు ముందే, ఆయన వెడలిపోయెను. స్నానమామెకు చాల సత్తువనిచ్చెను. చాలకాలము నుండి ఆమె యెరగని సంతోషము వచ్చెను. భారములు, కష్టములు, అన్నియును తొలగినట్లుండెను. ఇంతలో పోస్టువాడు ఉత్తరములు తీసికొనివచ్చెను. ఆమెను చూచి అతడాశ్చర్యపడెను. ఉత్తరము లిచ్చెను. వానిపై.

"నవజీవనదాసు,
బ్రాహ్మమత ప్రచారకుడు"
అని వ్రాసియుండెను.

## 16

ఒకటిన్నర సంపత్సరము గడచినది. శశిరేఖ నవజీవనదాసు గారి యింటి నుండే యుండెను. మొదటనే ఆమె ఆయన యింటినుండి వెళ్ళెదననెను. కాని

ఆమె దేహములో స్వస్థత కలిగిన వెంటనే వెళ్ళవచ్చుననెను. ఆయనను, ఆ జీవితమును చూచిన కొలదియును ఆమెకు గౌరవము యెక్కువగుచుండెను. ఆ రకము వారిని ఆమె యింతవరకు చూచి యుండలేదు. ఆయన కామె య జ్ఞాపకమైన యుండదు. ఆమె యెంత సుందరముగనున్నను ఆశ్చర్యమే యు ఆయన ముఖమున, శశిరేఖకు ఆయనను వదలి పోవుటకు ఇష్టమగు నవజీవనదాసుగారి జీవితమును గాంచిన చాలును, సౌందర్యమును గా యుండును. ఆయన చిరునవ్వు చూచిన చాలును, వెన్నెలతో నిండి ఆకాశమును చూచునట్లు తోచును. ఆయనకును శశిరేఖను చూచిన అను కలుగుచుండెను. ఆయన ఆమె చరిత్రను గురించి ఒక్క ప్రశ్న అడుగలేదు. ఒకనాటి ఉదయమున ఆయన గాన మాధుర్యమును గ్రోలి, తన జ్ఞాపక భార దుఃఖము నాపుకొనలేక, ఆయనకు తన యుదంతమునంతను వినిపించెను. ఆ ముఖమున వ్యసనము కనిపించెను. కాని ఏమియు ననలేదు. "ఉత్తమ జీ నకు నిన్ను తీసుకొని వచ్చుటకు నీకిన్ని కష్టముల నీశ్వరుడిచ్చె"ననియెను. శశిరేఖకది అర్థముకాలేదు.

ఆమె కష్టములు విని, ఆయన కామెపై జాలిపొడమెను. తానామెను అట్టి కష్టముల కామె తిరిగి లోనగునని ఆమెను తనతోడనే కొంత కా వఱకయిన నుండమనియెను. ఒక్క కుట్టుయంత్రమును కొనియిచ్చి కు నేర్పించెను. శశిరేఖ యితరులకు బట్టలు కుట్టియిచ్చి కొంత ధనమును సంపా చుండెను. నవజీవనదాసామెనొక ఆదివారము సాయంత్రము "సమాజము వచ్చెదవా?" యని యడిగెను. శశిరేఖ వెళ్ళెను. కాని అచ్చట చేయు విషయము ఆమెకు బాగుగా అర్థము కాలేదు. అయినను ఆయనకు సంతోషము కలుగు కాన్పించుటచే, ప్రతి వారమును సమాజమునకు పోవుచుండెను.

నవజీవన దాసుగారికి ఒక శూద్ర మనిషి వంట చేయుచుండెను. మొ దినమున శశిరేఖ ఆమె చేసిన భోజనము తినుట కిష్టపడలేదు. నవజీవనదాసుగా యే కులమైనను ఆయన తాకిన భోజనము తినుట ఆమెకు తప్పుగా తోచ గాని, యీ వంటమనిషి తాకిన భోజనము అయిష్టముగా తోచినది. కనుక ఆ ఆమెకు సామానులనిచ్చి వండుకొనమనెను. కాని కొద్ది దినములలో నవజీవన గారిమీద భక్తి అధికమైన కొలదిని, ఆయనకు సరిపడిన భోజనము మాత్రమెందుకు సరిపడగూడదని, కష్టముమీద, ఆ శూద్ర మనిషి వండినదే తినుచుండెను.



మొదట మొదట తన పూర్వపు జీవితము శశిరేఖకు జ్ఞాపకమునకు వొచ్చినను ఆమెకు పశ్చాత్తాపమును అశాంతినీ కలిగించలేదు. సుందరరావును ఆమె పూర్తిగ మరచెను. బ్రహ్మ సమాజపు మనుష్యుల చూచినపుడెల్ల రామారావు జ్ఞాపకమునకు వచ్చుచుండెను. యెవరి యందైన భక్తిని ధీరత్వమును చూచినను అతనినే ఆమె తలంపునకు తెచ్చుకొనును. అతనియందు ప్రేమ ఆమె కెన్నడునూ పోయియుండలేదు. తన స్థితి తలచుకొనినపుడెల్ల అతనిని వివాహమాడిన, తన దినములెంత శాంతము లయి యుండెడివో యనుకొనెను. అతనిని మోసగించి నందులకయి పశ్చాత్తాపమామె హృదయమున వేధించుచుండెను. సుందరరావు అతని హృదయము పగిలినదని కూడ చెప్పియుండెను. అట్టి సత్యశీలునకు, ఉత్తమ స్వభావమునకు తానెంతటి ఉపద్రవమును కలిగించునోకదా? తానే అతనిని మోసగించిన, అతనికి మనుజులలో విశ్వాసమెంత చెదిరియుండునో కదా? నవజీవనదాసుగారు, రామారావు నెరుగరు. ఆయన పేరు మాత్రము వినియుండెను.

కాని క్రమ క్రమముగ శశిరేఖకు పూర్వపు అశాంతి ఉదయింపనారంభించెను. ఇట్లు ఒంటరిగ పట్టణ మధ్యమున నుండుట ఆమెకు కష్టముగ తోచెను. వెన్నెలను చూచినప్పుడును, పువ్వుల వాసన తగిలినపుడును, ప్రేమగల దంపతుల గాంచినపుడు, పంజరములోని చిలుక అడవిని తలచుకొని, రెక్కలు కొట్టుకొనునట్లు, ఆమె మనసు తటతటలాడుచుండెను. జీవితమున నేదో, తక్కువైనట్లు తోచును. ప్రేమలేక జీవనమును గడుపుట దుర్భరముగ తోచును. ఆమె అశాంతి మొత్తము మీద ఆమెకే అర్థమగుటలేదు. ఆనందము మాత్రము జీవనమున కాన్పించుటలేదు.

ఆమె నవజీవనదాసుగారి జీవితము ననుసరించుటకు ప్రయత్నించెను. ఆయన కెక్కడనుండి వచ్చుచుండెను. ఆ ఆనందము తనకు? మాత్రమా యానందము రాకూడదా? ఈ చిన్న యిల్లు, ఆ సమాజము, పుస్తకములు, చాలునే ఆయనకు! తనకు మాత్రము అశాంతి యెందుకు? ఆయన రహస్యమేది? తన నీ ప్రకారము ఒంటరిగ జీవింపజేయు ఆయన, తనకా యానందమును భక్తినికూడా బోధింప కూడదా? తనను నిర్లక్ష్యముగ చూచి వదలుచున్నాడాయన. తన నతనిపై ఆధారపడి యుండు బిచ్చపు దానివలె చూచుచుండెనేమో? ఒకవేళ ఆయన పుస్తకములు చదివిన ఆనందమును భక్తియు గలుగునేమో?

ఒకనాటి మధ్యాహ్నమున ఆమె కేమియు తోచలేదు. నవజీవనదాసుగారి పుస్తకము నొకదానిని తీసుకొని చదువుకొనుటకై కూర్చుండెను. ఆ పుస్తక మర్థము

కాలేదు. అట్లే ఆలోచనా నిమగ్నయైయుండెను. కండ్ల నుండి నీటిబొట్లు ఆ చె చెంపలనుండి ఒక్కటొక్కటే యొడియందు పడుచుండెను. గడ్డము క్రింద నీ ఒక బొట్టున సూర్యకిరణములు ప్రకాశించుచుండెను. జుట్టు ముఖముపై విరి పడుచుండెను. ఆయన కుర్చీలో సగము చోటైనను నింపుటలేదు ఆమె చిన్న శరీరము. బయటపోయి యుండిన నవజీవనదాసుగారింతలో వచ్చిరి. ఆమె సరిగానైన చూడలేదు.

నవ – అమ్మా ఏమిటి చదువుతున్నావు?

శశి – ఇదేదో, బ్రహ్మగీతోపనిషత్తుట.

నవ – చాలా మంచి పుస్తకము కదూ?

శశి – ఏమో, నా కర్థం కాలేదు.

తిరిగి దుఃఖము రోషమును వచ్చెను.

నవ – అమ్మా, ఎందుకా విచారము?

శశి – తెలీదు.

దిన దినమును నవజీవనదాసుగారికి శశిరేఖను చూచిన అనురాగమెక్కు చుండెను. పాపభూయిష్టమగు ఆమె జీవనమునుండి ఆమె జన్మ స్వభావము నిర్ణయిం చుటకు వీలులేదనియును, అది మిగుల యుదారమయిన దనియు ఆయన తెలిసి కొనుచుండెను.

నవ – నీకేమన్నా లోపమైతే చెప్పు. నీకేమన్నా కష్టంగా వుందా, ఇక్క

శశి – అది కాదు. ఏమిటో తెలీదు. ఏమీ తోచదు.

నవ – పని చేసుకో.

శశి – పనిమీద బుద్ధిపోదు. ఎట్లా వుందో చెప్పలేను. వాళ్ళకి ఇట్లా వుంటే గాని ఇంకొకళ్ళకు అర్థంకాదు. ఏమిటో అశాంతిగా వుంటుంది.

నవ – అందరికీ అప్పుడప్పుడట్లానే వుంటుంది. దానిని జయించాలి, ఏ ప్రయోజనమేముంది?

శశి – ఎట్లా జయించడం? మీ కిట్లావుంటే యేం చేస్తారు మరి?

నవ – ప్రార్థన చేస్తాను. మంచి గ్రంథాలు చదువుతాను.





శశి – అదెట్లాగో నాకు తెలీదు. ఎందుకు ప్రార్థన చెయ్యడం?

నవ – ఈశ్వరుడి సహాయంకోసం.

శశి – ఈశ్వరుడు నా కెప్పుడూ సహాయం చేస్తున్నట్లే వుంటాడు. ఇంకా ప్రార్థనెందుకో అర్థంలేదు. నేను చాలాసార్లు చేద్దామనుకున్నా.

నవ – మనకోసమే. మన మనశ్శాంతికోసం.

శశి – నా కెప్పుడూ మనశ్శాంతి అట్లా రాలేదు.

నవ – నాకు వస్తుంది. నీకు ప్రార్థన చెయ్యడం తెలీదు.

శశి – అదికాదు. నా స్వభావం వేరు. మీ స్వభావం వేరు.

నవ – మనుష్య స్వభావమంతా యీ విషయంలో వకటే.

శశి – అయితే నాకు నేర్పరాదూ?

నవ – నేర్పితే వస్తుందా?

శశి – వస్తుందంటారు. అది రాదు. మీరు నేర్పడానికి వీల్లేదంటారు. ఎట్లా మరి?

నవ – ఈశ్వరకృప కావాలి.

శశి – మరి ప్రార్థన చేస్తేగాని ఈశ్వర కృప రాదుగా.

నవ – విశ్వాసముండాలి.

శశి – ఎట్లా? తెచ్చుకుంటే వస్తుందా.

నవ – తెచ్చుకోవాలి.

శశిరేఖకు అదెట్లాగో తెలియలేదు. కాని, ఆయనకు కోపము వచ్చునేమోనని యూరకొనెను.

నవ – నువ్వు సమాజానికి వస్తున్నావు కదా? అక్కడ ప్రార్థనలు బావుండటం లేదూ?

శశి – అర్థమవుతాయి. కానీ ఎందుకో అట్లా ప్రార్థన చెయ్యడం తెలీదు. పాపము, పాపమంటారు. మిమ్మల్ని చూస్తున్న మట్టుకు మీరు చేసే పాపమేమిటో నాకు కనబడదు. నా మట్టుకు నాకు చిన్నప్పటి నుంచి నేను బుద్ధిపూర్వకంగా చేసిన పాపం వకటీ జ్ఞాపకంలేదు.

నవ – అంతరాత్మ యింకా పరిశుద్ధం కాలేదు నీకు.

శశి - పరిశుద్ధమయిన తరవాత నేను చేసే పనులన్నీ పాపాలుగా తాయా?

నవ - అమ్మా! నీకు యింకా ఈ సంగతులు తెలీవు. ఊరుకో.

శశిరేఖ హృదయవేదన ఎక్కువగుచుండెను.

శశి - మరి నన్నెందుకు ఇట్లా వుంచుతారు. మీరు పొందే సౌఖ్య తెలీదు. మీరు చెప్పరు. నాకు సౌఖ్యము లేదు. సంతోషం లేదు. ఏమీ

నవ - అమ్మా! రోషంతో తొందరపడితే లాభమేముంది? పవిత్ర గడుపుతూ విశ్వాసముతో కాచుకొనియుండాలి. చేసిన పాపాలకి పశ్చాత్తా అప్పుడుగాని దేవుడి దయరాదు..

శశి - అందుకా మీరు నన్నిక్కడుండ నిచ్చింది? నేనేదో పాపాత్ము పశ్చాత్తాపపడాలనీనా? నేనేం పాపాలు చేశానని పశ్చాత్తాపం? నాకు తెలు లోకంతో పాటు మీరు కూడా నాది పాపిష్టి జీవనమనుకుంటున్నారు. జీవితాన్ని కొంత బాగు చేస్తే మీకు పుణ్యం వస్తుంది కదా అని ఆశ.

నవ - ఎందుకు అట్లాంటి దురభిప్రాయాలు పడతావు?

శశి - నా మీద నిజంగా ప్రేమవుంటే నన్ను మీరు ఇట్లా వదిలేస్తారా?

నవ - నేనేమి సహాయం చెయ్యగలను. అంతా యీశ్వరుడు చె అదిగాక స్త్రీలతో మాట్లాడడం నాకు తెలీదు. అలవాటు లేదు.

శశి - మీకు కుమార్తె వుంటే ఇట్లా మాట్లాడకుండా వుంటారా? అధికారం వున్నట్లు మాట్లాడుతున్నట్లున్నాను. నాకిక్కడ వుండడానికి అధికారం అంతా మీ దయే. కాని ఉన్నాను. ఉన్నప్పుడు నాకు సంతోషం వుండాలి

నవ - ఎందుకు ఇప్పుడు ఈ అశాంతి?

శశి - నాకు లోకంలో ఏమీ పనిలేనట్లు కనపడుతుంది. ఎందుకు ఎవరికోసం?

నవ - బ్రతకడమే ఉపకారం. సద్గుణాలు నేర్చుకోడానికి. నీ శక్తుల్ని చేసుకొని, వికసింపజేసుకోడానికి, యీశ్వరుడు నిన్నిక్కడికి పంపించాడు కోసం పాటుపడాలి.





శశి - ఎట్లా?

నవ - జీవనం ఎట్లా అంటే పోనిస్తే లాభం లేదు. కొన్ని నియామకాలు ండాలి. ఎన్ని కష్టాలు వచ్చినా, ప్రలోభాలు వచ్చినా, వాటిని మానెయ్యకూడదు. అబద్ధం చెప్పకుండా వుండాలనుకోవచ్చు. కాలం వృధాపుచ్చకూడదనుకోవచ్చు. కోరికలను కట్టియ్యడానికి ప్రయత్నం చెయ్యవచ్చు. నువ్వెప్పుడన్నా యిట్లాంటివి పెట్టావా?

శశి - లేదు.

నవ - ఇట్లాంటి నియామకాలు లేకుండా, మనస్సు లాగినట్లల్లా బతుకుతో దీపంలో నూనె వలక పోసినట్లే అవుతుంది.

శశిరేఖకు ఇది క్రొత్తగా తోచెను. తన యిష్టము వచ్చినట్లు బ్రతుకుటే కాని, నియామకము లెన్నడూ యెరుగదు. వాని అవసరము కనబడియుండలేదు.

శశి - నేను ఇట్లాంటి తప్పులు చేసి యెరుగనే ?

నవ - నీ స్వభావం మంచిదే కావచ్చును. అందుచేత పాపాలు చెయ్యకపోయినా, ప్రయత్నం ఉంటేనేగాని అభివృద్ధి లేదు. దీనిని సాదనంటారు.

ఆనాటి నుండి శశిరేఖ తన జీవితమున సాధన నారంభించెను. దిన దినము నవజీవన దాసుగారి వంటి భక్తుని వద్దనుండి సహాయమును బడయుచు తన జీవన రహస్యమును కనుగొనుచుండెను. కొంత అశాంతి తగ్గినది.

## 17

మూడు నెలలు గడిచినవి. ఇప్పుడు నవజీవనదాసుగా రీమెతో ఎక్కువ కాలము గడుపుచుండిరి. ఆమెను, ఆమె తన యభివృద్ధికై చేయు ప్రయత్నములను చూచిన ఆయన కామెపైనెంతో దయ కలుగుచుండెను. ఆయనను చూచిన ఆమెకు బెదురును క్రొత్తయు తగ్గెను. ఆయన హృదయము ఆమె కనుగొనుచుండెను. ఆయన జీవనమున కానందము ఈశ్వరునియందలి అపారమైన భక్తి విశ్వాసముల వలనను, సమస్త జనులపైయుండు ప్రేమవలనను కలుగుచుండెనని తెలిసెను. కాని వానిని నేర్చుకొనుట మాత్రమామెకు దుర్ఘటముగ కనిపించుచుండెను.

ఒక దినమున నవజీవనదాసుగా రామెను పిలిచి కూర్చుండమనెను.

నవ – అమ్మా! నేనొక విషయాన్ని అడగబోతున్నాను. నీ యభి తెలీచెయ్యాలి.

శశి – ఏమిటి?

నవ – అప్పుడప్పుడు ఇక్కడికి వస్తోవుంటాడు ధర్మారావుని చూ

శశి – సమాజంలో పాడుతూ వుంటాడు ఆయనే కదూ?

నవ – అవును. అతనే చాలా యోగ్యుడు. భక్తిపరుడు. ఇక్కడ నూట యాభై రూపాయల జీతం. మొదటి భార్య పోయింది.

శశి – ఆయన పొట్టి పిరికివాడు. బ్రహ్మసమాజానికి వస్తాడు కాని చేరలేదంటారే?

నవ – ఏదోలే! యింకా అతనికి భయం వదలలేదు. కాని మనిషి మం ఈ విధంగా బ్రహ్మసమాజంలోకి అతన్ని తీసుకుని రావచ్చు. ఏమిటంటే ఇక్కడ చూసింది మొదలు నీ సంగతి తలుచుకుంటే విచారంగా వుంది నిన్న నాతో చెప్పినాడు, నిన్ను వివాహం చేసుకోవలెనని ఉందని. అట్లాంటి అభిప్రాయపడడం నీకు చాలా అదృష్టం. నీ యిష్టం కనుక్కోమన్నాడు.

శశి – నాకేమాత్రం యిష్టంలేదు. నేను పెళ్ళి సంగతి అనుకోదు అయినా నా వంటిదాన్ని ధర్మారావుగారి కెట్లా పనికి వస్తాను?

నవ – నువ్వు ఇట్లాంటిదేదో అంటావనే అనుకున్నాను, కాని అభ్యంతరం? నువ్వు పెళ్ళెందుకు చేసుకోకూడదు?

శశి – నాకు అవసరమేమీ కనబడ్డంలేదు. ఆయన్ని చూస్తే నాకు ప్రేమ అతన్ని సరిగానన్న యెరగను.

నవ – నేను చెపుతున్నాగా అతను మంచివాడేనని. నిన్ను సౌఖ్య పెట్ట అంతకన్నా యేం కావాలి? నీవు అతన్ని తెలుసుకున్నా మంచివాడేనా కాదా

శశి – మీకు పెళ్ళి కాలేదుకదూ?

నవ – అవును.

శశి – మీకీ విషయం ఏమీ తెలీనట్లు కనబడుతోంది. పెళ్ళి సౌ పడడానికా?

నవ – మరెందుకు.



శశి – ఆ దురభిప్రాయముతోటే బాల్య వివాహాలు చేస్తారు. మా అమ్మాయి సౌఖ్యపడాలని ఎవరినో ఒకరిని సౌఖ్యపెట్టేవాణ్ణి కడతారు. సౌఖ్యపెట్టడమంటే పెద్దవాళ్ళ కళ్ళల్లో మంచివాడు కావడం, డబ్బూ, ఆస్తీ వుండడం. లేకపోతే చదువుకోవడం. ఇవి మంచిరకం బాల్యవివాహాలు. ఇహ స్వలాభం కోసం ఆశించి చిన్నపిల్లల గొంతు కోసేవి, సరేసరి. మీరు కూడా నాకట్లా సంబంధం విచారించినట్లున్నారే?

నవ – పోనీగానీ, సౌఖ్యపడ్డానికి కాకపోతే పెళ్ళెందుకో చెపుదూ?

శశి – పెళ్ళి ప్రేమించడానికి. అదికాదు ప్రేమిస్తారు. గనకే పెళ్ళి. సౌఖ్యపెడతారా లేదా, మంచివాడా కాదా, అనేది ప్రశ్నకాదు. ప్రేమిస్తున్నాడా లేదా అనేది కూడా అంత గొప్ప ప్రశ్నకాదు. ఆడదానికి నేను ప్రేమిస్తున్నానా లేనా అనేది ఒక్కటే సంగతి. ఎంత నీచుడు కాని, దుర్మార్గుడు కానీ, దరిద్రుడు కానీ, స్త్రీ తాను ప్రేమించిందా, ఇంక ప్రాణమన్నా యిచ్చివేస్తుంది, అదే వివాహము, తక్కినవికావు.

నవ – పోనీ, నీవు ఇతన్ని ఎందుకు ప్రేమించకూడదు?

శశి – ప్రేమకు కారణం లేదు. ప్రేమరాన్దే?

నవ – పెళ్ళిని గురించి నీవు తప్పుడు అభిప్రాయాలు పడుతున్నావు. లోక వ్యవహారం జరగడం ముఖ్యమయిన ఉద్దేశ్యం. ప్రేమ వున్నవాళ్ళకే మంచి సంయనం కుదుతుంది. కనుక ప్రేమ కావాలన్నారు. అదిగాక మనుష్య స్వభావం దుర్బలం. పెళ్ళి అయితే పాపంలో పడకుండా వుంటారు.

శశి – మీకి సంగతి యెంతమాత్రం తెలీదు. పాపానికి లోబడకుండా వుండడానికా పెళ్ళి? ఇష్టం లేనివాణ్ణి పెళ్ళి చేసుకోవడమం పాపం యీ లోకంలో మరేకేమీలేదు. అంత అసహ్యమూ లేదు.

నవ – మనసూ మనసూ కలిపి యీశ్వరుణ్ణి ధ్యానం చేసుకుంటూ సంసారం నడపడం కంటే ప్రేమ యింకేమిటి?

శశి – ఇదా ప్రేమ మీ కర్థమయింది? బొమ్మల్ని పూచ్చేసి, యీశ్వరుడి ప్రేమను తెలుసుకోమనడం కంటే యిది యెక్కువ మూర్ఖంగా వుంది. మీకు చెపితే లాభంలేదు. ప్రేమననుభవించాలి, తెలియాలి.

నవ – ప్రేమే జీవనానికి అవధి అనుకుంటున్నావు. ఈ ప్రేమ క్షణభంగురము, ఈశ్వరునియందు ప్రేమ శాశ్వతము.

శశి - ఆ ప్రేమకు జీవనములేదు. అందుకనే శాశ్వతము. జీవించే ప్రే ఎప్పుడూ పెరుగుతుంది, మారుతుంది. అందుకనే అశాశ్వతము, చంచల

నవ - అలానా? పోనీ? నీ జీవనము చూసుకో. నీ చంచలమైన ప్రే ఎన్ని పాపాల్ని చేయించిందో? ఎన్ని కష్టాల్లోకి నిన్నీడ్చిందో? చివరకు మి దేమిటి? అశాంతి. ఎందుకీ బతుకనే నిరాశ? యింతేనా? కాని ఎవరినో స షుణ్ణి పెళ్ళి చేసికొన్నట్టయితే యెంత సుఖమైన జీవితం గడుపుతూ వుండే

శశి - అంతే అనుకున్నారా? నేను అనుభవించిన కష్టాలు ఒక క్ష అనుభవించిన సుఖమో? ఆ సుఖంలో నూరోవంతు అనుభవించడానికి నే బాధ తిరిగి పదిసార్లు పడతాను. మీరు చెప్పే శాశ్వతమైన శాంతి, ప్రేమ అనుభవించనివాళ్ళకి. అట్లాంటి ప్రేమ ననుభవించా గనకనే యిప్పుడీ

నవ - అది ప్రేమ అనుకుంటున్నావు. అది వట్టి శరీర వాంఛ నిర్మల ప్రేమ ఎన్నడూ పాపమార్గంలోకి దింపదు.

శశి - మిమ్మల్నింత ఆనందంలో ముంచేది యీశ్వరభక్తి. ఈశ్వర భక్తి మీ మనో ఉద్రేకమంటే మీకెట్లా వుంటుంది? నే ననుభవించింది యే తెలీకండా, శరీరవాంఛ అంటే సరిపోతుందా, మీకు అట్లా అనడం న్యాయమే వాంఛ ఒక్క నిమిషంలో చల్లారే చిన్న వేడి. ప్రేమ జీవితాన్నంతా వెలిగి విద్యుచ్ఛక్తి. నా దేహం కాదు, ప్రేమను కోరింది, నా ఆత్మ, నేను ఆశించేది కోరింది. ఆ జీవనాన్ని, నాలో అత్యుత్తమమైన స్వభావమేదో అనేది కో ప్రేమ జీవనాన్ని. నా ఆశలు, నా కోర్కెలూ, నా ఆశయములు, నా ప్రాణము, శక్తులు, అన్నీ కలిసి లీనమైపోయినాయి, ఆ మహా ప్రేమలో. ఇంకో ఆశే కోర్కెలేదు, అంత కాలమూన్ను.

నవ - అయివుండవచ్చు. అయితే ఆ ప్రేమ అంతా నీ స్వార్థము కో కాదూ? అందుకనే అంత పాప భూయిష్టం చేసుకున్నావు. దాన్నుంచి ఏ శాశ్వతానందము వచ్చింది?

శశి - అయ్యో, నా ప్రేమా స్వార్థమయినది? ప్రేమించడం స్వార్థ అయితే జీవించడం స్వార్థము కాదూ? ఈశ్వర భక్తి స్వార్థము కాదూ? ఈశ్వ



ఆయన కోసరమేనా ప్రేమించడం? మనకోసమేగా? ఎవరి జీవితమును వారు సార్థకము చేసుకో వడం స్వార్థమా?

నవ - కాని నా భక్తి ఎవరికీ కష్టం కలిగించడంలేదే?

శశి - కష్టం కలిగిస్తే నా తప్పా? నేను ప్రేమించలేని మనుష్యుడు నన్ను కావాలంటే నేనేం చెయ్యను? అతని దగ్గర ఉండిమాత్రం సంతోషం యివ్వగలనూ? మీరు యిట్లా వుండడం ఎవరికి కష్టంగా వుందో? కాని ప్రేమ లేకపోయినా సుందరరావుగారనే ఆయనతో వుండలేదూ ఆయన కోసం? అది స్వార్థంగానే తోస్తోందా మీకు? కాని అదే నేను చేసిన మహా పాపంగా నాకు తోస్తోంది ఇప్పుడు.

నవ - కాని ఆ జీవనముకన్న పాపమూ, నీచమూ ఏముంటుంది?

శశి - మీరు తెలియకండా మాటలంటున్నారు. ఎందుకు పాపము? ప్రజల మార్గం. మేము వదిలేశామంటారే మళ్ళీ ఇదేనా? ఈ విషయంలో ప్రజలనేటట్టే అంటారేం?

నవ - అది నిజం గనక. సమస్తమయిన ప్రజలూ, సర్వకాలములలో వ్యభిచారం తప్పంటోనే వున్నారు.

శశి - మొదటి సంగతి యిది వ్యభిచారం కాదు. యుగ యుగాలనుంచి యీ దేశంలో వర్ణభేదముంది. మరి మీరు దాన్ని వదిలేశారేం?

నవ - మంచిది కాదు కనక?

శశి - మంచిది కాదని యెట్లా తెలిసింది?

నవ - స్వబుద్ధివల్ల.

శశి - మరి మీ బుద్ధి వుపయోగించారా? మరి యీ సంగతుల్లో మీ బుద్ధే మయింది? లోకమంటోంది కదా అని మీరూ అనడమేనా, లేకపోతే, మీ అంతట మీరాలోచించుకున్నారా? ఒక్కసారి యింతవరకు యీ విషయంలో నేను పాపం చెయ్యలేదు. నా శరీర వాంఛలను చూసుకోలేదు. నా సౌఖ్యాన్ని చూసుకోలేదు. భద్రంగా ఆలోచించి నా స్వభావము దేన్ని కోర్తోందో దాన్ని పట్టిపోయినాను.

నవ - అంతరాత్మ అనేదిలేదూ? అది పాపమనడం లేదూ?

శశి - నిజంగా చెప్పుతున్నా. నా అంతరాత్మ ఏది వుత్తమమన్నదో అట్లానే చేశాను. ఎన్నడూ అట్లాంటి జీవితం పాపమనలేదు నా అంతరాత్మ. ప్రేమ లేకండా ఎవరినో కట్టుకుంటే మహాపాపం చేసినట్లుగా ఏడుస్తో వుండేదాన్నీపాటికి.

నవ - నీ అంతరాత్మకి అంతకంటే జ్ఞానము లేదన్నమాట. ఒక్క పురు
స్త్రీ ప్రేమించుకోవడం ఆదర్శము.

శశి - కావచ్చును. కాని వారిలో ఒకరి ప్రేమపోతే !

నవ - ఒకసారి యీశ్వర ముఖంగా చేసుకొనిన తరవాత వదలకూ

శశి - స్వభావాలు మారుతూ వుంటాయి. ప్రేమ మారుతుంది. కాని కూడదు? ఈశ్వరుడు వద్దన్నాడా? భర్తన్నా భార్యన్నా చచ్చిపోతే చేసుకోవచ్చు గావును? ప్రేమ పోయిన తరవాత వాడు చచ్చిపోయినట్లే. అది కూడదన్నా ఇవన్నీ అ యీశ్వరుడి నెత్తినెందుకు పారేస్తారూ ? పాపం ఈశ్వరుడికి వస్తుందని, యావజ్జీవనం పడి వుండాలి అని ఎన్ని జీవితాల్ని పాడుచేస్తున్నారో

నవ - ఈ సంగతులు ఇది వరకు ఆలోచించలేదు. ఇప్పుడిం

మరునాడు తిరిగి నవజీవనదాసుగారు శశిరేఖను పిలచిరి.

నవ - ధర్మారావుతో నీ కిష్టంలేదని చెప్పినాను. చాలా దిగులు కనప డ్డాడు. పోనీ ఆమెని చూసి మాట్లాడుతోనన్న వుంటానన్నాడు కభ్యంతరముంటుందా?

శశి - ఎందుకు ఆయన నాతో మాట్లాడడం?

నవ - తెలీటంలేదూ? ఎప్పటికన్నా నీకు దయ వస్తుందేమోనని?

శశి - లాభంలేదు. నా మనసు నాకు తెలుసు, అదిగాక నేను వివాహమే చేసుకోను.

నవ - పోనీలే, అతనికేదో ఆశ. నీ కభ్యంతరమేముంది?

శశి - ఏమీ లేదు. కాని అవసరం కనపట్టంలేదు.

నవ - అటువంటివాణ్ణి పెళ్ళి చేసుకుంటే నీ జీవనానికి ఎంత వస్తుంది? నీకు శాంతి ఇవ్వడానికి, ఒక సంసారము, అదీ వుంటుంది. బుద్ధి ఇష్టము వచ్చినట్లు చరింపకండా వుంటుంది. ఇంత చిన్నదానవు ఏమీ లేకండా ఎంతకాలమని వుంటావు? నీ వంటి వాళ్ళకు కాదు యీ వంటి నీ రూపమే వేరు, నీ స్వభావమే వేరు. మళ్ళీ పాత జీవితంలో పడిపోవడం తిరిగి లేవడం కష్టం.



శశి - నేను చెప్పలేదూ? గడిచిన జీవితం నాకు సంతోషాన్నీ, గర్వాన్నీ ఇస్తోందని? తిరిగి అట్లాంటి జీవితము వస్తే యింకా యేం కావాలి? ఈ నీతి, ఈ సిగ్గు అన్నీ వదులుతాయి. అదీగాక పరాధీనం ఎంత మాత్రం నాకు ఇష్టం లేదు.

ఇదివరకు నవజీవనదాసుకు ఆమెను చూచిన ప్రేమ అధికము, ఆమె చెడ్డ మార్గమున, త్రోవచూపువారులేక చరించినదనియును. ఇప్పుడైన నామెనుతాను సన్మార్గమున నుంచుటకు ప్రయత్నింప వలయుననియును, నిశ్చయించుకొనెను. కాని ఆమె తన కేమాత్రమును లొంగుటలేదు. ఆమె ఏర్పరచుకున్న యూహలామెను వదులుటలేదు. కాని ఎట్లామెకు తాను సహాయము చేయుట? ఆమె యందు ఎంతటి ప్రేమ, ఎంతటి యుదారము యున్నవి! ఎంత నిర్మలత్వము, ఎంత సాహసము, ఎంత కోమలత్వము, ఎంత దయ ! ఆమె మాత్రము మిగుల నుత్తమ స్త్రీయని ఆయన యెరుగును. పాపములో నుండి, అంధకారములోనుండి, మలిన పంకములో నుండి, ఏమియునంటక నిర్మలముగ, పవిత్రవంతముగ, చిన్న బాలికవలె, ఆమె వచ్చెనని యాయన యెరుంగును. కాని ఆమె నెట్లు కాపాడుట? ఈశ్వరా! నీ అపార కరుణయందు శశిరేఖను కాపాడలేవా? ఇట్టి కోమల పుష్పమును, దుమ్మున రాల్చెదవా? అని అనుకొనును. ఈ వివాహము చేసికొనెనా ఆమె సన్మార్గమునకు తిరుగునని యాసించెను. ధర్మారావుపై నాయనకు విశ్వాసము కలదు.

నవ - పోనీ, నా కొరకు ఆయననిక్కడకు రానియ్యరాదూ?

శశి - సరే, మీకు సంతోషము నిచ్చేటట్లయితే రానియ్యండి. కాని నా కట్లాంటి ఉద్దేశ్యము రాదు.

నవ - ఏమో ఈశ్వరేచ్ఛ యెట్లా వుందో?

శశి - ఈశ్వరుడైతే మాత్రము, నాకు యిష్టము లేనిది. నన్ను బలవంతము చెయ్యగలడా?

నవజీవనదాసు చిరునవ్వు నవ్వి యూరకుండెను. కోపముతో తల్లినే తిరస్కరించు అమాయకురాలైనా చిన్న బాలిక ఆత్మ యీమెది !

# 18

నెలరోజులు గడిచినవి. ధర్మారావు ప్రతిదినమును శశిరేఖ వద్దకు
డెను. ఆమెను చూచిన అతనికి మిగుల భయము. దూరముగనుండి
ఆమెమాట కెదురాడడు. కాని శశిరేఖ అతనిని ఎక్కువ ఆదరముతో చూచు
శశిరేఖను అతడు ఒక దేవతవలెననుకొనును. ఆమె తాకినదానిని బంగా
నెక్కువగ చూచుకొనును. ఆమె పలుకు లమృతమువలె వినును. ధర్మా
విధమున మంచివాడే, అల్ప సంతోషి. అతని స్వభావమున లోటేమియు
శశిరేఖ వంటి స్త్రీ అతనిని తనతో మాట్లాడనిచ్చుట తోడనే అతని
అందరితోడను ఆమె తనను వివాహమాడ పోవుచున్నదని చెప్పుకొను

పుష్యమాసమున చలికాలము ముసలి సంకనున్న బిడ్డవలె వసంతు
చుండెను. తెల్ల మబ్బులు, హాయినిచ్చు చల్లని గాలులు, పువ్వులు, నీలపు
పట్టణమున సహితము ఆనందమును తెచ్చుచుండెను. దూరమున చెట్ల
వార్త వచ్చుచుండెను. శశిరేఖకు తిరిగి పూర్వపుటశాంతి యుద్భవమయ్యెను
ఆమె జీవితపు విషయములు వద్దన్నను స్ఫురణకు వచ్చుచుండెను. సృష్టి
జీవనము, ప్రేమ, స్వేచ్ఛ, తలచుకుని యువ్విళ్ళూరుచుండెను. ఇక్కడ జీవ
దుస్సహము. పూర్వపు అశాంతి చుట్టుకొన్నది. జీవితము సౌందర్యము న
కోరెను. తనను ప్రేమింపగలవారు కావలయును. ధర్మారావు చూచిన
యిప్పుడు శశిరేఖ పూర్వమువలె తనను ఎవరు ప్రేమించిన సంతోషింప
జీవనమున నియామకములు ప్రవేశించినవి. సౌఖ్యము కొరకే జీవి
జీవనమెట్లు తీసికొనిపోయిన నా విధమున జీవించువారిని చూచిన
గౌరవములేదు. ఇంద్రియ జయము, మానసిక విరోధములేని మనుషుల
కొరగారు. ప్రతివారును నవజీవనదాసులు కావలయును. అందు
రామారావును యెల్లప్పుడును తలచు కొని ఆయన ప్రేమను కోల్పోయిన
దుఃఖించుచుండెను. తనను ప్రేమించుట కట్టివారు కావలయును. అదిగాక
మనిన ఆమెకు విశ్వాసము పోయినది. మనుజులను జూచిన కొలది
జీవనమును చూచికొన్న కొలదియు. ఎట్టి ఘనుడైనను ఒక్కనినే తానెల్ల
ప్రేమించుట అసంభవమని తెలిసికొనెను. కాని ప్రేమను కోరెను. నవజీవ
గారి వద్దనున్న తన కట్టి స్వేచ్ఛలేదు. తాను స్వతంత్రముగ జీవింపవల



గోవిందపురము పోవుటకు నిశ్చయించుకొని తన యుద్దేశ్యమును నవజీవన దాసుగారితో చెప్పెను. ఆయన నామెను తనతోనే యుండమనెను. కాని ఆమె ఒప్పుకొన లేదు. చివరకు ఆ నెల కలకత్తాలో బ్రాహ్మోత్సవము జరుగుననియును, తానచటికి పోవుచుండెననియు, ఆమె కూడ ఆ యుత్సవమునకు వచ్చి, తరువాత యింక యిష్టము లేకున్న గోవిందపురమునకు వెళ్ళవచ్చుననియును చెప్పెను. శశిరేఖను వదలుట కాయన కెంతమాత్రమును యిష్టములేదు. ప్రతిదినము నామె చూచుట, ఆమెతో మాట్లాడుట ఆయనకు బాగుగ నలవాటయ్యెను. ఆమె లేకున్న తన గృహ మంధకారముగ కాన్పించును. శకుంతలబోయిన కణ్వునివలె నగును. ఆమె చిరునవ్వు ముఖము చూడక ఎట్లుండుట? ఆమె తన కొరకు తన సంతుష్టి కొరకు పడు శ్రమ మరువగలడా? అదిగాక ఆమె తనవద్దనుండి పోయిన తిరిగి పాపపు జీవితమున పడునని ఆయనకు నిశ్చయము. ఇట్టి మార్దవ మనస్కులు, నిష్కపట హృదయులు లోకమున వంటరిగా బ్రతుకుటకు తగరు. పాప మొనరించిన వారిదా తప్పు? ఆమె యింకను యేమియును తెలియని బాలిక యనుకొనెను. కాని ఆమె యిష్టములేనిది తానెట్లామెను తనతో నుంచుకొనగలడు? ముందుముందు ఆమెకు తానేమి సహాయము చేయగలడు? సహాయమే చేయుట తన చేతిలోనుండిన భక్తి, యీశ్వర ప్రేమ ఆమె స్వభావమును మార్చునను కొనెను. కాని యింతవరకామె వానిని గ్రహింపనేలేదు. ప్రేమను, గాఢమగు ప్రేమను జీవితమును దగ్ధము చేయు ప్రేమను, ఆమె కోరుచున్నదే? తానేమి యియ్యగల డామెకు? తన ప్రాణమునన్న యిచ్చుటకు సందేహములేదు. ధర్మారావు పైనను ఆమెకు ప్రేమ కలిగినట్లు తోచదు. కట్టకడపటి ఆశతో, యీ యుత్సవములలోనైన ఆమెకు ఏమైన శాంతి దొరుకునేమో? అక్కడికి వచ్చు భక్తిపరులను గాంచి, ఆ ప్రార్థనలను, ఉత్సవములను, తోటి స్త్రీలను, వారి యుత్సాహమును చూచిన యేదో కొత్త మార్పు రాకూడదా?

ధర్మారావుకూడ వారివెంట కలకత్తా వెళ్ళెను. కలకత్తా బ్రాహ్మసమాజమందలి యుత్సవములామెను ఆనందమునను ఆశ్చర్యమునందును ముంచెను. వారి భక్తి విశ్వాసములను యుత్సాహమును చూచి, అట్టి ప్రవాహమున తన జీవితముకూడ కలుపగలిగిన ఎంత హాయిగ నుండుననుకొనెను. ఆ సమాజపు స్త్రీ లెంత అందముగ నుండిరి ! ఎంత మధురముగ పాడిరి ! ఆమె అహంభవ మడుగంటెను. వారి ముందు, తనను చూచువారైన లేరు. ధర్మారావు తప్ప ఇతరులామె పాదములవద్ద యెవ రెవ్వ రును లేరు. నవజీవనదాసుతో నుండుటచే అచటి జనులామెను

మిగుల గౌరవించిరి. కాని వారి భాషైన యామెకు తెలియదు. నవజీవనదా యుత్సవముల సందడిలో మిగుల పనిగానుండి యామెకు కనబడుటలేదు ధర్మారావే ఆమె సౌకర్యముల విషయమై చూచుచుండెను. కాని అతని ఆమెకు కోపమెక్కువగుచుండెను. ఆమె తలపులను కూడబెట్టుకొనుటకు ఆమె నతడు వంటరిగా నుండనీడు. వెంట వెంట నెక్కడ చూచిన అతడే

సాయంత్రము సమాజ మందిరమునుండి వచ్చుచుండగా దారి దీపముల క్రింద హఠాత్తుగా రామారావు కనబడెను. అతడవునాయని సందే దగ్గరకు బోయెను. హృదయమున ఆనందము కలిగెను. ఇన్ని దినము అణగియున్న ప్రేమ తిరిగి వచ్చెను. అతనితో మాటలాడవలయుననెడు ఆశ గాని, ఇంతలో ఆయన ఉద్దేశ్యమెట్లున్నదోయను సందేహము కలిగెను. నన్ను క్షమించునో లేదో? తనపై నింకను ఆగ్రహము కలిగియుండెనో మాటాడునో లేదో? కాని తన కోర్కెనణచుకొనలేక, అతనిని సమీపించె రామారావు కన్నులామెపైబడెను.

రామ - శశిరేఖా?

శశి - అవును.

రామ - ఇక్కడికెట్లా వచ్చావు!

శశి - చెప్పుతాను. ఆశ్రమానికి రండి.

శశిరేఖ తన చరిత్రనంతను అతనికి తెల్పెను. రామారావు విచారించెను.

రామ - ధర్మారావు నీకెట్లా తెలుసు?

శశి - మీరాయన్నెరుగుదురా?

రామ - కొంచెంగా. నీకు తెలుసునా?

శశి - నవజీవనదాసుగారింటికి వస్తూ వుండేవాడు. అప్పుడెరుగుదు పాపం, చాలా మంచివాడు ఆయన.

రామ - నేను కనపడగానే పలకరిస్తావనుకోలేదు.

శశి - నిన్ను మరచిపోగల ననుకున్నావా?

రామ - ఇంకా నా మీద ప్రేమ వుందా?



శశి - నీకు తప్ప యీ హృదయంలో ఇంకెవరికీ చోటులేదు.

రామ - నువ్వుచేసిన గాయం ఇంకా మానలేదు.

శశి - ఆ రోజులు పోయినాయి. ఇంకేముంది? ఆ అదృష్టం తప్పిపోయింది. పోనీపో, ఇంక జీవితంలో మిగిలింది ఏమీలేదు.

నాల్గుదినములు గడచినవి. ప్రతిదినమును రామారావు వచ్చి శశిరేఖను కలిసికొనుచుండెను. ఒక దినము రాత్రి ఆశ్రమములో ఉపాసన జరిగెను. ఆ ప్రార్థనలో స్త్రీ పురుషు లేకధారగా నేడ్చిరి. వారి భాషయైన యామెకు తెలియలేదు. కాని, ఆమెకు కూడ దుఃఖము వచ్చెను ఆ సంగీతము వినిన ఎవరికిరాదు? ఆ కన్నీళ్లతోడనే శశిరేఖ దాబామీదికి బోయి కూర్చుండెను ధర్మారావును వెంట వచ్చెను.

శశి - ఆహా, ఏమీ జీవనము వీరిది? భక్తి! యింకేమీ అక్కరలేనట్లుందే! వీరి ఉత్సాహములో కలిసియున్ననే సార్థకము. వీరితో ఉండగలిగితే ఎంత బాగుండును?

ఈ సంగతే ఆమెకు పలుమారనిపించుచుండెను. కాని తాను వీరితో నెట్లుండ గలదు? ఆ సమాజము, మనుజులు, ప్రేమ, భక్తి, గానము, యుత్సాహము, ఆమె నాకర్షించుచుండెను. కాని తన నక్కడ యుండనిత్తురా? తన జీవితమంతయును పాప భూయిష్టమనుకొనుట లేదా వీరు? తనను క్షమింతురా? తాను వివాహమాడిన గాని వీరిలో మర్యాద రాదు. కాని వివాహమా? అయినను తననెవరు వివాహము చేసికొందురు?

ధర్మా - పోనీ యిక్కడే వుండరాదూ?

శశి - ఎట్లా వుండనూ? నన్నెవరుండనిస్తారు? ఈ నిర్భాగ్యురాలి గతి యింతే.

ఆమె కండ్ల నుండి నీరు కారెను. ఏడ్చునపుడుకూడ సుందరముగ కన్పించు స్త్రీలు కొలది మందియే గలరు. ధర్మారావిదియే మంచి సమయమనుకొనెను.

ధర్మా- శశిరేఖగారూ. నన్ను మీకు సహాయం చెయ్యనియ్యరాదూ? ఇక్కడ ఉద్యోగం సులభంగా సంపాదిస్తాను, నాకియ్యడానికేం? కళ్ళనద్దుకొని యిస్తారు. మీ యిష్టం ఎక్కడుండాలని వుంటే అక్కడే వుందాం. తరవాత మీ మీద అనేవారుండరు. నా మీద కొంచెం కటాక్షం జూపరాదూ!

శశిరేఖ రెండు నిమిషము లాలోచించెను. ఇక్కడే వుందుటకు నన్న ఆమెకు మిగుల సంతోషము వచ్చెను. కాని వివాహమా? ఇతని మాట్లాడక లేచి వెళ్ళిపోయేను. అతనికి ప్రత్యుత్తరము చెప్పుటకు కూడ అసహ్యమయ్యెను.

అతడు మాత్రము ఆమె మౌనమును అంగీకారముగా తలచెను. త్వరగా నవజీవనదాసుగారిని వెతకి కనుగొని ఆయనతో శశిరేఖ తనను వివాహ నియ్య కొనెనని చెప్పెను. ఆయన పరమానందభరితుడయ్యెను. ఈ శుభవార్త తనకు తెలిసిన వారందరితోడను చెప్పుచుండెను. రామారావు నచటనే యుండి తటస్థించి నది.

రామ – ఈ వార్త అబద్ధము. ఇట్లాంటి వార్తలెందుకు పుట్టిస్తారు?

నవజీవనదాసుగా రాశ్చర్యపడిరి. ఈయనయే రామారావని ఆయనెరు ఈయన యెవరిట్లు మాట్లాడుటకు?

నవ – ఏమిటండీ?

రామ – శశిరేఖ ధర్మారావును పెళ్ళి చేసుకుంటుందని ఎవరు చెప్పిన

నవ – మీకంత సందేహానికి కారణమేమిటి? ఇదిగో ధర్మారావే చెప్పిన

రామ – ఏమండీ, మిమ్మల్ని శశిరేఖ పెళ్ళి చేసుకుంటానందా?

ధర్మా – అవును. యెందుకట్లా అడుగుతారు?

రామ – అది అబద్ధం.

నవ – మీ మాటలు విచిత్రంగా వున్నాయి.

రామ – ఎప్పుడు చెప్పింది?

ధర్మ – చెప్పి ఇంకా అరగంట కాలేదు.

రామారావు ముఖము తెల్లనయ్యెను. ఎవరో ఆయనను కొట్టి అవమా చేసినట్లయ్యెను.

మాట్లాడక గిరుక్కుమని తిరిగిపోయెను.

ధర్మారావు అసత్యము చెప్పునా? అందులో ఇట్టి విషయములో? వెల్లడయిన యుపద్రవము కాదా? నిజమే, నిజమే. కాని నాల్గు దినముల క్రి





కా, తనతో చెప్పినది వేరు. ప్రేమకు తనలో స్థలము లేదని? ఏది అబద్ధము! ఇంతటి కృత్రిమముకలదా? కాని ఇదివరకొకసారి తన్నిట్లు మోసము చెయ్యలేదా? కృతమా, చంచలత్వమా, దీనికి కారణము? ఏదైననేమీ? తనతో తన నిర్మలమగు ప్రేమతో ఇట్లాడుచున్నదికదా? తానిట్లు యీ చంచలత్వమునకు దాసుడగుటయా? ఆమెతో నింక మాట్లాడకూడదు. కాని ఆ కండ్లలో అంతటి అనృతమా? ఎంత నిర్మలముగా కనబడి యుండెను? ఎంతటి అమాయకత్వము, ఎంతటి ప్రేమ తనపై చూపెను? అదంతయును మోసమేనా? ఇంక ఎవరిని నమ్మగలడు?

సాయంత్రము ఇంటికి వచ్చునప్పుడు త్రోవలో శశిరేఖకు నవజీవనదాసుగారు కనబడిరి. ఆమెను చూసినతోడనే ఆగి మెల్లగా "అమ్మా! నిన్నీశ్వరు దాశీర్వదించు నాకీ నన్నధికానందములో ముంచితి" వనెను. ఆమె కర్థముగాక ఏమిటని అడుగబోవునంతలో ఎవరో పిలువగా ఆయన త్వరగ వెళ్ళిపోయెను.

తరువాత కొంతసేపటికి శశిరేఖ రామారావును చూచి దగ్గరకు వచ్చెను.

శశి – రాత్రి వస్తావా? నిన్న రాలేదేం?

రామారావుకు మిగుల కోపము వచ్చెను. పైగా తనను పలకరించుట కూడాను?

రామ – నేనెందుకు రావడం?

శశి – ఏం అట్లా అంటున్నావు? నువ్వు రాకపోతే యింకెవరు వస్తారు? రావూ?

రామారావున కాశ్చర్యము కలిగెను. ఎంత కపటము? కోపముతో పెదవులు కొరికెను.

రామ – తోచకపోవడమేం? అబద్ధాలెందుకు చెపుతావు? ధర్మారావు లేడూ?

శశిరేఖ ఆశ్చర్యపడి, అతని కోపమునకు కారణము మేమాయని ఆలోచించెను.

నాలుగుదినములు గడచెను. శశిరేఖ తిరిగి రామారావును పలకరించలేదు. ఆయన ముఖమును చూచిననే భయము వేయుచుండెను. రామారావునకింకను శశిరేఖపై ప్రేమ పోలేదు. అందువలననే యింత దుఃఖమును కోపమును. సాయంత్రము తన గదిలో కూర్చుంది యీ విషయమునే ఆలోచించుకొనుచుండెను. హృదయము రాయవలె బలువయ్యెను. హఠాత్తుగా యీయన ప్రేమను కోల్పో

యెనా? నవజీవనదాసు గారును, ధర్మారావును, ఇకనెవరో యిద్దరు క్రొత్తవా
వచ్చి కూర్చుండిరి.

నవ - అప్పుడే ప్రస్తావించడం నాకూ యిష్టంలేదు. కాని ఇందరు వ
పకచోట కలవడం కష్టం, నీకు ఇక్కణ్ణే వుండాలని వుందని ధర్మారావు చెప్పి
నిన్ననే రాజీనామా పంపినాడు ఉద్యోగానికి. త్వరలో అతనికి ఇక్కడే ఉద్యోగ
తుంది. నేను వూరికి వెళ్ళాలి. నేనిక్కడ వుండగానే యితన్ని ధన్యుణ్ణి చే
సంతోషిస్తాను.

శశి - మీ మాటలు నాకర్థము కావటంలేదు.

నవ - ఇంకా యేం చెప్పాలి. నీ వివాహాన్ని గురించి.

శశి - నా వివాహమేమిటి?

నవ - అమ్మా, మా ముందు సిగ్గెందుకు? ధర్మారావు........

శశి - నే నిదివరకే చెప్పలేదా మీతో నాకట్లాంటి అభిప్రాయంలేదని

నవజీవనదాసుగారు ధర్మారావువైపు చూచిరి. అతని ముఖము వెల
బారెను.

నవ - ఆయనతో వివాహం చేసికుంటానని.........

శశి - నేనా? ఎప్పుడూ? ఏమండీ?

ధర్మారావు మాట్లాడక లేచిపోయెను.

నవ - ఇదేమిటో అర్థం కావటములేదు. నువ్వు అతన్ని పెళ్ళిచేసుకోవడా
వప్పుకున్నావని అతను నాతో చెప్పినాడు.

శశి- నేనెన్నడూ ఆ సంగతే మాట్లాడలేదు.

నవ-నిజంగా?

శశి-నిజమే.

క్రొత్త ఆయన - అది యెట్లావున్నా-

శశిరేఖ కండ్లెత్తి ఆయన్ని చూచెను.

శశి- ఏమిటండీ?

ఆమె ముఖమును చూచి మాట్లాడలేక ఆయన వెళ్ళిపోయెను. అందరు
లేచి వెళ్ళిరి.





ఇదియే కాబోలు రామారావు కోపమునకు కారణము! తనంతటి కృత్రిమ
రాలనుకొనెనా? తన విషయమై యిట్టివి నమ్ముటయేనా? అంత మాత్రము
విశ్వాసము లేకపోయెను గదా? తననడుగనైన అడుగలేదు కదా?

సాయంకాలమున నవజీవనదాసుగారును యింక నెవరో నలుగురు
పెద్దలును, శశిరేఖవద్దకు వచ్చిరి.

నవ - అమ్మా, యీ విషయమేమీ బాగుండలేదు. ఎవరివల్లనైతేనేమీ,
అందరికీ నువ్వు ధర్మారావును వివాహము చేసుకుంటావని తెలిసింది.

ఇప్పుడు మళ్ళీ కాదంటే అపవాదు పడుతుంది. ఆ సంగతి ఆలోచించావా?

శశి - అపవాదుపడితే నేనేం చెయ్యను? నేనేం చేశాను?

నవ - నీకు తెలీటంలేదూ? లోకులు ఏదో భ్రమపడుతున్నారు. ఆపరిదిష్ట.
నా మాట విని ఈ వివాహానికి వప్పుకుంటే చాలా సంతోషిస్తాను.

శశి - ఇంకోళ్ళు ఏమనుకుంటారు, లోకం ఏమనుకుంటుంది అంటారేం
ఎప్పుడూను? ఇంకోళ్ళని చూస్తే ఎందుకంత భయం మీకు? నేను చెప్పలేదూ
నాకాయన మీద ప్రేమ లేదని?

నవ - మళ్ళీ అట్లాగే అంటావు. వివాహం చేసుకుంటే ప్రేమ వస్తుంది.

శశి - నా సంగతి మీ కర్థంకాదు. ఈ విషయమై చర్చించి ప్రయోజనం లేనట్లు
కనబడుతోంది. ఇక్కడ జరిగే వివాహాలు చూశాను. బాల్యవివాహాలకీ వీటికి
భేదమేమిటి? పిల్లలు ఎదుగుతారన్నమాటే కాని, సరిగ్గా అందరినీ చూసి వాళ్ళ
యిష్టమయిన వాళ్ళను వివాహం చేసుకునేవాళ్ళు అరుదు. అంతా పెద్దల యిష్టం.
మొదల ప్రేమ వుండి తరవాత ప్రేమ పోవొచ్చునన్న మాటకూడా మీకు తెలీకండా
వుంది. రావొచ్చునన్నవారు పోవొచ్చునని వొప్పుకోరు. ప్రేమపోవడం మహా పాపమం
టారు. ఇక్కడ ఆడవాళ్ళు గడిపే జీవనాన్ని చూడండి. ప్రేమించి స్వేచ్ఛగా యేరుకున్న
వారితో అయితే అట్లాంటి రసరహితములైన జీవనాల్ని గడుపుతారా? ప్రేమ వారిని
ప్రతి క్షణమును మహానందములో ఓలలాడేట్లు చేస్తోందా? ఎన్నడో బంధింపబడ్డ
వాళ్ళ మల్లే, తమ యిష్టం లేకుండా కట్టబడిన వాళ్ళమల్లే, సౌందర్య నిరహితములైన
బ్రతుకులు బ్రతుకుతారు. ఇష్టమున్నా లేకపోయినా, ఒకసారి కట్టుకున్న తరవాత,

బ్రాహ్మ సంఘానికి భయపడి ఇట్లా పడివుండవలసిందేగా? ఇవేం పెళ్ళిళ్ళు? ఇట్లా
పెళ్ళి నన్ను కూడా చేసుకోమంటారా?

నవ - వీరూ నేనూ నీ శ్రేయస్సు కోరే చెపుతున్నాము. మాటలకేం మాటలన్నా చెప్పవచ్చును. కార్యంలోకి దిగితేనే గాని దాంట్లో వుండే తెలీవు. నువ్వింకా చిన్నదానవు. నీకేమీ తెలీదు. ధర్మారావు పాపం పొద్దున్న అన్నమన్నా తినకుండా విచారిస్తున్నాడు. అతనిపైన జాలన్నాలేదూ?

శశి - ఈ విషయంలో మీకంటే నాకే యెక్కువ తెలుసు.

కొత్తమనిషి - ఏమిటమ్మా!

శశి - ఏమిటండీ?

కొత్తమనిషి - ఎంత చెడ్డా ఆయన పెద్దవాడు.

శశి - నేను చెప్పేది చివరవరకూ విన్న తరవాత మాట్లాడండి. మీకిం లోకభయం సంఘభయం వదల్లేదు. అవి వదలనంతకాలం న్యాయం యేది విచా రించే శక్తి రాదు. లేకపోతే ధర్మారావుగారికి కష్టం కలిగిందని నాతో చె యేం లాభం? ఆయనకి కష్టంగా వుందని నా ఆత్మను నా స్వేచ్ఛనూ చంపుకు మీకు నా మీద దయవస్తుంది. ఎందుకు వచ్చిన స్వార్థత్యాగమది? ఆయన మా సుఖపడతాడా? ప్రేమ పోగానే, వదిలివేసే స్వేచ్ఛవుంటేనేగాని నేను పెళ్ళి చేసుకో నేను ఎవరినీ ఎప్పుడూ ప్రేమిస్తానని చెప్పలేదు. నా అంతరాత్మ మీ వాళ్ళ అబద్ధము చెప్పడానికి వొప్పుకోదు. నాతో యీ విషయమై మాట్లాడి ప్రయోజ లేదు. ఎవరేమనుకుంటారో అని నాకోసం మీరు చాలా దిగులు పడుతున్నా గాని, ఎవరేమనుకున్నా నాకెంత మాత్రమూ విచారంలేదు.

నవజీవనదాసుగారికి చాల కోపము వచ్చెను. చివరకు యీ పుత్రిక కూడా ఆమెను ధర్మజీవనమునకు త్రిప్పలేకపోయెనుగదా?

నవ - ఇంక చెప్పేదేముంది?

శశి - నాకు తెలుసును. నామీద మీకు చాలా కోపం వచ్చింది. కాని కాదూ జీవితములో నియామకాలుండాలన్నది? ఇప్పుడు మళ్ళీ మీరు చెప్పి గనక ప్రేమలేకపోయినా, నా నియామకాలన్నిటినీ పాడుచేసుకొని, పెళ్ళి చేసుకో టారా?



# 19

ధర్మారావునకు శశిరేఖ ఒకనాడు అంగీకరించి యుండునను అభిప్రాయము కలేదు. కాని యిప్పుడామె తననెందుకు నిరాకరించుచుండెను? ఆలోచించెను. తను శశిరేఖ వివాహమాడునని విన్నప్పుడు రామారావెందుకంత కలవరపడెను? ఏదో వీరిద్దరికిని మధ్య జరిగియుండును. అదియే యీ మార్పునకు కారణము. మిత్రముమీద రామారావున కీవిషయములో జోక్యము కలదు. ధర్మారావునకు తన వివేకముపై మిగుల విశ్వాసము కలదు. అతడు శశిరేఖ వద్దకు బోయెను.

ధర్మా - అమ్మా! నేనొకటి అడుగుతాను. క్షమించండి. మీరిట్లా మనసు మార్చుకోడానికి ఆ రామారావు కదూ కారణం?

శశి - నేను నిజం చెప్పేదాన్నని మీకు నమ్మకం లేనట్లుంది. నా మాటల్లో నమ్మకం లేనప్పుడు మళ్ళీ నాతో ఎందుకు మాట్లాడతారు? నేను మనసు మార్చుకోడానికి, ముందు మీకు మాట యిచ్చిందెప్పుడు?

ధర్మా - అయితే పోనీ, రామారావుగారికీ మీకూ సంబంధం ఏమిటి?

శశి - నాతో మాట్లాడదలుచుకుంటే, మీ కవసరములేని సంగతులు మాట్లాడకండి.

ధర్మారావు ఇంక సందేహమే మున్నదనుకొనెను, అతడు వెంటనే పోయి తన సందేహము నవజీవనదాసుగారికి తెల్పెను. ఇద్దరును రామారావు వద్దకు పోయిరి. నవజీవనదాసు రామారావునకు ధర్మారావు అనుమానమును తెల్పెను. రామారావను పేరు వినుటతోడనే శశిరేఖ కును ఆయనకును గల సంబంధము నవజీవనదాసుగారికి జ్ఞాపకము వచ్చెను.

నవ - ఈ విషయంలో మీకు జోక్యముండి వుండాలి. లేకపోతే ఆమె యిట్లా మనస్సు మార్చుకోడానికి కారణం కనబడదు. ఆమె శ్రేయస్సు కోరే మేమందరము ఇట్లా వుద్దేశించాము.

రామ - నాకేమీ తెలీదు.

ధర్మా - ఏమో నమ్మడానికి వీలులేదు. ఆమె నడిగినా. ఆవిడ మాటలవల్ల ఏదో మీ అభ్యంతరం వున్నట్లే తెలిసికొన్నాను.

రామారావునకు వళ్ళు మండిపోయెను. తనను మోసగించినది చాల! వీరితో యీ అబద్ధములను కూడా చెప్పుచుండెనా? ఆమెకిట్టి కొంటెతనమెందుకు ఇష్టము? తన కింకను బాధ కలిగించి చూచి ఆనందింపవలయునని కాబోలు

రామ - ఆమె అన్నదా! రండి అడుగుతాను.

అని ఆశ్రమములోనికి ధర్మారావుతో గూడ వడివడిగా నడిచెను. శశి గదిలో లేదు. డాబా పైకి వెళ్ళిరి. ఆమె డాబాపై నిలుచుని అస్తమించు సూర్యుని మేఘములకు వేయు రంగులను చూచుచుండెను.

రామ - శశిరేఖా, యీయన్ని నువ్వు వివాహం చేసుకోకుండా నే నడ్డుపెడుతున్నాననుకుంటున్నాడే ఆయన?. నువ్వు కూడా అట్లానే అన్నావుట, నిజమే!

శశి - (ధర్మారావుతో) ఏమిటండీ యీ అల్లరి?

రామ - నా అభ్యంతరం ఏమీ లేదని చెప్పడానికి వచ్చాను. అంతే.

శశి- అభ్యంతరం లేదుకదా? ఉందేమో ఎట్లాగా అని భయపడుతూ ఇన్నాళ్ళూ!

రామ - నన్ను చూస్తే నీకింత వేళాకోళమా?

శశి - నన్ను చూస్తే నీకింత అవిశ్వాసమా?

రామ - ఎవరికేదో నీకు తెలీదా యేమిటి?

శశి - ఇప్పుడు తెలీదు. కళ్ళుంటేగా?

రామ - చాలా మర్యాదగా వుంది! వచ్చింది నాదే బుద్ధి తక్కువ. ఇక చాలు వెడతాను.

అని వెళ్ళెను. ధర్మారావును అతని వెనకనే వెళ్ళెను.

శశి - రామూ, ఇట్లారా.

రామారావు తిరిగి వచ్చెను. వెనుక ధర్మారావు కూడ వచ్చెను.

శశి - మిమ్మల్ని పిలవలేదు.

ధర్మారావాశ్చర్యముతో చూచెను.

శశి - మీరు వెళ్ళవచ్చును.

ధర్మారావు కదలేదు.



శశి - వెళ్ళండి.

ధర్మా - నేను వెళ్ళను. మీరు నా అధికారం కింద ఉన్నారు. మిమ్మల్ని బాధనతో వంటరిగా వదలి వెళ్ళను.

శశి - మీ అధికారమేమిటి?

ధర్మా - నవజీవనదాసుగారు. నన్ను మిమ్మల్ని చూస్తోవుండమన్నారు.

శశి - నవజీవనదాసుగారెవరు మిమ్మల్ని చూడమన్డానికి?

ధర్మా - అది నాకు తెలీదు. ఆయన అజ్ఞతో ఇక్కడే వుంటాను.

శశి - బాగానే వుంది! మంచివారే!

రామా-వెళ్ళండి.

ధర్మా- మధ్య మీరెవరు?

రామారావాయన మెడ పట్టుకొని మెట్లవద్దకు తీసుకుపోయి కిందికి తోసి తలుపు వేసెను.

శశి - నేనతన్ని పెళ్ళి చేసుకుంటాననుకున్నావా?

రామ - ఆయనే చెప్పినాడు, నువ్వు వొప్పుకున్నావని.

శశి - అబద్ధం. ఈయన్నా!!!

రామ - నిజంగా!

శశి - నీకంత నమ్మకం లేకపోయింది కదూ? నమ్మావు కాదా?

రామ - ఇది మొదటిమాటు కాదుగా!

శశి - నువ్వింకా అది మరచిపోలేదూ? పోనీ, ఆ నేరం నుంచే నా విశ్వాసం ఎట్లాంటిదో నువ్వు గ్రహించి వుండవచ్చునే.

రామ - శశీ! నన్ను క్షమించు, నీ స్వభావాన్ని ఇన్నాళ్ల కీ అర్థం చేసుకోలేక పోయినాను.

శశి - పాపము, నీ మనస్సులో ఇంకొకరి సంగతి ఆలోచించడానికి చోటులేక పోయింది.

రామ - ఎందుకూ?

శశి - సంగతి ఆలోచించడానికే నీకు తీరుబడి లేకపోయింది. వాళ్ళ
వాళ్ళే చూచుకునేవాళ్ళు ఇతరులని ఎన్నడూ అర్థం చేసుకోలేరు.

రామ- నా మీద అంత కోపమా? దయరావడానికి ఏం చెయ్యను?

శశి - ఎన్నటికీ నేను నీ దాన్నే. నువ్వు ఎరగక సందేహిస్తావు గానీ

రామారావు ఆమెను దగ్గరకు లాగుకొని ముఖముపై ముద్దు పెట్టుకొను
ఇంతలో తలుపు తెరుచుకొని నవజీవనదాసుగారు ప్రవేశించిరి.

నవ - శశిరేఖా ఏమిటిది? నీ అభిప్రాయాలెట్లావున్నా ఏమీ ఎరగని
వాడితో నువ్విట్లా వుండడం నేను వప్పుకోను.

శశి - ఒప్పుకోకండి. ఆ సంగతి చెప్పడానికి వచ్చారా ప్రత్యేకం?

నవ - నీతో వాదిచలేను. కాని ఇట్లాంటివి ఇక్కడ వప్పుకోము.

శశి - సరే, నా అభ్యంతరమేమీలేదు. వప్పుకోకండి. నన్నేం చెయ్యమంటా

నవ - నా అధికారంలో వున్నంత వఱకూ ఇట్లాంటివి చెయ్యకూడదు

శశి - కారణం చెప్పకుండా ఇట్లాంటి ఆజ్ఞలు పెట్టే అధికారం నేను
కోను. నేను మీ ఇంట్లో స్వతంత్రంగా వున్నాననుకొన్నాను. మీ అధికారం క్రి
నన్ను నేను ఎప్పుడూ పెట్టుకోలేదు. ఇట్లా అని తెలిస్తే వక్క నిముషం వుండే
కాదు. స్త్రీ స్వతంత్రంగా వుండవచ్చును, ఎవరి అధికారం కిందా వుండకు
అనే అభిప్రాయం పాపం యింకా మీ మనసులో ప్రవేశించలేదు

నవ - అల్లాగా, పోనీ, నా పూచీమీద తీసుకువచ్చాను నిన్నిక్కడికి. వీళ్ళ
నా అభిమానం కాపాడతావా?

శశి - నా సంగతులు ఊహలు దాచకండా మీతో ఎన్నిమార్లో చెప్పిను
అయినా యెంతో దయతో మీరు నన్నిక్కడికి తీసుకోచ్చారు. నాకు ఏ మొగాడితో
వంటరిగా మాట్లాడడం ఏ మాత్రమూ తప్పులేదు. అది మీకు తెలుసు.

నవ - నిన్నిక్కడకు తీసుకురావడం నా తెలివి తక్కువే కావచ్చు, ఈ
ఆశ్రమంలో వీరి కిట్లాంటివి ఇష్టముండవు. కనక ఇక్కడున్నంత కాలమైనా
వుండాలి.

శశి - అయితే, యింత దుష్కార్యము చేస్తూ వీరికి కష్టం గలిగించ
నా కిష్టములేదు. మీరు గనక రైలు చార్జీయిస్తే యీవేళే వెడతాను.



నవ - రేపు మధ్యాహ్నం నేనూ బయలుదేరుతున్నాను. అందాక...........

రామ - ఈ వాదన ఎందుకండీ, ఈమె నన్ను వివాహం చేసుకోడానికి
ఒప్పుకుంది. ఇప్పుడన్నా వంటరిగా ఆమెతో మాట్లాడవచ్చునా?

శశిరేఖ ఆశ్చర్యముతో కండ్లెత్తి చూచెను.

నవ - నేనెవర్ని చెప్పడానికి? అయినా వివాహం అనేదానికే తనకు అభ్యం
తరం అన్నదే! మిమ్మల్ని చూడగానే అభిప్రాయం మార్చుకున్నదేమో?

రామ - అది ఆమె యిష్టము.

నవజీవనదాసు వెళ్ళిపోయెను.

శశి - ఎందుకట్లా అన్నావు? నేను వివాహం సంగతి ఏమీ అనలేదే?

రామ - వివాహం కాక యింకేమిటి?

శశి - నాకు పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదు.

రామ - ఏమీ?

శశి - ఎల్లప్పుడు ఒకళ్ళదాన్ననీ, నా ప్రేమ ఎప్పుడూ పోదనీ వీళ్ళమల్లే నే
బొంకులు చెప్పలేను.

రామ - ఇవన్నీ మునుపు మనమనుకున్నవేకదూ? అప్పుడు నువ్వు
వప్పుకోలేదూ?

శశి- అప్పుడు నాకు తెలిసింది కాదు. అట్లా వప్పుకోవడం తప్పే. ప్రేమ
స్థిరంగా వుంటుందని ఏమీ విశ్వాసములేదు. ఉంటుందనుకొని కళ్ళు మూసుకొని
అబద్ధం చెప్పి పెళ్ళి చేసుకున్నా మనకు శాంతి వుంటుందా? నాకు నమ్మకం
లేనిది నన్ను అబద్ధం చెప్పమంటావా?

రామ - అయితే మనం విడి వడవలసిందేనా?

శశి - ఎందుకు పెళ్ళి పెళ్ళి అంటావు?

రామ - పెళ్ళి కాకపోతే నా అంతరాత్మ వప్పుకోదు.

శశి - నా అంతరాత్మ మాత్రం వప్పుకుంటుందా? నానమ్మకము మరి
పెళ్ళి ప్రేమను చంపుతుందని.

రామ - నిన్ను మళ్ళీ కలుసుకున్నాను కదా అని సంతోషపడ్డాను చివరికి
ఇంతే.

శశిరేఖ మాట్లాడలేదు.

రామ - అయితే వెడతాను.

శశి - ఇంతేనా నీ ప్రేమ? ఇప్పుడు నువ్వు వదిలేస్తే నేనేమయి పోను స్నేహితులు లేరు. బంధువులు లేరు. ప్రేమ లేదు. సుఖం లేదు. ఎందుకు బ ఎవరికోసం బతకను?

రామ - శశీ, నన్నేం చెయ్యమంటావు?

శశి - నాతో నీకు యిష్టం లేనట్లుండక్కరలేదు. నీతో వుండనియ్యి అ చాలు, నీవు తప్పితే ఈ లోకంలో నాకింకేమీలేదు. మగ స్నేహితులమల్లే వుండు

రామ - నేను మాత్రము మనిషినేగా? నీ దగ్గిర వుండి నన్ను వుండగలనా? ఇవన్నీ యెందుకు? నేను వెడతాను.

శశి - ఇంతేనా, పోనీ, ఆలోచించడానికన్నా వ్యవధి యివ్వవు. రేపు ఒక్క

రామ - తెల్లవారకట్ట అవసరంగా వూరికి వెడుతున్నాను.

శశి- రేపు, మేము వూరికి వెడుతున్నాముగా మరి? నువ్వు ప్రయా మానెయ్యకూడదూ?

రామ- చాలా అవసరం.

శశి- పోనీ, ఈ రాత్రి ఒక్కమాటురా.

రామ- నేనింక ఇక్కడకు రాను. వీళ్ళను చూస్తే కోపంగా వుంది వంటరిగా మన్ని మాట్లాడనీరు.

శశి- అయితే నేనే సాయంత్రం మీ యింటికి వస్తాను. కొంచెం పొద్దుపో అయినా వస్తాను. మేలుకునుండు.

రామ- సరే.

## 20

సాయంత్రం యేడు గంటలయినది. డాబా పైని శశిరేఖ ఆలోచి కూర్చుని యుండెను. గాఢాంధకారము ఆమె చుట్టును ఆవరించినది. వీధిలో బండ్ల చప్పుడును, జనముల నడక చప్పుడును వినవచ్చుచున్నది. దూరము



త్తయిన యింటి యందలి దీపములు నక్షత్రములవలె మెరయుచుండెను. ప్రక్క ంటి మేడలపై సాయంత్రము నిలుచుని నవ్వు వారి సంతోష స్వరములు వినవచ్చు చుండెను. దూరముననుండు వీధుల ఎలక్ట్రికు దీపములు బారులుతీర్చి కనబడు చున్నవి. ఆకసమున నక్షత్రము లీదీపములకన్న తమ శక్తిని చూపుటకై ప్రయత్నించు చున్నవో యనునటుల మిడిసి పడుచుండెను. వింత వింత తలపులామె మనసున పుట్టుచున్నవి.

వివాహములేక రామారావు తనతోడి జీవితమున కియ్యకొనడనుట స్పష్టము. ఇక అతనిని వదలవలసినదేనా? నవజీవనదాసుకు తనపై కోపము వచ్చెనుగదా? నపటి మిత్రుడట్లస్తమించెను. ఇంక లోకమున తనను కోరువారెవ్వరు? రామారావును చూచినతోడనే పాత ఆశలన్నియును మొలకలెత్తి యుండెను. తిరిగి తనకు ప్రేమ జీవనము లభించుననుకొనెను. ఇతనిని కూడ వదలవలసిందేనా? ప్రేమ శూన్యమును, నిరర్థకమునగు జీవితమును గడపవలసినదేనా? తన జీవిత ప్రవాహమొక యంత మునకు వచ్చినది. ఇంక స్వకీయానందము కొరకు జీవింప లేదు. తమ సౌఖ్యము కొరకే జీవించుచు, నియమములులేక జీవిత ప్రవాహమున కొట్టుకొని పోవువారిని తానింక ప్రేమింపలేదు. ఆమె స్వభావమే మారినది.

మొదటనుండియు శశిరేఖ స్వభావము సౌందర్యమును కోరుచుండెను. సుందరమగు కన్నులును, సుల్లలితమగు దేహమును, మృదు ప్రేమా హృదయమును గల కృష్ణుని ప్రేమించెను. ప్రేమా సౌందర్యము లేనివానిని తన తల్లిదండ్రులు కట్టి పెట్టుటచే ఆమె వారి ఆజ్ఞలకు తిరుగబడెను స్వేచ్ఛగ కృష్ణుని ప్రేమించెను. తనకు తెలియకనే తన జీవితమును వెన్నెలలో, పక్షి ఋతములలో, నీటి శబ్దములలో. పువ్వుల సుగంధములలో, మలయమారుతముతో నాతని కర్పించెను. సౌందర్యదేవత యాలింగనమునకు నీతిని, మర్యాదను, సంఘమును. తల్లిదండ్రులను, గృహమును, భర్తను బలియర్పించెను. గాఢాంధకారమున మత్తు గలిగించి పూవుల సువాసనల యందు, మందు నక్షత్రముల కాంతి క్రింద రక్తమును పరువెత్తించు గాన మాధుర్యమున, జీవనమును ఒక్క నిమిషమున అతి క్రూరముగ దగ్ధముచేయు సుందరరావు ప్రేమాగ్నికి లోబరిచెను. జీవనము కందినది, హృదయమున గాయములైనవి. బొబ్బలెక్కినవి. శాంతి, శాంతి, శాంతి. రామారావు ప్రేమమందు ఆత్మీయ సౌందర్యమున ఆమె శాంతిని గాంచెను. కాని అతడు ప్రత్యుపకారముగ

ఎవరును కోరని నిబంధనమును కోరెను. తన స్వేచ్ఛ నర్పింపమనెను. జీవన్మరణమున గాయములు చెందియుండు శశిరేఖ, తన స్వేచ్ఛ నిచ్చివేయ సంసిద్ధపడెను. కాని జీవన రహస్యమును కనుగొనిన యిప్పటి శశిరేఖ కియ్యకొనుటలేదు. ఆమె నవజీవనదాసుగారినుండి జీవితా దర్శమును స్వీక జీవనము ప్రత్యేక వ్యక్తి శక్తుల నభివృద్ధి పరచుటకు, జీవన రహస్యము స్వకీయ నిగూఢశక్తుల సార్థకము గావించుకొనుట, శాంతికొరకు, ఆశా మానవ ప్రేమకొరకు స్వేచ్ఛ నర్పింపగలదా? సౌందర్యానుభవ విహార సంపూర్ణమగు స్వేచ్ఛ కావలయును. ఒక్కక్షణమున స్థిరముగాని చలనమున సౌందర్యానుభవము వీలుకాదు. చలనము, జీవనము స్థిరత్వము. మృతి కా శాంతిని నవజీవనదాసుగారి యింటియందు, ఆత్మసాధన యందామె యుండెను. కావలసినది శాంతికాదు. కావలసినది సౌందర్యము, సౌంద కృష్ణునినుండి ఏ శరీర సౌందర్యమును పొందెనో, సుందరరావు నుండి ఏ సౌందర్యమును పొందెనో ఆ సౌందర్యమే యింకను కావలయును. కావలయును, నిరంతరమును జీవనమున్నన్నాళ్ళును కావలయును. రామా వద్దనుండు ఆత్మీయ సౌందర్యమును ప్రేమించెను. కాని దానితో తృప్తినందగ తన సౌందర్యాభిలాష ఎన్ని విధములుగ మారునో, ఎన్ని రూపములు దాల్చ ఎన్ని నూతన వాంఛల నెలకొల్పునో, గడచిన జీవితము ఆమె హృదయ నిరంతరము మారుచుండునని యామెకు తెల్పెను. ఇతను గూడ నిరాశ చెంది గలదా? ఇతడు వివాహము ప్రేమానుబంధము మాత్రమే ననుకొనుటలేదు. వారివలె తనకు నాతనికి సంబంధమున్న చాలుననుకొనుటలేదు. వివాహ కాధ్యాత్మికముగ నర్థమిచ్చుచుండెను. తనలో తన ప్రేమలో ఈశ్వరుని ప్రే ననుభవించుచున్నా ననుకొనుచుండెను. అందువలననే వివాహమని యీ పద్ధ చలించు తన ప్రేమను కోల్పోయేనా, అతని హృదయము పగులగలదు. అ వివాహము చేసికొనుట అతని శ్రేయస్సునకే కాదు.

శశిరేఖకు సౌందర్యమే నీతి. వేరు నీతి లేదు. రామారావునకు నీతి ప్రధానము నీతికీ తనలో లోపము కనుగొనెనా రామారావు వ్యసనపడును. తన మార్గమునకు రాకున్న అతడితోడి జీవనము తనకును దుస్సహము.

శశిరేఖకు సౌందర్యమే నీతి. దొంగతనము, అబద్ధము. ఆమెకు వికారమైన పనులు, కనుక వారిని చూచిన అసహ్యము. రామారావు నీతి



ది లోకపు అభిప్రాయములపై యీశ్వరుని యుద్దేశ్యములపై ఆధారపడ్డది. శశిరే తి సుందరమగు ఆమె ఆత్మనుండి ప్రవించిన అనందప్రవాహము. రామారా టి అర్థంకాదు. అందువలననే వివాహముపై అతని కాపట్టుదల. ప్రేమలేకున్న ర్తతోనయినను నివసించుట ఆమెకు రోత, వికారము. మాయ ప్రేమ చూపుట మె చూపులలో పాపము. ఈ అభిప్రాయము రామారావునకు రాకున్న అతనితో జీవనము కష్టము.

హృదయమున నిరాశ యొకటి యుదయించెను. జీవితమున తనకింక యుద్దేశ్యమేమియు లేనట్లు తోచెను. ఇంక ఆనందమును శాంతియు లేవు తనకు తన స్వేచ్ఛను కోల్పోవు జీవితము దుర్భరము. నియమములు లేనివారితోడి జీవిత మంతయు దుర్భరము. ప్రేమలేని వంటరి జీవితము మరణతుల్యము. సంఘము శశిరేఖ అభిప్రాయములతో అభివృద్ధి నొందలేదు. నవీనాభిప్రాయములుగల రామారావే యామె యభిప్రాయముల మన్నించుట లేదు. ఇంక నామె కాశ యెక్కడ? నీతి భక్తి జీవనము తనకురాదు. స్వేచ్ఛా జీవనమున ప్రేమలేదు. ఇంక జీవించియు జీవింపకయు నొక్కటే.

ఆహా! ప్రేమాప్రవాహమున కాకున్న జీవనమెందుకు? నీతి కాదా ప్రేమ నీ విధముగా చంపునది? ఎట్టి అసహజమగు బంధము నేర్పరచుకొనెను. మానవుడు? నీతియని జీవనానందమును కోల్పోవువాడు, చేతులు కట్టుకొని, కదలు స్వేచ్ఛను కోల్పోయిన వానివలెనే కదా? ప్రేమయే జీవన రహస్యము.

తన హృదయమున నుద్భవించి పరిపూర్ణానుభవముకొరకు పెనుగులాడు ఆరాటముల నావేశముల నెవరెరుంగుదురు! ప్రేమలేక సౌందర్యములేక తానున్నప్పు డవి యుప్పొంగి, అణగక, లొంగక తనను పెట్టు మహబాధ లెవ్వరికి తెలియును? ప్రేమను సౌందర్యమును గోరు తన మహాతృష్ణను, నరనరమును ప్రతి రక్త బిందు వును, లాగి, పీల్చి, నలిపివైచు యా తృష్ణను, ఎవరితో చెప్పిన నెవరు కనికరింతురు? దేహ సౌందర్యమునగాని, ఆత్మ సౌందర్యమునగాని తన ప్రేమ తృప్తినందదనిన తన నర్థము చేసుకొను వారెవ్వరు? ఇతర స్త్రీలవలె తానేదో యొక్క మానవునితో, ఏదో ఒక విధమగు శాంత జీవనముతో సంతుష్టి నందలేదనిన, నిజమని నమ్మువారెవరు? తనతో యీ యాదర్శములలో, వాంఛలలో, బాధలలో, సానుభూతి చూపగలవారెవ్వరు? దుర్నీతికై అపవిత్రతకై దేహ సౌఖ్యము కొరకై పన్నిన

పన్నాగమందురు. ఈ జీవనమున నింక ఆశలేదు. లోకాభిప్రాయములపై నాథుడు బ్రతుకు రామారావా తన ప్రేమను సంతుష్టి పరచునది? ఈ జీవితమున ఇక ఆశలేదు. తాను మరణించిన, యీ ఆశలు, యీ తృష్ణ పరిపూర్తి నొందునేమో ఈ శరీరము రాలిన ఈ బంధనము వదలిన, ఈ బాధ తప్పునేమో? మరణము రాకూడదా? కాని చావనిన ఆమెకు మహాభీతి యుదయించెను. ఆ తెర తరువాత ఏముండునో కదా?

నిముషము నిముషమును తన రంగుల మార్చుచు, వజ్రమువలె పరమ యొక నక్షత్రము మెరయుచుండెను. పరువెత్తి రెండు చుక్కలు గీతలవలె రాలి మాయమయ్యెను. నల్లని మబ్బొకటి ఆ నక్షత్రమును కబళింప ప్రయత్నించు చుండెను. సన్నని చంద్రుడు ఒక పెద్దమేడ శిఖరము క్రిందికి జారుచున్నట్లుండెను. దగ్గరనున్న మేడపై ఒక పురుషుడును స్త్రీయు నిలుచుని యుండిరి. గదిలోని దీపపుకాంతి వారిపై బడుచుండెను, యీమెను వారు చూడలేదు. అత్తరుల వాసన ప్రసరించుచుండెను. శశిరేఖ మెడలో వేసికొనిన మల్లెమొగ్గలు విచ్చి వాసన వేయు చుండెను. ఆ మేడమీద స్త్రీ చేతులు చాచి ఆ పురుషునివైపు తిరిగి ఏవో జావళి నవ్వుచూ. పాట పాడుచుండెను. ఆ కంఠము శశిరేఖ హృదయమును దూసుకొని లోన ప్రవేశించెను. మహా కలవరమొకటి యామెను కదలించెను. చల్లని గాలి కుంపట్లలోని చిన్ని మొక్కల కదల్చుచు వీచెను. గాలితోపాటు ఆ స్త్రీ కంఠ స్వరము కూడ యూగుచుండెను. గాలి కామె పైట చెరగు కదిలెను. ఆమె సవరించుకొని పాడుచునే ఆ పురుషునివంక చిరునవ్వుతో చూచెను. ఆమె నేత్రములపై దీపము తళుక్కుమనెను. ఆహా యెంత ప్రేమ ఆ చూపులలో!

శశిరేఖకు మనసు తలపులతో ఆవేశములతో పరుగెత్తుచుండెను. ప్రేమ యందు జీవనమును దగ్ధము చేయుటయే పరమావధి. ప్రేమ శక్తి నెవరు తిరస్కరింప గలరు? మదనాస్త్రముల తాకు కవచ మింత వరకు కనిపెట్టినవారు లేరు. రామారావు మాత్రము నీతినీతియని పెద్ద పలుకులే కాని తన ప్రేమను వదలగలడా? ఆ శక్తిచే అతనిని లోబరచుకొనలేదా? ఇతడా తనను నిగ్రహింపగలిగినది? ఇన్ని దినములనుండి తనను దూరముననుంచుచున్నాడు? తన ప్రేమతో వెళ్లు తున్నాడు? ఏ అభ్యంతరమును చూపక అతని పాదములపై ప్రణమిల్లి నంత కదూ అతనికింత అభిమానము? తన ప్రేమకన్న నీతి నియమకములా అతనికి కావలసినది? ప్రేమ కొరకు నీతినియామకములా, నీతినియామకముల కొరకు



ప్రేమ? ఒక్కసారి అవినీతిని దగ్ధము చేసిన, అతనిని తన పాదములవద్ద వ్రాలునట్లు చేయగునో? తన సౌందర్యమంత మాత్రము చేయజాలదా? సౌందర్య వికాస మామెయందు విజృంభించెను. ఆనాటినుండి పురుషుని తన దాసునిగ చేసికొనిన సాహంభావ మామె రక్తమున పొంగెను.

స్నానమును భోజనమును గావించెను. ఆ దేహమును రాణింపచేయునటుల పట్టు పెట్టుచీర ధరించి ఆ దీర్ఘశిరోజములనిండ, వంటినిండ మల్లెదండలనే చుట్టెను. ఆహా, ఆ అందము? కండ్లనుండి ప్రేమ కారుచున్నట్లుండెను. చిన్ని నవ్వుతో ఆమె ఎర్రని పెదవులు మాధుర్యమును పల్కుచుండెను. ఏమియు ఎరుగని అమాయకత్వము, చిన్నపిల్లల కుండునట్టి విశ్వాసము, ఆమె ముఖమున చరించు చుండెను. ఒక ముడుతయులేని ఆ చెంపలును, వంకర తిరిగిన ఆ గడ్డమును, ముఖము అతి సుందరముగ కన్పించుచుండెను. చీరెలో నుండి మెరయు ఆ మేను రంగు, యౌవనమున యూగు నడకలతో ఆమె క్రిందికి దిగెను. గదిలో ఆడువారు బిగ్గరగ నవ్వుచు మాట్లాడుచుండిరి. ఆమెను చూచుటతోడనే నవ్వులును మాటలు నాగెను. స్తంభింపబడిన వారివలె అందరి చూపులు నామె వైపునకు తిరిగెను. వారి హృదయముల నామె వెనక దుమ్మున లాగుచు, ఒక చిరునవ్వు నవ్వి వీథిలోనికి పోయెను. రోడ్డుమీద దీపముల కాంతికి దూరముగ నడచు చుండెను. అమెను చూచి వారామె వెనుకనే చూచుచు నిలువబడిరి. అట్టి అందమయిన స్త్రీ లచట ననేకులుండిరి గాని ఆమె హృదయమున జ్వలించుచు, ఆ తీక్షణత్వము నామె ముఖమున ప్రకాశింపజేయు ఆమె యుద్రేకము లామె ముఖమునకు జ్వలించుచు యందము నిచ్చెను. ఆ నూతన సౌందర్యమును చూచుటతోనే ప్రజలు విస్మితులగుచుండిరి. తానెరుంగని కొత్త యావేశము లామె యందు జనించి మనసును కలవరపరచుచుండెను. ఏవో ఎప్పటివో ఎరుగని సౌఖ్యము నందిన నిముషములు తిరిగి జనించి నశించుచుండెను. ఏదియో అందరానిది కావలయునని ఆత్మ ఆవేశమునందుచుండెను. అందరానిదానికొరకు జీవితము చేతులు చాచుచున్నట్లుండెను. ఏమి కావలయును? ఏమి కావలయును? తెలియదు. అనుభవము, అనుభవము స్వర్గతుల్యమగు ప్రేమానుభవము. లేకున్న నిముషముల కాల్చు నరకము. ఇంక నిద్రించు జడత్వము జీవితమున కక్కరలేదు.

రామారావు గదివద్దకు మెట్లెక్కిపోయి తలుపుతట్టెను. రామారావు దీపము చేతబట్టి తలుపుతీసెను. గదియంతయును తెల్లని వెన్నెలు. బల్లపై గాజు గిన్నెలో

పెద్ద తెల్ల గులాబి పూలుండెను. ఒక మూల తెల్లని చిన్న మంచము, కుర్చీలు, ఒక సోఫా రామారావు రెప్పవాల్చక శశిరేఖ వంక చూచెను.

రామ – శశీ ! ఎన్నడును నిన్నింత అందముగా చూడలేదు. ఎట్లా యింత అందంగా?

శశి – నిజంగా?

రామ – నిజం, దూరమున కనపడని మబ్బులోనుండి వచ్చు మెరుపు తళతళలాడు ఆకాశమువలె వుంది నీ ముఖము. ఇట్లా కూర్చో?

అని చెయ్యి పట్టుకొని ఆమెను సోఫామీద కూర్చుండబెట్టి తాను కూర్చుండెను.

రామ – నీవు రావనుకున్నాను. అందుకనే దీపం తగ్గించి నిద్ర పోబోతున్నా నీవు వచ్చేటప్పటికి.

శశి – నేను రాలేకపోతే అట్లాగే నిద్రపొయ్యేవాడవే కదూ? ఇంక నన్నెప్పుడు చూశేవాడవు?

రామ – మఱి యింకేం చెయ్యను?

శశి – నేనే నువ్వయితే శశిరేఖను వెతుక్కుంటో వచ్చేవాణ్ణి.

రామ – వెతుక్కుంటూ వస్తే లాభమేమన్నా వుంటేనా?

శశి – నిజం చెప్పు నా మీద ప్రేమ వున్నదా?

రామ – ఇని దినాలూ నీ కోసమే కాచుకొని వున్నానే ! ఇంకా సందేహమా

శశి – నాకు తెలుసునులే? నా మీద కాదు నీ ప్రేమ. నీ మనస్సులో పవిత్రురాలయిన శశిరేఖమీద. చిన్నప్పుడు నీకు వాగ్దత్తం యిచ్చి, నిన్ను చేసుకొని, నిన్నే దైవంగా కొల్చే శశిరేఖ మీదకాదూ, నిజం చెప్పు ఆ నాది. గనుక నా మీదనే గావును ప్రేమ వుండవలసింది అనుకుంటావు. కర్తవ్యమనుకుంటావు. కాని తీరా నా దగ్గరకు వచ్చి, నా స్వేచ్ఛా, నా మాటలూ నా నడతా చూచి భయపడి, ఇది నా శశిరేఖ కాదే అని ఆశ్చర్యపడుతూ వుంటావు

రామ – ఛీ ! ఛీ ! కాదు. కాని ఇంతకూ నీ వేమి నిశ్చయం చేసుకున్నా

శశి – అదేదో చెప్పేసి పొమ్మంటావు. అంతేనా?



రామ – చెపుదూ!

శశి – ఇట్లారా! దగ్గిర కూచో, చెపుతాను. ఆ ఒక్క మాటతో అవుతుందా మన ప్రేమ అంతా? నిజం చెప్పు, పెళ్ళి చేసుకుంటేనే గాని ఈశ్వరుడు మనం కలిసి ఉండడం వప్పుకోడూ?

ఆమె అతని తొడపై చెయ్యి వేసెను.

రామ – వివాహమంటే పరస్పరాభివృద్ధి కొఱకు, సంతానాభివృద్ధి కోసం రెండు ఆత్మలు కలవడం.

శశి – ఎందుకో అందుకు. రెండు ఆత్మలు కలవడమేగా కావలసింది! వే. ఇంక ఎవరో కలపడమెందుకు ?

రామ – ఈశ్వరుడిముందు కలసినట్లు.

శశి – మనమే కలుద్దాం, యీశ్వరుడి ముందు.

రామ – సంఘం వప్పుకుంటుందా అట్లా అయితే ? సంఘానికి తెలియాలి.

శశి – తెలుపుదాం.

రామ – ముందు అనుజ్ఞ పొందాలి. అదే పెళ్ళి

శశి – అయితే యీ పెళ్ళిళ్ళని సంఘం వప్పుకుంటుందా?

రామ – ఆ బ్రహ్మ సంఘం వప్పుకుంటుంది.

శశి – సంఘమంటే ఎంతమంది వుండాలేం? మన యిద్దరం, ఇతరులతో మనకేం పని అనుకుంటే ఒక సంఘమవుతాం. అప్పుడు మన పెళ్ళి మనం వప్పుకుంటే సరి.

రామ – అట్లా ఎట్లా అవుతుంది? సంఘం ఈశ్వర స్వరూపం.

శశి – మంచి స్వరూపమే. ముందు సంఘమెవ్వరు మన కనుజ్ఞ యివ్వడానికి? ఎప్పుడు దాని అధికారానికి లోబడతామన్నాము మనం? సంఘం చెడిపోతుందనే మిషమీద తాము వదలడానికి ధైర్యంలేని సమస్త నీచమైన కార్యాలూ, సమర్థించుకునే వాళ్ళమల్లే మాటలాడుతున్నావే! బానిసలయిన భార్యలనూ, భార్యలను మృగాలకన్న నీచంగా చూసే భర్తలనూ, గౌరవిస్తుందికదా సంఘం? మంత్రాలు చదివి శాశ్వతంగా కట్టివేశామని, ఆ బంధనంనించి తప్పించుకొన్న

వాళ్ళని నీచపు పేర్లతో పిలుస్తుంది సంఘం. తనకు భయపడి తనవలెనే పిరికిత లేనివాళ్ళని వెలివేస్తుంది సంఘం. అట్లాంటి సంఘాన్ని చూస్తే నీకంత గౌ మేమిటి? మన ప్రేమను అర్థము చేసికొనగలదా సంఘం? స్వేచ్ఛ యనిన యు పడు సంఘము ఆదేశించాలా మన వివాహాన్ని? అంతమాత్రము స్వతంత్రము ఆలోచింపలేవూ?

రామ - ఈ వాదన యింకెందుకు? శాశ్వతమైన సంబంధముంటేనే వివాహము కాదు. ఇంక మాట్లాడి ప్రయోజనమేముంది?

శశి - అట్లాంటి సంబంధం నా స్వభావమే కాదు. నా నైజమే స్వే స్వేచ్ఛ నిచ్చివేసి నేనెందుకు బతకడం? ఎంత ప్రియమైనవానికి కూడా దీనినియ్యలేను. దాన్నడక్కు నా దగ్గరనుంచి. నాకు సందేహంగా వుంది చెప్పు ఎప్పుడో నీకు చిన్నప్పుడు ప్రమాణం యిచ్చాననేనా నా మీద ప్రేమ, లేక అంతకన్నా వుందా? నన్ను మొట్టమొదటిమాటు ఇప్పుడు చూశావనుకో, నా యీ ప్రేమ వచ్చి నన్ను పెళ్ళి చేసుకోమని అడిగేవాడవేనా? నిజం చెప్పు

రామ - ఈ ప్రేమ వచ్చేదే కాని, ఎట్లాగో వకలాగు అణుచుకొనే కాని పెళ్ళి మాత్రం చేసుకోమని అడిగేవాణ్ణి కాదు.

శశి - మఱి ఇప్పుడెందుకు అడుగుతున్నావు? చిన్నప్పటి వాగ్దత్తా నేను నీ దాన్ని, నీవు నా వాడవు అయినామని నిజంగా నా మీద ప్రేమ లేకపోయినా ఆ వాగ్దత్తాన్ని పట్టి నన్ను పెళ్ళి చేసుకోవాలనుకునేవాడవే? నేనేం చేసినా నీ అనుకుంటావు?

రామ - అవును. నువ్వు నా దానివే. నీ వెట్లా అనుకున్నా నేనెప్పుడూ వాణ్ణే అనుకుంటాను. వివాహం చేత నిన్ను నా దాన్ని చేసుకు కాపాడతాను

శశి - అమ్మో ! చిన్నప్పుడు తెలిసీ తెలవక నీదాన్నవుతానని చేసిన ప్రమా ఆజన్మాంతం నన్నిట్లా పట్టుకుండే, యిప్పుడు మళ్ళీ వివాహం వాగ్దత్తం దాన్నయినా ననే వాగ్దత్తం చేస్తే యింక యీ జన్మమే కాదు కదా జన్మ జన్మ వదులుతావా?

అని నవ్వుట మొదలు పెట్టును.

రామ - నన్ను చూస్తే అంత అయిష్టమంటే నిన్నిట్లా బాధించేవాణ్ణి



శశి - రామా ! నన్నర్థం చేసుకోవడం లేదు. నువ్వు, నేను కూడా యేదో వాగ్దత్తాన్ని పట్టుకు వేళ్ళాడుతున్నా ననుకుంటున్నావు. ఈ నిముషంలో నిన్ను చూస్తే ఏమన్నా యిచ్చేటంత ప్రేమ లేకపోతే, డెబ్భైవేల వాగ్దత్తాలు లక్ష్యం చేసేదాన్నను కున్నావా? అన్ని ప్రమాణాలకన్న అధికమైన ప్రేమ నన్నిక్కడి కీడ్వకపోతే యీ అర్ధరాత్రి నీతో వుంటాననుకున్నావా యిక్కడ ? ఎన్నాళ్ళయినా నా సంగతి నీ కర్థము కాదు? ఇంక నీ వన్నట్టు ప్రయోజన మేముంది? నేను వెడతాను.

అని అతని భుజముపై చేయివేసి ఆమె తలుపు వద్దకు వెళ్ళెను.

రామ - వొద్దు, వొద్దు, వెళ్ళవద్దు. నీ మీద నిజంగా ప్రేమ వుంది. నీకు తెలీయా వుందని?

రామారావు లేచి ఆమె వద్దకు వెళ్ళెను. ఇద్దరును కిటికీ వద్ద నిలుపబడిరి.

శశి - ఏమో ! చెప్పగా విన్నాను వుందని. ఎన్నోసారి యిది చెప్పడం? నీకు చెప్పడానికి విసుగులేదు. నాకు వినడానికీ విసుగులేదు.

గాలికి కదిలి శశిరేఖ చీరచెరగు అతని చేతికి తగిలెను. ఆమె మెడలోని పువ్వుల వాసన అతనికి కొట్టెను. రామారావు ఆమె భుజముపై చెయ్యివేసెను.

శశి - వొద్దు, వొద్దు. చాలా తప్పు పని చేస్తున్నావు వదలు.

రామ - నా హృదయం రాయనుకుంటున్నావా?

శశి - కాకపోవడం చాలా సందేహమే.

రామ - అట్లా అంటావా? న్యాయమేనా?

అతని చెయ్యి ఆ మెడపై పడు వెంద్రుకలతో ఆడుకొనుచుండెను.

శశి - అనక? నీకు ప్రేమ కూడా తెలుసునా? ప్రేమ వున్న వాళ్ళిట్లా నిరంతరం సందేహిస్తో వుండరు.

ఆమె అతనికి దూరముగా జరిగెను.

రామ - ఎందుకు నాతో అట్లా పోట్లాడతావు?

తిరిగి ఆమె మెడచుట్టును చెయ్యివేసి దగ్గరకు లాగుకొనెను. ఆమె చెవినంతను చేతితో కదలించుచుండెను. శశిరేఖ అతని చెయ్యిని తీసి వేసెను.

రామ - నీకు నా మీద ఇంకా సందేహమేనా? నువ్వు ఎంత పెట్ట చేసినా, ఎంత క్రూరంగా నన్ను నమ్మించి వదిలినా, నీ మీద ప్రేమ పోయిందీనాకు

శశి - ఇంకా నువ్వది మరచిపోలేదా? నన్ననడం సులభమే కాని, నన్ను నీతో నీ యింట్లో వుణ్ణీమని ఏడుస్తో ఎంత బతిమాలుకున్నా నీ పవిత్రత నువ్వు చూసుకున్నావు కాని వప్పుకున్నావా? నా గతి యేమవుతుందో ఆలోచించావా ఇతరుల విషయమై యే మాత్రమూ ఆలోచించని స్వార్ధ పరత్వఉకాక యింకేమిటి యీ పవిత్రత? ఇంతేనా నీ ప్రేమ?

రామ - సరేకాని, నీతి పోయిన తరవాత వివాహమెందుకు? జీవిత మెందుకు? నా ఆత్మ రహస్యాన్ని పోగొట్టుకుంటే నన్ను నువ్వే ప్రేమించవు ఆఖరికి

శశి - అట్లా నా స్వేచ్ఛను పోగొట్టుకున్న తరవాత నువ్వు మాత్రము నన్ను ప్రేమిస్తావా ?

రామ - నా ఆలింగనమున స్వేచ్ఛలేదా?

శశి - ఆలింగనము ఇంక వదలనిదయితే, మహా సంకటమవుతుంది. ఇప్పటికీ నిన్ను నీ స్వార్థము వదల్లేదు. నన్ను నీకు శాశ్వతంగా కట్టివేసుకుని సుఖ పడదామనుకుంటున్నావు. నేనెంత నలిగితే నీకేం? అట్లాగా ప్రేమను పొందటు స్వేచ్ఛలోగాని ప్రేమ బతగదా? ఇట్లాంటి స్వార్థానికి నేను లోబడతానా? నీకు తెలీడంలేదు. నా స్వేచ్ఛ పోతే నేను నీకు మహాభారమౌతాను. నువ్వే విచారిస్తావు ఆఖరికి. మనం సౌఖ్యమే మాత్రం పడడం? నువ్వెట్లాగో ఒకలాగు ఓర్చుకుంటావు గాని నేను ఓర్చుకోలేను. నేను కష్టం కలిగించే పని యేదో వొకటి చేస్తే నీ ప్రాణం పోయినట్లుంటుంది. కనుక మొదట నుంచీ అట్లాంటి బాధ్యత పెట్టుకోవద్దంటు న్నాను.

రామ - అట్లా అంటావుగాని నీచంగా జీవనంలో ఏమీ ఉద్దేశ్యాలు లేకుండా ఎట్లాగో ఒకలాగు కలిసివుండేవాళ్ళకీ మనకీ భేదమేమిటి? అంతకంటే అసహ్యం వుంటుందా?

శశి - మన అభిప్రాయాలు ఉన్నతములైనప్పుడు మన సంబంధం కూడా ఉన్నతమే అవుతుంది. తప్పు తప్పు కాకపోవడం, మన వుద్దేశ్యాల్ని పట్టివుంటుంది గాని, మనం చేసే పనుల్ని బట్టి వుంటుందా. ఇంకొకరిమీద ప్రేమ పెట్టుకొని తమ భర్తలనేవాళ్ళతో పడి వుండటం లేదూ? అది పాపం కదూ? అదే వప్పుకొన్న ప్పుడు, మన ప్రేమ తప్పా?



రామ - ఏమో నాకది యిష్టం లేదు.

శశి - ఇట్లా చూడు. నన్ను వదలగలవూ? ఎంత కఠినమబ్బా! పోనీ వివాహం చేసుకుందామా నీ యిష్టప్రకారమనిపిస్తుంది. ఎట్లా అయినా ఆడదాన్ని. కాని నాకు తెలుసు. మన ప్రేమ చచ్చిపోతుంది. అడవిలోని చిలకని తీసుకొని పంజరంలో పెట్టి ఆ పాట పాడమంటే పాడుతుందా? తరవాత నువ్వే పశ్చాత్తాపపడతావు. నీ మోహంలో దుఃఖం చూసి బతకలేను. రామా, నన్ను వదులుతావా? నాకేముంది పిచ్చిదానికి? నీకేదో భక్తి వుంది బతకడానికి? నాకేముంది? ఏదో అభిప్రాయం కోసం ప్రేమ, సౌందర్యమూ, సంతోషమూ, వదులుకుంటావు? ఇంతేనా, యిట్లా చూడు, దగ్గరికిరా.

అని అతనిని దగ్గరకు తీసుకొని ముఖమును ఎత్తి ముద్దు పెట్టుకొనెను. శశి భుజముపై తల పెట్టుకొనెను. ఆమె కండ్ల వెంబడి నీరు బొట్లు పడెను.

రామ - ఏమిటది శశీ, ఎందుకు?

అని ఆమె పెదవులపై ముద్దుపెట్టుకొనెను. ఆమె కన్నుల నీరు తుడుచుచు ముఖమువంక చూచుచుండెను.

శశి - నా గుండెల్లో ఏదో నెప్పిగా వుంది. యీ సౌఖ్యాన్ని నా హృదయం భరించలేనట్లుగా వుంది. కళ్ళు తిరుగుతున్నాయి. సోఫా మీద కూచుందాము.

శశిరేఖ రామారావు మెడచుట్టునూ చెయ్యివేసి అతని రొమ్ముపై తలపెట్టుకొని కళ్ళు మూసికొనెను. రామారావు ఆమె నడుమును కౌగలించుకొని తల ముద్దు పెట్టుకొనెను. శశిరేఖ హృదయమున యూపిరి కష్టముగా వచ్చుచు రామారావు వక్షమున భారముగా నుండెను. ఆహా అట్టి భారమెంత మధురము! ఆ స్పర్శానంద ములో రామారావు మనసు మూర్ఛిల్లెను. అతని నరములతని నియమములను ఉల్లంఘించుచు పరువెత్తెను. అతని హస్తము లామెను దగ్గరగా బిగించి కౌగలించు కొనెను. ఆహా యేమి అందము! ఆ ముఖము రంగే చాలును. ఆ కంఠము వంపే చాలును. ఆ పెదవుల తీరే చాలును. శశిరేఖ కదిలెను.

రామ - కదలకు అట్లాగే పడుకో.

శశి - ఊపిరాట్టంలేదు.

గడియారము రెండుగంటలు కొట్టినది.

ఆమె మృదు చర్మము కంఠము క్రింద అతని చేతికి తగిలెను. వంగి అక్కడ ముద్దు పెట్టుకొనెను.

శశి - తగ్గింది. ఇంకా తగ్గకుండా వుంటుందా?

రామారావు తలను రెండు చేతులతో తీసుకొని ఆమె వక్షమున కొనెను. రామారావు లేవలేదు.

మూడు గంటలు కొట్టినది. రామారావు తటాలున లేచెను.

రామ - ఛీ, ఛీ, ఏమి చేశాను, ఎందుకొచ్చా నిక్కడికి? నా నీతి నియ మంటలో కలిశాయి. ఛా, ఛా, బతకడమెందుకు? నేను వెడుతున్నాను. ఎన్నడూ రాను. ఆఖరుసారి. వొప్పుకోవు కదూ?

శశిరేఖ మాట్లాడలేదు. మంచముపై పరుండి అతనివైపు తే చూచుచుండెను. మెల్లగా తల యూగించెను.

రామ - నేను వెడుతున్నాను.

శశిరేఖ తటాలున లేచి రామరావును కౌగిలించుకొనెను.

శశి - నన్నిట్లా వదిలి వెడతావా? ఇప్పుడు నా దగ్గర వుండకుండా ఏదో నీచంగా వుంటుంది నాకు. నేనుండలేను. నువ్వట్లా వెడితే బతకలేను వదలకు. నీకు తెలీదం లేదూ? వెళ్ళవద్దు రామా రా, రా.... .... ......

ఆమె వక్షము దుఃఖముతో ఆవేశముతో యూగుచుండును. అతని లను రొమ్మును ముద్దు పెట్టుకొనెను. ముఖమంతయు కన్నీళ్ళతో తడిగా వళ్ళు గడగడ వణకుచుండెను. రామారావు కంఠమున పట్టు వదులగుచుం

రామ - తప్పు, నేనుండను. వొదులు.

అని ఆమెను విదిల్చెను.

శశి - రామా, రామా ! గుండెల్లో నొప్పి చాలా యెక్కువగా వుం కళ్ళు తిరుగుతున్నాయి. ఒంటరిగా వదలకు. భయం వేస్తోంది. వెళ్ళకు, నీకు దయ అనేది లేదూ ? నేను బతకను ఇంక.

రామారావు ఆమెను మెల్లగా తోసెను. ఆమె పక్కమీద నిశ్చేష్టితయై

..........................................................

..........................................................



మరునాడు సాయంత్రము రామారావు దండం స్టేషనువద్ద నిలబ యుండెను. అతని ప్రక్క స్టేషను మాస్టరు యుండెను.

రామ - ఈ మధ్య ఇంక రైలు లేదా?

"లేదు. తొమ్మిదింటికే రాత్రి."

రామ - ఏడింటికో రైలుండాలే.

"కాలము మార్చబడినది."

రామ - నేను వెంటనే కలకత్తా వెళ్ళాలి, వెళ్ళితీరాలి. ఒక్క నిమిషం ఆలస్యానికి వీలులేదు.

"వీలులేదే."

రామ - గూడ్సురైలన్నా లేదూ? ఎట్లాగో ఒక్కలాగు వెళ్ళాలి?

"వ్యవహారమా? ఎందుకు?"

రామ - ఏదో ఒకటి. వెళ్ళాలి, చావో, బ్రతుకో కింద వుంది. వీల్లేదూ?

"ఎంత తొందరపడ్డా లాభంలేదు, తొమ్మిదింటి వరకు రైలు లేదు."

ఆ కాలము ఏ నరకమున గడపెనో అతనికే తెలియదు. చివరికి మెల్లగా పాకుతూ రైలు వచ్చెను. రామారావున కది కదులుచున్నట్లే కనపడలేదు.

శశిరేఖను వదలిన తరవాత నిప్పులలో పొరలుచున్నట్లుండు పశ్చాత్తాప మతని నావరించెను. తన క్రూరత్వము, నీచత్వము, స్వార్థము అతని కన్నులకు కట్టినట్లు కానవచ్చుచుండెను. నిన్నటిరాత్రి శశిరేఖను వదలిన పని అతి నీచమని సిగ్గుతో అతనికే పరమ అసహ్యముగ తోచెను. తన నీతిని పవిత్రతను కాపాడుకొను టకు, తన బలహీనతకు బలిగ నామెను నరక బాధలో త్రోసి వచ్చెనుకదా? అతని అహంభావమంతయు కరిగిపోయెను. అధిక క్షుద్రునివలె కాన్పించెను. ఇంతకాలమును తానెంత గాఢాంధకారమందుండెను ! అతనిని చూచిన అతనికే గర్వము! ఇతరుల వలెగాక, తనకెంత ఇంద్రియ నిగ్రహము, ఎంత పవిత్ర చారిత్రము, ఎంత యుదారము, ఎంత న్యాయము ! అనుకొని గర్వపడుచుండెను. అదిప్పుడెక్కడుండెను? పాపము చేయకపోయిన సరియా ! తనను తానే నమ్మలేని ఆ బలహీనత యేమిటి? ఆ పిరికితనమేమిటి? ఆ స్వార్థమేమిటి? ధైర్యముతో, ఉదారముతో, చివరకు పాపమును చూచిన భయపడని తన స్వార్థమును త్యజిం

చెడు శశిరేఖ యుత్తమురాలా? తానా? పవిత్రత కొరకు, ఇంకొకరిని నరకమున ముంచి తన బలహీనతను కాపాడుకొనెడు తానా, ఛీ, ఛీ, తన నీతి తనను అధముని చేసెను? మనసు తీవ్రమైన కోర్కెల పుట్టయైనను పాపము చేయుటకు ధైర్యములేక చేతులు కట్టుకొనెను. ఎందరు మహాత్ములు పుణ్యమూర్తులుగ పరిగణింపబడుట లేదీ లోకమున? తానును అంతే?

ఆమెపై ప్రేమ మహా బాధవలె నాతని నాలింగనము చేసికొనెను త్వరితముగ నామెవద్దకు పోయెను. ఇక ముందామెకు దాసానుదాసుడైనను తాను చేసిన యుపకృతి తీరదు. ఆమె పాదములపైబడి క్షమింపమని వేడుకొనవలయును. ఇకను కలకత్తా రాలేదు. చేతులు నులుముకొనెను. ఇటునటు తిరిగెను. నిమిషము కొరకుచున్నట్లుండెను. ఒక్కసారి ఆమెను చూచిన చాలును.

చిట్టచివరకు కలకత్తా చేరెను. వెంటనే బండిమీద యింటికి త్వరితముగ వచ్చెను. త్రోవలో ఆశ్రమము వద్ద యింకను దీపములు వెల్గుచుండుట చూచెను. శశిరేఖ ఇంకను మేల్కొని యున్నదేమో అడగవలెనని బండి దిగెను. గుండెలు కొట్టుకొనుచుండెను. కాళ్ళు వణకెను. ఎందుకో ఆ భయము. అతనికే తెలియదు. నిద్రపోవుచుండిన ఉదయముదాక ఆగవలసినదేకదా? రామారావు వచ్చు చప్పుడు విని అచటనే ఇంక యిరువురితో కూర్చునియున్న నవజీవనదాసుగారు తల్లెత్తి అతనిని చూచిరి. వెంటనే ఆయన ముఖమున సంతోషము కనబడెను.

నవ - ఏమండీ శశిరేఖ ఎక్కడుంది?

రామ - ఇక్కడ లేదూ?

నవ - లేందే? నిన్న రాత్రి నుంచీ కనబడ్డంలేదు, ఏమయిందీ చెప్పండి మీకు తెలీదూ?

రామ - తెలీదు. నిన్న రాత్రి చూశాను. అంతే.

నవ - మీకు తెలీకపోతే ఎవరికి తెలుస్తుంది? మీకు తెలుసు. చెప్పండి ఆమె నాకు కన్నబిడ్డకంటె ఎక్కువ. ఇప్పుడు తెలుస్తోంది. చెప్పరూ?

రామారావు శరీరము వణకుచుండెను. మూర్ఛ వచ్చుచున్నట్లుండెను.

నవ - నాకామె మీద కోపంలేదు. ఏం చేసినా ఆమె నంటదు. ఎట్లా వున్నా సరే, ఏం చేసినా సరే, ఎక్కడనున్నాసరే, చెప్పండి నేనేమీ అనుకొనను.



రామారావు ముఖము సిగ్గుతోడను కోపముతోడను ఎర్రబారెను. కాని ఏమియు ననలేదు. రక్తము రివ్వున తలకెక్కుచుండెను.

రామ - అన్నిచోట్లా వెతికారా?

నవ - కనపడకపోతే మీతో వుండి వుండాలనుకున్నాము. ఇప్పుడు మీరు తెలీదంటున్నారు, నా బిడ్డ యేమయినది? ఎట్లా వున్నదో? ఏమైందో? నా బిడ్డని నాకు వప్పగించండి.

రామ - మీరు పళ్ళు తెలీకండా మాట్లాడుతున్నారు. నాతో మాట్లాడకండి.

అని బయటకు వచ్చెను. శశిరేఖ ఏమయినది? గుండెలలో పెద్ద రాయిపడెను. మృతి చెందలేదుకదా? ప్రాణహత్య చేసికొని యుండువలెను. లేకపోయిన యేమయినది? ఎక్కడకు పోగలదు? తనంత నిర్భాగ్యుడెవడు? ఆహా తన పవిత్రత, తన నీతి, తన నిర్మలత్వము చివరకెంత చేసినవి? అయ్యో ! శశిరేఖ శీతాకోకచిలుకవలె నలిగిపోయెను కాబోలు, యీ పెద్ద బండల క్రింద! ఇంకెక్కడి శశిరేఖ? ఇంకా బ్రతికియున్నాడే తాను? ఎంత నీచుడు తాను? తనను వదలలేక, తన క్రూరత్వమును భరింపలేక, శశిరేఖ మరణించినది. ఎంత ఏడ్చినదో, ఎంత నిరాశ చెందినదో? స్వార్థము స్వార్థము. పాపమునకు జడియు స్వార్థము. అంతకన్న పాపమీ లోకమునలేదు. పవిత్రత అను పుణ్యనామముతో తన స్వార్థమును కప్పి దానితో కన్నులు గానక ఎట్టి నరక కూపమున దూకెను తాను? ఎన్ని సుకృతము లిట్లు మహాపాపములను కప్పుచున్నవి? ఎన్ని శాస్త్రము లాధారపడుచున్నవి. ఘోర పాతకములను మహా నీచకృత్యములను, మానవుని దుష్ట ఆవేశములను, అతి నీచమైన బానిసత్వమును కప్పిపుచ్చుటకు ?

శశిరేఖా పాపాత్మురాలు? ప్రేమాగ్నియందు తన జీవితమును నిస్సందేహముగ హోమముచేసిన శశిరేఖా? సత్యమునందలి గౌరవముచే, ప్రేమయందలి ప్రేమచే దహింపబడిన శశిరేఖా అపవిత్రురాలు? తానా పవిత్రురాలి మహా ప్రేమ సముద్రమున మునింగి అమరత్వమును పొందు భాగ్యము తనకులేదు. తన ప్రేమచే తానే యుక్కిరి బిక్కిరియై మరణించినది కాబోలు? ప్రేమ భానునందుకొనుట కొరకు వేడికి రెక్కలు కాలి కూలినది కాబోలు శశిరేఖ ! ఆ కాంతివైపు కన్నెత్తుటకుకూడ

అర్హుడా తాను? చేయి పట్టుకుని బ్రతిమాలినను ప్రేమ మహాదేవతకు తన స్వాధీ నర్పింప సాహసింపని పిరికిపంద తాను. ఇంకను బ్రతికియున్నాదు కదా!

తన గది వద్దకు వచ్చెను. మెట్లవద్ద ఆగెను. లోపలికి వెళ్ళి ఏమి లాభము ఎక్కడని వెదుకుట? రాత్రి పన్నెండు గంటలయింది. అంతయు నిశ్శబ్దము. మరచిన గృహములవలెనుండె నా వీధులు. పెనుభూతముల వలె గ్రుడివారివలె నుండి పొడుగైన మేడలు, పూవులమ్మే దుకాణమొకటి మాత్రము తెరిచియుండెను. నవ్వు పీలికలు కట్టుకొన్న యొక బాలిక పరువెత్తెను, చెయ్యి విదల్చి కోపమున నొ పురుషుడు వెనుక పరుగెత్తెను. ప్రక్క యింటియందు ఎవరో దగ్గుచుండిరి.

ఏమియును తోచదు. గదిలో నేమైనా తనకు చీటి పెట్టినదే మోనని యూహి యోచించి అతడు పైకి పోయెను. చీకటి, గదియంతయు మల్లెపువ్వుల వాస దీపమును వెలిగించెను. చీటిలేదు. ఏమియును లేదు. దుస్తులు తీసివేసెను. గదిమ సోఫాయును చూచునప్పటికి ఎక్కడలేని దుఃఖమును, బయట నాపుకున్న ఆవే మంతయు వచ్చెను. ఆ సోఫాపై నిన్న రాత్రి శశిరేఖ కూర్చున్న స్థలమున తలనానిచి ముద్దు పెట్టుకొనెను. పోయెనా శశిరేఖ ఇంక కానరాకుండ పోయెనా. కలయందు కానవచ్చు ప్రేమ రూపము వలె ఒక్కక్షణము తనను లాలించి మాయమయ్యెనా? ఏదీ రాత్రి తన తలను అదిమి కొనిన ఆ చేతులేవీ, ఒక్కసారి కౌగలించుకొన కూడదూ? ఆ కండ్లు ప్రేమతో తిరిగి ఒక్కసారి చూడకూడదూ తనను? రామూ, నా మీద ప్రేమ లేదూ? అని ఆ మృదు కంఠమున మాట వినకూడదూ! ఆ చిరునవ్వు ఆ ఎర్రని చిన్న పెదవులు ఏవీ! ఏవీ! ఇప్పుడు తాను సిద్ధముగ నున్నాడే! ఏమైనను ఎన్నటికినీ నిన్ను వదలను శశి యని కౌగలించుకొనుటకు సంసిద్ధుడయి యున్నాడే శశిరేఖ కనపడకూడదూ? తన గదిలో దీపమును జూచి తలుపులోనుండి శశి వద్దకు రారాదూ? ఆ చేతి కొనగోరును తాకుటకు తనకిచ్చిన చాలదా? నీతి అను మాటను తొక్కి చింపి అవతల పారవేయుట చేతనయిన అదే యింత ముప్పును కొనివచ్చినది. గుండెలలో మహాభారము, మనసులో పెద్ద దుఃఖమును, ఆ భయము, నిరాశ, పశ్చాత్తాపము ప్రేమ ఇన్ని అతనిని చలింపచేయుచుండెను. ఒక్కసారి ఆమె కనపడిన చాలును. ఏమి చేయుటకును తోచలేదు. నరములు పీకుచుండెను, కాళ్ళు లాగుచుండెను. తనకు తెలియకనే మంచము వద్దకు పోయెను.



...టిటి? రక్తము చిమ్మిన గొట్టములతోవలె పడలంతయు పరుగెత్తెను. తెల్లని ఆ పట్టిపై అడ్డముగ శశిరేఖ పరుండి నిద్రించుచుండెను. ఆ గడ్డము క్రింద పెట్టుకొని యుండెను. దీర్ఘములగు కండ్ల వెంట్రుకలు చెంపలను తుడుచుచున్న ...డెను. కన్నీళ్ళ తడి చారలు కంటి రెప్పల నుండి పెదవుల వరకు నట్లేయుండెను. ...లిన మల్లెదండలట్లే వ్రేలాడుచుండెను. ఆ ముద్దు కంఠమున ఆ సుందర ...ముపై పడుచు తనకొఱకే కాబోలు ఇక్కడ వేచియున్నవి. ఆహా! ఏమి అందము! ...ము నవ్వుచున్నట్లేయున్నది. తడిగా ఎర్రగా ముద్దుల కొఱకు వేచి యున్నట్లే ...న్నది. ఆ నోరు దీర్ఘములైన ఆ కన్నులు, చీరలో నుండి మెరయు దేహము ...ము శంఖములా యున్నట్లుండు మెత్తని ఆ హస్తములు వంగిన భుజములు ...పూ లేవి పొంగు వక్షము, యూపిరితో కదలుచున్నట్లే యున్నవి. ముఖమును ...ను కప్పుచున్న ఆ నల్లని శిరోజములు ఆ కనుబొమ్మలు అతని ఆలింగనము ...యున్నవా? ఎందుకు వేచియున్నట్లు పడుకొని యున్నది? దేనికొరకు? ఏ ...లింగనము కొరకు?

తనకొరకే కాబోలు! యెంతటి ప్రేమ ఆమెకు తనపై!

"శశీ" అని ఆమె ప్రక్కనపడి ఒడలు తెలియక, బంగారువలె మెరయుచు, ...ద్ర తరంగమువలె వంపు తిరిగిన ఆ నున్నని వక్షమును, కంఠమును ముద్దు ...ట్టుకొనెను. "వొచ్చాను" "శశీ" "చూడు" అని ఆమె కన్నులను, గాఢముగ ఆమె పెదవులను తన పెదవులతో వొత్తెను. శశిరేఖ మెల్లగా కన్నులను విప్పి అతని ...లోనికి చూచెను. చాల బలహీనముగ అతని కంఠమును తనమీద నించి ..., తన చెయ్యిని గుండెలపై పెట్టుకొనెను. బాధతోవలె కనుబొమలు ముడిపడెను. పెదవులు తెరచి మాట్లాడబోయెనుగాని మాటరాలేదు. "శశీ, వొచ్చాను, యింక ...న్ను వొదల"నని జుట్టును పైకితీసి, రామారావు ఆమె చెవులలో ననెను. ఆమె పెదవులు గులాబిరేకులవలె సన్నగా అతని పెదవులను తాకెను. "యెందుకు ...ల్లాడవు? నువ్వు చూడు యిట్లా" అని రామరావు ఆమెను తన దగ్గరికి లాగుకొని ...దుముకొనెను. ఆమె నిట్టూర్పు విడిచి కనులను ఆనందముతో మూసుకొన్న ...డెను. "ఒక్కసారి, లే" అని రామారావు మహాసౌఖ్యమున ఆమెపై తన ...లానించుకొనెను. కాని శశిరేఖ కదలలేదు.

# ఉపసంహారము

ఆ రాత్రే నవజీవనదాసునకు కలవొచ్చెను. స్వర్గమున యిద్దరు దేవ
మధ్య శశిరేఖ నడచుచున్నది. దేవత్వమామె ముఖమున ప్రకాశించు
నవజీవనదాసు వారికెదురు వచ్చెను.

నవ - యీమె నెక్కడకు తీసుకొని పోవుచున్నారు?

దేవ - స్వర్గానికి?

నవ - శశీ. మమ్మల్నందరినీ విడిచి వెళ్ళిపోతున్నావా?

శశి - మీ కెవ్వరికీ నే నక్కర్లేదుగా?

నవ - నాక్కావాలి. నువ్వు నాకు కావాలి! నాకప్పుడు తెలీలేదు
కావాలి నాకు. నిన్నెరగకుండా నీకు నా ప్రేమ నర్పించని నా జీవితము వ్య

శశిరేఖ చిరునవ్వు నవ్వెను.

శశి - మీరు నాకు అక్కరలేదు.

దేవ - అవును, యీమె ఆ లోకంలో వుండ తగినది కాదు, ఎక్కడ ప్రే
అంతం లేదో, అంతా ప్రేమమయమో, యెక్కడ ప్రేమకు నీతి దుర్నీతి అ
లేవో, అట్టి లోకానికి వొస్తోందీమె. తను మనోకల్పితములైన దివ్య ప్రేమ మూర్తు
లీలలకై యీమెకు వరమీయబడినది. ప్రేమించినవారికి పాపములేదు. ప్రేమ
ప్రేమాగ్నిలో తప్తమైన పరిశుద్ధమైనదీమె ఆత్మ. ధన్యురాలు. ప్రేమించినది

ఆమె నడిచిన త్రోవలో దుమ్మును, వొంగిన నవజీవనదాసు తన శిర
ధరించెను.